# కథాక్రమం

# 1. మిన్నూ మన్నూ ఏకం చేస్తూ గాలీ వానా ...

నిదానంగా, పెళ్లినడకలతో ఒకటీ, రెండూ, మూడూ చినుకులు మొదలయి, చూస్తూండగానే చింతగింజలంతయి, హోరున కుంభవృష్టి ఊపు అందుకుంది. వాన పెద్దదయేలోపున ఇల్లు చేరుకుందాం అని పరుగులాటి నడక అందుకుని, అది పనికిరాదని నిశ్చయించుకుని, బస్టాపువేపు మళ్ళేను తల దాచుకోడానికి.

అప్పటికే షెల్టరు కిటకిటలాడుతోంది బస్సుకోసం వేచివున్నవారితో. అంటే బోల్డుమంది ఉన్నారని కాదు. ఐదారుగురు ఉన్నారు. ఆ గూడు వాళ్లతోనే నిండిపోయింది. గాలివాలుగా కొడుతున్న జల్లు చూసుకుని, రెండోవేపు షెల్టరుకి పక్కగా నక్కేను కొంతలో కొంతయినా రక్షణ అని. ఆ కంతలతో నిండిన చుట్టు పలకలకి లోపలివేపు నించున్నాయన రవంత జరిగి, "ఇటు రా, ఫరవాలేదులే," అన్నాడు సౌమ్యంగా. నేను చిరునవ్వుతో అతనిపక్కకి జరిగేను. తుప్పజుట్టుమీద మాసిన టోపీ, అంతకంటె ఎక్కువ మాసిన గళ్ళచొక్కా, భుజాన ఏరంగో తెలీని సంచీ, చేతిలో మరో చిన్నసంచీ – మధ్యాన్నంకూడు కాబోలు - గంట కూలీ కష్టజీవి అయి ఉండాలి వాలకం చూస్తే. ఇటుపక్కన ఓ ఆడమనిషి, యాభై పైనే ఉండొచ్చు, ప్లాస్టిక్ పాంఛో కప్పుకుని నిరామయంగా నిలుచుంది. బస్సు రాకపోయినా నేనేం అనుకోను అన్నట్టుంది ఆవిడ వాలకం చూస్తే. వెనక ఇద్దరు సెల్లులు చెంపలకానించుకుని గడగడ చెప్పేస్తున్నారేదో ఎవరికో. చెప్పాల్సిందంతా ఇప్పుడే చెప్పకపోతే, మళ్ళీ అలాటి అవకాశం రాదనుకున్నారేమో. వాళ్లమొహాలు చూడ్డానికి నాకు మొహమాటంగా ఉంది. నేను వెనుదిరిగి వాళ్లవేపు చూస్తే, అదేదో సౌంజ్ఞ అనుకుంటారేమో, వాళ్ళు నన్ను

విసిగిస్తున్నారని నేననుకుంటున్నానని వాళ్ళనుకోవచ్చు. ఆ తరవాత వాళ్లకి నేనూ, నాకు వాళ్లూ క్షమాపణలు చెప్పుకోలేక చావాలి. కానీ ఎంత వద్దనుకున్నా మాటలు మాత్రం వినిపించకమానవు కదా – "రేపు పెద్ద సేలు కదా, రారాదూ?" "నాకింకా జీతండబ్బులు చేత పడలేదు, ఎల్లుండిదాకా ఆగరాదూ? లేదంటే, నువ్వియ్యి, తరవాత ..." "మా అమ్మమ్మ వస్తోంది ... చెప్పలేనంత చాదస్తం," "అబ్బ, ఏం వాన, ఆపీసు మూసేస్తే బాగుండు," "అడిగేను, వచ్చినవాళ్ళు వచ్చేరు కదా మూసేసి పొమ్మనడమేమిటి?" "నాకు అసలే కీళ్ళనొప్పులు, ఈ చలిలో వానలో నొప్పి రెట్టింపవుతోంది." "అవునెళ్ళాలి డాక్టరుదగ్గరికి. టైమేదీ?" "నాకు కాన్సరేమోనని అనుమానం," "ప్రిగ్నెంటేమోనని ..." "మా పిల్లాడు కారు తీసుకు ఎటో పోయేడు నిన్నట్నించి కనిపించడం లేదు." "మన్లాటాళ్ళని ఎవరు పట్టించుకుంటారు?" ... ...

ఏంటో, హోరుమని గాలీ, కుండల్తో కుమ్మరిస్తున్నట్టూ వర్షపాతం వీటిమధ్య ఈ కబుర్లేమిటో ... అవి నాచెవిని పడడం నాకు మరింత ఇబ్బందిగా ఉంది. తొంగి చూసేను పోనీ అటుపక్కకి వెళ్దామా అని. అటువేపునించే జల్లు కొడుతోంది.

షెల్టరుపలకని అదరగొట్టేస్తు గాలీ, కుండపోతగా వానా ... జనాలకి షెల్టరుగా చెలామణి అవుతున్న ఈ గూడు తాటాకులతడకలకంటే అధ్వాన్నం. మరో విసురు గట్టిగా గాలి వీస్తే గడ్డిపోచలా ఎగిరిపోగలదు. సందేహం లేదు. మూడువేపులా చుట్టుకుని ఉన్న స్టీలుకంతల్లోంచి తుప్పర్లు మీద పడి బట్టలు తడిసిపోతున్నాయి.

"షెల్టరుకి ఈ కంతలేమిటి?" అన్నాను నాపక్కనున్నాయనతో.

"అది ప్రభుత్వం"

"అయ్యో, నాసంచీ ... తడిసి ముద్దయిపోయింది, అందులో నాకాయితాలు ..." "నా పేంటు చూడు, ఈ పక్కనంతా ..." "ఉండుండు, వాళ్ళాఫీసుకి ఫోను చేసి అడుగుతాను ... బస్సు ఆరునిముషాలు ఆలస్యంట..." "లేదు, లేదు, అదుగో

వచ్చేస్తోంది," "కాదు, కాదు, అది దక్షిణానికెళ్ళేబస్సు, ఉత్తరానికెళ్ళేది ఆలస్యం," "అదేమిటి, ఉత్తరదిక్కున వాన లేదేమిటి?" "అదుగో ... సమయానికే వచ్చేస్తోంది ..." ఒకదానివెంట ఒకటి, రెండూ వచ్చేసేయి. ఎవరిబస్సులో వారు సర్దుకున్నారు, నేనూ, మరోమనిషీ మిగిలేం.

"నాతో పని చేసేఆవిడ వస్తోంది నన్ను తీసుకెళ్లడానికి."

తలూపేను అర్థమయినట్టు.

వానకథలు – వానా వానా చెల్లప్పా, వాకిలి తిరుగూ చెల్లప్పా, ... వానల్లు కురవాలి, వరిచేలు పండాలి ... వీధికాలువల్లో కాయితప్పడవలు, ... అమ్మతో ఎల్లమ్మతోటదగ్గర చిన్మయానందస్వామి ఉపన్యాసానికి వెళ్ళడం – అప్పటికింకా ఆయనకింత పేరు లేదు – తిరిగొచ్చేటప్పుడు పెద్దపెట్టున వాన, తుప్పగా తడిసినవోయిన చీరెలబరువుతో కాళ్ళీడ్చుకుంటూ ఆస్పత్రి అప్పుమీద పడ్డ అగచాట్లు, ... అస్పత్రి అప్పూ, కాలేజీ డౌనూ పాట్లు ...విశాపట్నంవాసులకే ఎరిక .. "నిన్ను రమ్మనకుండా ఉండాలిసింది, రేప్పొద్దున జలుబు చేసి, జొరం వొచ్చేస్తుందేమోన"ని అమ్మ పడ్డ తపన, ... ఆరోజూ, మర్నాడూ కూడా నాకేమీ రాలేదు కానీ ... అప్పట్లో ఇలా నామంచిచెడ్డలు చూడ్డానికెవరోఒకరు ఉండడంతో నేనెప్పుడూ నాగురించి ఆలోచించనే లేదు. ఇప్పుడు ఇక్కడికొచ్చేక తెలిసింది నాకు నేనే దిక్కని.

"నీకోసం ఎవరైనా వస్తున్నారా?"

ఉలికిపడి, ఆవిడవేపు చూసేను, "హా?"

"నిన్ను తీసుకెళ్ళడానికి ఎవరైనా వస్తారా?"

"లేదు. నేనిక్కడే..."

"ఎవరూ లేరూ? నా బస్ పాసిస్తాను. ఇంకో బస్సు వస్తుంది, అందులో వెళ్ళు."

"అవుసరంలేదు. అదుగో ఆదే మా కాంప్లెక్స్. అరమైలు కూడా లేదు. నడకకెస ం బయల్దేరేను ..."

"ఎందుకైనా మంచిది. ఈ పాస్ ఉండనీ. బస్సులో అక్కడిదాకా వెళ్ళొచ్చు."

“వద్దులే. అయినా నీకు మళ్ళీ అవుసరం అవుతుంది కదా.”

“లేదు. ఇది రెండు గంటలసేపే. అదుగో నాకారొస్తోంది. ఇంద.”

“వద్దమ్మా, నాకవసరం లేదు,” అంటూండగానే, ఆమె పరుగెత్తుకు వెళ్ళిపోయింది. రోజూ ఉద్యోగానికెళ్ళే మనిషి రెండుగంటల పాసు తీసుకోడమేమిటో.... మామూలుగా నెలపాసు తీసుకుంటే చవక కాదూ ... ఏమో, కాదు కాబోలు.

రాను రాను వాన ఉధృతమవుతోందే కానీ తగ్గే జాడ లేదు. ఇదేదో ఆశ్చర్యంగానే ఉంది. నక్క పుట్టి మూడు వారాలు కాలేదన్నట్టు, నేనిక్కడికొచ్చి ఏణ్ణర్థం కాలేదు కానీ ఇంతవరకూ నేనెప్పుడూ చూళ్ళేదు ఇంత ధాటీగా ఆక్కుండా వాన పడ్డం.

రోజూలాగే గంటలపంచాంగం చూసుకునే బయల్దేరేను సంచారానికి.

నాలాప్టాపు గంటగంటకీ ఇంకా కావలిస్తే పావుగంటకోమారు కూడా చెప్తుంది. రోజూలాగే ఇవాళ కూడా చూసుకునే బయల్దేరేను. నిజానికి టీవీలో కూడా చూస్తాను ఎందుకైనా మంచిదని. మనూళ్ళో ఆయవారపుబ్రాహ్మలు గుమ్మంలోకొచ్చి తిధివారనక్షత్రాలు మూణ్ణిముషాలు వల్లించి ఆపూట బత్తెం పుచ్చుకు వెళ్ళిపోతారు కానీ ఇక్కడ ఎండావానాపండితుడు పావుగంట చెప్తాడు నోరి – హై ప్రెషరూ, జెట్ స్ట్రీమూ ... ముప్పై శాతం, నలభై శాతం వాన పడుతుందనో పడదనో చెప్తే నాకేమిటి ఒరిగింది? పైగా ఈ ఊరొచ్చి ఏణ్ణర్థం అయింది, ఒక్కమారూ గట్టిగా గంటసేపు ఇలా జడివాన కురవలేదు. ప్రతిసారీ కొంపలంటుకుపోతున్నట్టో, యెవరో తరుముకొస్తున్నట్టో గబగబ నాలుగు చినుకులు తుప్పుతుప్పుమని రాలి ఆగిపోతాయి. కాగా, దూరంగా ఏ పక్కఊళ్ళోనో కురిసిన కుంభవృష్టిమూలంగా మాయింటిపక్కగా పారుతున్ననదిలోకి దేశంలో ఉన్న చెత్తా చెదారం అంతా కొట్టుకురావడం. నాకళ్ళతోనే చూసేను సోఫాలనించీ ఫోం కప్పులవరకూ ఆ కొట్టుకొచ్చే చెత్తలో చెప్పలేనంత వైవిధ్యం... ఎటొచ్చీ మనకి ఊరట కలిగించేదేమిటంటే, ఇది పారే నీరు కనక నాయింటివెనక నిలిచిపోదు. వచ్చినదారినే కాకపోయినా పోతున్నదారిలోనే కొట్టుకుపోతుంది తార్రోడ్డుమీద కొత్తకారులా (ఈ ఉపమ నాది కాదులే.). మళ్ళీ తెల్లారేసరికి, సుజనుడి వదనంలా

స్వచ్ఛంగా, నిష్కల్మషంగా, కంటికింపుగా పారుతూ, మనసుని తెరిపిన పడేస్తుంది. ప్రాణం కుదుటపడుతుంది ...

జోరుగా వీస్తున్న గాలి, యాభైమైళ్ళవేగంలో ఉన్నట్టుంది. వర్షం కుండలతో కుమ్మరించినట్టు ఏకధారగా ... అడ్డూ అదుపూ లేకుండా కురుస్తోంది. ఇంక ఆగితే బాగుండు, కనీసం తగ్గితే బాగుండుననిపిస్తోంది.

ఉరుములూ, మెరుపులూ, చెట్లు 30 డిగ్రీలకి వాలి అల్లల్లాడిపోతున్నాయి గాలి ఉధృతానికి తట్టుకోలేక. వాన కొంచెం ఒఖ్ఖ అయిదు నిముషాలు ఆగితే బాగుణ్ణు, నాయింట్లో నేను పడతాను ... నాయింటివెనక యేటిపాయ ఈసరికి పొంగి పొర్లుతూ ఉండాలి. ఇలా పెద్దవాన వచ్చినప్పుడు కుంకుడుగింజలంత నీటిబొట్లు ఏటిమీద పడి తుళ్ళుతుంటే ఫొటో తియ్యాలని నాకు ఎంతో కోరిక. ఇంట్లో ఉంటే ఆ కోరిక తీరి ఉండును, కానీ ఇంట్లో లేను! బస్సుస్టాపులో, రెండు బస్సులు వచ్చి వెళ్ళిపోయేక, విసిరి కొడుతున్న ముసురులో తలా బట్టలూ ఓపక్క తడిసిపోతుంటే, ఈ విశాలవిశ్వంలో ఏకాకిగా నేనూ ....

మరో మెరుపు మెరిసింది కళ్ళెదుట చెయ్యి చాపితే అందుతుందేమో అన్నంత దగ్గరగా. ఫెళ్ళున విరిగిన వేపకొమ్మలా మెరిసి, క్షణంసేపు ఆకాశంలో అట్టే ఆగి మాయమయిపోయింది. అలాటిమెరుపు ఫొటో తియ్యాలన్నది నా రెండోకోరిక. సమయానికి చేతిలో కెమేరా లేదు.

మరో కోరిక కాదు గానీ, సౌకర్యం అనొచ్చు, ఇంత ఉధృతంగా వాన పడుతున్నప్పుడు కారుని షికారుకి తీసుకెళ్తే, కారు కడగడం కూడా అయిపోతుంది కదా. కారు ఇంటిదగ్గరుంది. నేను బస్టాండులో ఉన్నాను. అర్థం లేని కోరిక!

ఏమిటో ఈ తీరనికోరికలు, కలసిరాని సౌకర్యాలూ, అక్కరకు రాని చుట్టాల్లా ... నాబతుకంతా ఇలా అందీ అందని అవకాశాలతోనే తెల్లారిపోతోంది.

ఎక్కడో మళ్ళీ మహోద్వేగంతో గర్జించింది మేఘం. మళ్లీ ఉలిక్కి పడ్డాన్నేను. ఎక్కడ పడిందో. గాలి పదడుగులయినా లేని బడుగుమొక్కలని పట్టి ఊపేస్తోంది కంగాళీ

అత్తలా. ఆమధ్య ఓక్లహోమాలో వచ్చిన సుడిగాలి ... ఇంతకి పది రెట్లుంటుందని తెలుసు కానీ అలాగే ఇక్కడ కూడా రాదనేముంది? ప్రళయప్రభంజనం ఒకటొచ్చి, నన్నూ, ఈ స్టీలుగూటినీ ఎదుట ఉన్న కార్లనీ, మారీచసుబాహుల్లా ఎత్తుకుపోయి ఏ పక్కఊళ్లోనో మరో అడవిలోనో విసిరిపారేస్తే ... ఎప్పటికో ఎవరికళ్ళనయినా బడినా, నేనెవరో ఎవరికీ తెలీదు. ఏం చేస్తారో ... నాస్నేహితురాలు సలహా ఇచ్చింది ఏ సెల్లో తాళాలగుత్తిలో పేరో ఆనవాలుగా పట్టుకెళ్ళు రోజూ నడకకి వెళ్ళినప్పుడు అని. పోనీ, నా ఫోన్నెంబరు పచ్చబొట్టు పొడిపించుకోనా అన్నాను. అదయినా మంచిదే అంది తను. మ్. అది మంచిదెలా అవుతుంది. పచ్చబొట్టంత శాశ్వతం కాదు కదా ఫోన్నెంబరు.

నన్నెవరైనా తలుచుకుంటారా? ఏమని తలుచుకుంటారు? నాపిచ్చి కానీ ఏముంది తలుచుకోడానికి? ఇంటికెళ్ళగానే ఓ టపా రాస్తేనో - నేనింక లేనని తెలిసేక, మీరేమనుకుంటారో ఇప్పుడే చెప్పండని ఆర్ట్ బక్వాల్డ్ లాగ. హుమ్. ఆయనస్థానం ఏమిటి? నాస్థానం ఏమిటి? ఆయనకి చెల్లింది. నేనడిగితే అతిశయం అంటారు. వాళ్లని అడగడం ఎందుకూ, నేనే రాస్తే పోలే. ఇదీ హాస్యమే అనుకుని నవ్వుతారు, అదీ మంచిదే. నవ్వుతారా, నవ్వుకుంటారా, నవ్విపోతారా? అబ్బ, మనతెలుగులో ఎన్ని ఛాయలో, ఎంత సూక్ష్మమో ఈ తేడాలు, ... మ్. ఇంకా ఏం అనుకోవచ్చు? కోపగించుకోవచ్చు, నేనలా రాసేనని, విసుక్కోవచ్చు నామనసులో మాట ఈవిడకెలా తెలిసింది చెప్మా అని, హీహీహీ. ఆవిడ అలా అన్నందుకైనా మనం మరోలా రాయాలనుకోవచ్చు. అసలు ఏమీ అనుకోకపోవచ్చు, అనకపోవచ్చు. శతకోటి చావుల్లో ఇది మరో చావు ... ఈమధ్య చావులమాట ఎక్కువగానే వింటున్నాను. వయసు మీద పడ్డకొద్దీ ఇవే వార్తలవుతాయేమో ... విన్నప్పుడల్లా, నావంతూ వస్తుంది అనిపిస్తుంది. పాపం, చెప్పినవాళ్ళు అలా అనుకుంటారని కాదు. నాకలా అనిపిస్తుందంతే. రామం పోయినదగ్గర్నుంచీ ఇవే ఆలోచనలు ...

ఇంత భయంకరంగా వర్షం పడుతుందని తెలిస్తే అసలు బయల్దేరకపోదును. టీవీలోనూ, లాప్టాపులోనూ చూసేక, మరోమారు కిటికీలోంచి చూసి బయల్దేరేను. తూర్పుదిక్కున

అల్లంత దూరాన మేఘాలు నల్లగా మూసుకొస్తున్నాయి కానీ గాలివానపండితుడు "అప్పుడప్పుడు" అన్నాడు కనక ఇప్పుడే కురవదులే అనుకుంటూ బయల్దేరేను. వాన పడదనే సూచనలే ఎక్కువున్నట్టు కూడా చెప్పేడు ఎండావానాపండితుడు. అయినా యాభై శాతం వాన పడే సూచనలున్నాయంటే, పడుతుందనా, పడదనా? నాక్కావలసిందల్లా వాన పడుతుందా లేదా అన్నది స్పష్టంగా తెలియడం. వీధిలోకెళ్తే గొడుగు అవుసరం అవుతుందా అవదా అనే. సగం గొడుగు పట్టుకెళ్ళలేం కదా.

ఇంతకీ … వాన వెలవకముందే నాబతుకు ముగిసిపోతే, ఏమవుతుంది? నేను సృష్టించిన ఘనసాహిత్యమంతా ఏంకానూ? … హా. మళ్ళీ అదుగో అదే అతిశయం … మహా మహా రచయితలకే గతి లేదు. ఆయనెవరో చెప్పినట్టు చక్రవర్తి అశోకుడేడీ, జగద్గురు శంకరుండేడీ, మళ్లీ మాటాడితే ఈశతాబ్దంలోనే ఎందరో రచయితలు ఆనవాలు లేకుండా పోయేరు. … ఎవరూ మిగలరు పాఠాల్లోనూ పండితచర్చల్లోనూ తప్ప. అంతా క్షణికం. ఎందుకొచ్చిన గోల. హాయిగా రాసుకో. నీకు దినము గడవడానికి అదొక్కటే మార్గం కనక. ఆతరవాత ఏదో అవుతుందనీ ఆశించడం, ఏమీ కాదేమోనని బాధపడ్డం కూడా దండుగే. ఏమీ కాదు. అదుగో ఆ ఏటిలో చెత్తా చెదారంలాగే. నీరాతలు నీటిమీద రాతలు, అక్షరాలా…. జాలంలో రాస్తున్నావు కనక ఆ ఉపమానం చక్కగా అమిరిపోతుంది కూడాను.

నాకీ ధోరణి నచ్చలేదు. నారెండో నోరు మూసేసి, “విశాలదృక్పథం”లో ఆలోచించడం మొదలుపెట్టేను. నాకు ఏ ఆలోచనయినా నచ్చనప్పుడు "విశాలదృక్పథంతో" ఆలోచిస్తాను. అంటే, ఇవాళా రేపూ అనుకుంటే ఎంతో గొప్ప ప్రమాదంగా కనిపించేవి ఆ కాలమానం ఒక ఏటికో పదేళ్ళకో పెంచితే, ఆ ప్రమాదం చాలా చిన్నదిగా కనిపిస్తుంది. ఈ క్షణం ప్రాణాంతకమయింది ఈవారంలో ఈ నెలలో జరిగిన అనేకానేకసంగతులమధ్య పెట్టి చూస్తే, అంత ప్రాణాంతకంగా తోచదు. ఒస్, ఇంతేనా, పోనిద్దూ, లాటి మాటలొస్తాయి. …

వాన తగ్గుముఖం పట్టింది. ఇంతవరకూ పడుతున్నంత ఉధృతంగా లేవు ఇప్పుడు ధారలు. ఇంతవరకూ చీకట్లు ముసిరినట్టున్న ఆకాశం నెమ్మదిగా తెరిపిచ్చి, తెల్లబడుతోంది. చినుకులు చిన్నవయేయి. ఇంకొంచెంసేపుంటే, పూర్తిగా ఆగిపోతుందా, మళ్లీ పుంజుకుని విజృంభిస్తుందా? అట్టే దూరంలేదు, ఎలాగా బట్టలు సగం సగం తడిసిపోయేయి, జోళ్లు పూర్తిగా తడిసి ముద్దయిపోయేయి. వెళ్ళిపోనా? వీధుల్లో వరద, బురద, గటగట నడవడానికి లేదు. జారిపడితే మళ్ళీ మరో కష్టం... మరి ఎంతసేపు ఎదురు చూడ్డం, ఎప్పుడు ఆగుతుందో ఎలా చెప్పడం.

మళ్లీ కథలు - వర్షం. వానకి జడిసి, బస్సుకోసం దిగులుగా చూస్తూ టీకొట్టులో దిగులు పడిపోతూ కూచున్న బస్తీ యువకుడు, బస్సు రాదు, నువ్వెక్కడికీ ఎల్లేవు అంటూ జోస్యాలు చెప్తున్న తాత, “వొరసంవా? అదేటి సేస్తాది మనలని. సంపిడిసీనా?” అంటూ, వర్షంలో హుషారుగా లోపలికి దూసుకొచ్చిన పన్నెండేళ్ల పోతురాజు ...

నేను కదిలేను మీద పడుతున్న చినుకులని అభిమన్యుడిలా తప్పుకోడానికి ప్రయత్నిస్తూ, జారి పడకుండా అడుగులో అడుగేసుకుంటూ.

(జూన్ 19, 2013)

# 2. మిత్రభావము సేసి ...

పరకాంతలెదురైన మాతృభావము సేసి మరలిపోయేవాడుట ప్రహ్లాదుడు. నన్ను చూస్తే కూడా చాలామంది మరలుతారు ... నాపేపుకే ... మిత్రభావము సేసే!

ఈవిషయంలో అట్టే తికమక లేదు. ఇదంతా గతితార్కికభౌతిక సిద్ధాంతము ప్రకారము జరుగును అనుకుని నిరామయంగా స్వీకరిస్తూ వచ్చేను. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే దానికి ప్రధానకారణం నేను మెతగ్గా కనిపించడం అనుకుంటాను. ఈ మొహం చూస్తే ప్రమాదమేమీ కలిగేట్టు లేదు, ఏ తంటాలూ తెచ్చేట్టు లేదు అని వాళ్ళకి అనిపిస్తుందేమో. ఏనాటి బంధమో అన్నట్టు కబుర్లలోకి దిగిపోతారు అనతికాలంలోనే. ఒకొకప్పుడు ఎంతో ఆత్మీయమైన సంగతులు కూడా ఏ అరమరికలూ లేకుండా ఏనాటిబంధమో అన్నట్టు చెప్పుకుపోతారు. చిన్న చిరునగవ్వుతో మొదలెట్టి, అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలకథలు కూడా వినిపించేస్తాయి కదాచితుగా.

బంధుత్వాలు భగవద్దత్తం, స్నేహాలు స్వయంకృతం అంటారు కానీ జాగ్రత్తగా ఆలోచిస్తే అందులో సగమే నిజం అని తోచకమానదు. నామిత్రుత్వాలేవీ నేను కోరీ వేడీ తెచ్చుకున్నవి కాదు. నమ్మండి, నమ్మండి, అవి కూడా భగవద్దత్తాలే కాకపతే యాదృచ్ఛికాలే. నాకు నేనై నీతో స్నేహం చెయ్యాలనుంది అంటూ చేయి సాచిన సందర్భాలు లేవు. అంటే అదేదో ఘనమైన విషయం అని కానీ, నాకేదో అతిశయం అని కానీ అనుకోవద్దు. నాకు నేనై ఎవరినీ పల్లెత్తి పలకరించకపోవడానికి కారణం కేవలమూ నా పిరికితనమే. అవతలివారికి నాతో మాటాడ్డం ఇష్టం ఉంటుందో ఉండదో అన్న భయంతో వారే కదిలించేవరకూ ఎదురు చూస్తూ ఊరుకుంటాను. వారికి వారై కదిలించినప్పుడు కూడా అడగడుగునా ఉలికిపాటే. నేనెంతో జాగ్రత్తగా ఉన్నాననుకుంటాను కానీ నామాటలకి నొచ్చుకుని ఆ స్నేహాలకి పులిస్టాపు పెట్టేసిన

లేదా పెట్టివేయబడినసందర్భాలు కూడా ఉన్నాయి. అందుచేత నాకు మాటాడడం చేతగాదని కూడా అనుకుంటాను. అంచేత కూడా నాకు నేనై ఎవరినీ పలకరించను. ఇంతకీ -

ఇదంతా ఎందుకొచ్చిందంటే, నాలుగరోజులక్రితం సునంద నన్ను వాళ్ళింటికి భోజనానికి పిలిచింది. సాధారణంగా నేను ఎవరింటికీ వెళ్ళడానికి ఇష్టపడను. అంచేత ఆవిడ పార్టీవేళ కాక, ఆ మర్నాడో మూడోనాడో పిలుస్తుంది నన్ను. ఆ రోజు మాత్రం నాతోపాటు మరో కుటుంబం కూడా ఉంది. మరొక్క కుటుంబమే కదా అనీ, వాళ్ళు చాలా మంచివాళ్లనీ, నేనేమీ అనుకోను అని వాళ్ళని కూడా పిలిచిందిట. మరి అంత చెప్పింతరవాత నేనేమీ అనుకోలేను కదా. ఏమాటకామాటే చెప్పుకోవాలి. నిజంగానే వారేమీ నన్నేవిధంగానూ నొప్పించలేదు.

రెండున్నర గంటలకాలం అన్నపానీయాలూ, పిచ్చాపాటీ కబుర్లతో అయిందనిపించి, వస్తాను మరి అంటూ లేచేను. లేచి నిల్చున్నాక, “ఇలా రా,” అంది వారితో వచ్చిన పాప చిన్ని చేతులూపుతూ నాకెదురుగా నిల్చుంది. నేను అటుతిరిగి, దగ్గరికెళ్లి ముందుకు వంగి, నామొహం ఆ చిన్నారిమోముకి చేరువగా పెట్టేను ఏ బ్రహ్మరహస్యమో వినడానికి ఉద్యుక్తురాలినై. ఉత్తరక్షణం నేనెంత పొరపాటు బడ్డానో నాకు అవగతమయిపోయింది. ఆ చిన్నారి మునిగాళ్లమీదకి లేచి, మెడ ఉన్నంతలోనే రిక్కించి, నామొహం మరింత దగ్గరకు లాక్కుని నాచెంపమీద చిన్న ముద్దు పెట్టి గిరుక్కున తిరిగి వాళ్ళమ్మదగ్గర చేరి, ఆవిడవొళ్ళోకి వాలి నావేపు చూడసాగింది, రవంత సిగ్గుతోనూ, మరింత కొంటెతనంతోనూ. లేతగులాబీరేకులలాటి పెదాలమధ్య వస్తా వస్తానంటున్న నవ్వుని వద్దు వద్దంటూ ఆపేసింది.

నేను క్షణకాలం నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయేను. నాకేం చెయ్యాలో, చెప్పాలో కూడా తోచలేదు. “నువ్వు ఆ పాపకి నచ్చేవు,” అంది సునంద. నేను ఆ పాపవేపు మళ్లీ చూసేను. ఆరముగ్గిన టొమేటోలాటి మొహం, పాలబుగ్గలూ, నీలికళ్ళూ, నుదుటిమీదకి లాగి నీటుగా కత్తిరించిన తేనెరంగు జుత్తూ కన్నులపండువగా ఉంది.

నాలుగేళ్లుంటాయేమో. వీళ్లపిల్లలు విశాఖపట్నం జైలు వంకాయల్లా బొద్దుగా పెరుగుతారు కనక నిజవయసు చెప్పడం కొంచెం కష్టమే. పిల్లలేమిటి, పెద్దలూ అంతే. తెల్లారి లేస్తూనే గంటన్నరకాలం వెచ్చించి చేసుకునే ముస్తాబుమూలంగా వీరి నిజవయసు తెలుసుకోడానికి ఆ పుట్టించిన బ్రహ్మ దిగి రావాలి. అయినా ఆ పులుముకునే రంగులకంటే జాతి కూడా అనుకుంటాను. నేను అమెరికా వచ్చేక కనుక్కున్న వాస్తవాల్లో ఇదొకటి. ఒకజాతివారి వయసు మరొకజాతివారు అంత తేలిగ్గా అంచనా వేయలేరు.

అక్కడ ఉన్నంతసేపూ ఆ పాపతోనే ఆడుకున్నానని చెప్పలేను కానీ మధ్య మధ్యలో ఇదేమిటీ అదేమిటీ అని నన్నడిగినప్పుడు జవాబులు మాత్రం విధిగా చెప్పుకుంటూ వచ్చేను. ఆ తల్లి పాపని "ఆమెని అలా వేధించకు" అంటూ మర్యాదలు ముప్పటోయినప్పుడల్లా నేను అంత మర్యాదగానూ ఫరవాలేదంటూ ఆమెకి భరోసా ఇస్తూ వచ్చేను. అదే కాబోలు ఆ పిల్లకి నచ్చింది. ఆ పాప సునందదగ్గరకి అంత చనువుగా వెళ్ళలేదు మరి.

సునంద మళ్లీ ఏదో అనడంతో ఉలికిపడి, నా ఆలోచనల్లోంచి తేరుకుని, ముక్తసరిగా జవాబు చెప్పి అప్పటికి ఆ అధ్యాయం ముగించేను.

నేను ఈదేశం వచ్చి చాలా కాలమే అయినా, నాగదిలో నాకు నేనే విధించుకున్న కారాగారంలో ఉంటూ బయటి ప్రపంచంతో అట్టే సంబంధాలు పెట్టుకోకపోవడం చేత, ఈ లాంఛనాలన్నీ నిన్నో మొన్నో ఇక్కడ దిగినంత కొత్తే నాకు. మనదేశంలో పెద్దలు పిల్లల్ని ముద్దు చెయ్యడం ఉంది కానీ, పిల్లలు పెద్దలని ముద్దు చెయ్యడం లేదు కదా. అంతగా అయితే వచ్చి ఒళ్లో వాల్తారు. ఎత్తుకోమని చేతులు చాపుతారు. కృష్ణసర్పాల్లా కాళ్లకి చుట్టేసుకుంటారు. కొంగు పుచ్చుకు లాగుతారు. అంతే కానీ, ఇలా రా అంటూ పిలిచి ముద్దులు పెట్టుకోడాలు కనీసం నేనెరగను.

"మామూలుగా ఆ పిల్ల అస్సలెవ్వరిదగ్గరికీ రాదు," అంది తల్లి.

"ఆహా," అన్నాను ఇంకేం అనాలో తెలీక.

ఆ తరవాత నాలుగైదు వారాలకి కాబోలు, బుర్రలో ఆలోచనలతో విసిగిపోయి, కాస్త చల్లగాలిలో తిరిగితే, మనసు తేలిక పడగలదని బయల్తేరేను. కాస్త చిరాకు పాళ్ళు ఎక్కువగానే ఉండడంచేత, మామూలుకంటే మరో మైలు హెచ్చించేను.

ఓ యింటిదగ్గర గులాబీరంగు సైకిలు తొక్కుతూ ఆ పాపే మళ్ళీ కనిపించింది. నేను ఇన్నాళ్ళూ చూడనేలేదు వాళ్ళిల్లు ఇక్కడే అని. నావేపు చూసి చిన్నగా నవ్వింది. ఆ పిల్లమీద ఓ కన్నేసి ఆ పక్కనే నడుస్తున్న నాయనమ్మ నన్ను చూసి పలకరించింది.

నేను కూడా నవ్వి మారుహాలో చెప్పి అప్పు తీర్చేసుకుని, ముందుకు సాగబోతున్నాను. ఆవిడ మరేదో అనడం వినిపించి ఆగేను వెనక్కి తిరిగి చూసేను.

ఆవిడ పిల్లని చూడ్డానికొచ్చిందిట. నాలుగు రోజులుంటుందిట. నేను వింటూ నడుస్తున్నాను. తనకేమో ఈ పిల్లని చూడకపోతే తోచదు. తాతగారికి అలాటివేం లేవు. కూర్చున్న చోటునించి కదలడు ప్రాణాంతకమైతే తప్ప. దైహికమైన అవసరాలు ఆ ప్రాణాంతకవృత్తిలోకి వస్తాయని చెప్పఖ్ఖర్లేదు కదా. వాటికి కూడా తాను కదలకుండా జరిగిపోయే మార్గం ఈ సైంటిస్టులంతా ఎందుకు కనిపెట్టలేదో అని చిరాకు పడుతుంటాడుట. మొదట్లో ఈవిడని కూడా ఎక్కడికీ వెళ్ళనిచ్చేవాడు కాదు, తనకి జరగదని. ఇప్పుడు పిల్లలు కాస్త చేతికెదిగొచ్చేరు కనక వాళ్ళని హైరాన పెట్టేస్తూ, నువ్వు కావలిస్తే వెళ్ళు అన్నాట్ట. ... నేను వినగలిగినంతసేపు విని, వెళ్ళాలంటూ గబగబ నాలుగడుగులేసేను. ఆవిడ కూడా నడక వేగం హెచ్చించి, ఎక్కడున్నారు, సాయంత్రం మాటాడుకుందాం అంటూ నాతోపాటు నడకవేగం హెచ్చించి. నాకు కొంచెం ఆశ్చర్యమే అయింది. సాధారణంగా ఇక్కడ అంత చనువు తీసుకుని కొత్తవాళ్లతో కబుర్లకి దిగేవాళ్లు తక్కువే అని నాఅభిప్రాయం. పైగా పిల్లని చూడ్డానికొస్తే, పిల్లతోనే కాలక్షేపం చెయ్యొచ్చు కదా. నేను సాయంత్రం ఇంట్లో ఉండననీ, మర్నాడు మరెక్కడికో వెళ్ళాలనీ, రాత్రుళ్ళు త్వరగా పడుకుంటాననీ, రానున్న వారంరోజుల్లో పూర్తి చేయకపోతే నాకొంప గుణ్ణం అయిపోయే ప్రమాదమనీ, ఇంటికెవరో వస్తున్నారనీ, నేనెక్కడికో వెళ్ళాలనీ అనేక విధాల ఆవిడకి నచ్చచెప్పి బతుకు జీవుడా అనుకుంటూ

ఇంటికొచ్చి పడ్డాను. అవును, అవన్నీ సాకులే. ఏం చెయ్యను? నాకు ఆవిడతో మళ్లీ మాటాడాలని లేదు.

మనసు తేలిక పడగలదన్న ఆశతో బయటికి వెళ్లిన నేను కుళ్లిన బూడిదగుమ్మడికాయలాటి తలతో తిరిగొచ్చేను. మనసంతా గజిబిజి అయిపోయింది. మనోజ్ఞమైన చంద్రుడికి మచ్చ, గులాబీకి ముళ్లు, కళకళ మెరిసే గురివింద నలుపు, చానో చుట్ట, రావిశాస్త్రి మధుపాత్ర, మహాకవికి రెండు మిద్దెలు – సృష్టిలో తీయనిది స్నేహమే కానీ అన్ని స్నేహాలూ ఒకేరకం తీపి కాదు. ఉప్పు కప్పురమే కాదు, తీపుల్లో కూడా వేరు వేరు తీపులు. కొబ్బరినీళ్ళతీపి పనసతొనలకి లేదు. కోవాకజ్జికాయలతీపి అతిరసాలకి రాదు. అంతే కాదు. నేను మరొక గుణం కూడా గుర్తించేను మిత్రమండలిగుణాల్లో. అదేమిటంటే ప్రతి స్నేహానికీ ఓ కొరత కూడా ఉంటుంది. ఆనాడు పాప నాయందు చూపిన స్నేహభావానికి స్పందించి మళ్ళీ పాపనైతే చూడాలనే అనుకున్నాను కానీ వాళ్ల నాయనమ్మ ఆ స్నేహభావాన్ని తగ్గించే కొరతభాగం. కనీసం కొంతకాలంపాటు ఆ పాపమాట మరిచిపోవాలి.

సుదీర్ఘంగా నిట్టూర్చి, కమ్మని, చిక్కటి కాఫీ కప్పున్నరయినా చెల్లిస్తే తప్ప తేరుకోలేననే నిర్ణయానికొచ్చేను. పొయ్యిమీద ఫిల్టరులో కాఫీ పొడీ, నీళ్ళూ పోసి, క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాను. మనసంతల పెద్దగాలివానకి అల్లకల్లోలం అయిపోయిన జాలారిపేటలా ఉంది. దాదాపు వారంరోజులుగా ఇలాగే ఉంటోంది. ఉండుండి అరవైఏళ్లక్రితం ఒక అరవ ఆచార్యులుగారు నాకు బోధించిన మంచిమాటొకటి మనసులో మెదిలింది. “స్నేహం అందరూ అనుకున్నంత సర్వసాధారణం కాదు. నిజమైన స్నేహితుడు జీవితంలో ఒక్కడు దొరికినా అదృష్టవంతుడివే,” అని. ఆవాక్యానికి అర్థం నాకు ఇప్పుడు తెలుస్తోంది, అరవై ఏళ్లతరవాత, ముఖ్యంగా నాకు తగిలిన “ప్రాణమిత్రులు" అనిపించుకున్న వారందర్నీ తలుచుకుంటుంటే. హౌరా ఎక్స్ప్రెస్ హోరెత్తి కూత పట్టి ముందుకు సాగిపోతుంటే, ముందుకి సాగిపోతున్న ఒక్కొక్క రైలుపెట్టెని చూస్తూ ప్లాట్ఫారంమీద నిలబడిపోయినవాడిలా ఉంది నామనసు.

అయిదోక్లాసులో పరిచయమయిన సూర్యకాంతం మొదలుకొని నిన్నా మొన్నటి సౌభాగ్యం వరకూ ఎన్ని స్నేహాలో. ఎంతమంది వచ్చి పోయేరో తలుచుకుంటే నాకే నమ్మకంగా లేదు. నేను నేనేనా అని. నాకే స్నేహాలూ అక్కరనేదు అనుకున్న నాకే ఇంతమంది ఉంటే స్నేహాలకోసం పాకులాడేవారి మాట చెప్పుకోవాలా?

రింగురింగుమంటూ ఫోను బడిగంటలా మోగడంతో ఉలికిపడి అప్పుడే అయిపోయిందా అనుకుంటూ దానివేపు చూసేను. మిణుగురుపురుగులా మిణుకుమిణుకుమంటూ వెలుగుతున్నబటను చూస్తున్నాను అదే ఆగిపోతుందేమోనన్న ఆశతో. ఏ అమ్మకాలరాయుడో నేనేదో అద్భుతమైన పడవప్రయాణం గెలుచుకున్నానని చెప్పడానికి కావచ్చు. లేదా, ఏ కంపెనీవారో  నాకు లేనిజబ్బులకి ఉచితంగా వైద్యసలహాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారన్నశుభవార్త కావచ్చు. ఏమీ లేకపోతే, నాకు లేని అప్పులు తాము తీర్చేస్తామంటూ నన్నాదుకోడానికి సిద్ధమయిన ఆపద్బాంధవులు కానోపు. ఫోనెత్తకపోతే, వారే విసుగేసి ఊరుకుంటారని నాఆశ. ఇంతలో కాఫీమాట గుర్తొచ్చింది. లేచి, చూసేను డికాషను దిగిందేమోనని.

"ఏంటి, ఇంట్లో లేవా, ఉండి తియ్యడంలేదా?" అవతలినించి శర్వాణి మారాం పెడుతున్నట్టు నిష్ఠురతూపులు ఫోనులోనుంచే వేయసాగింది మీరజాలగలవా నాయానతిస్వరంలో. ఈ సరిత్ప్రవాహానికి ఆనకట్ట కట్టలేం అనుకుని లేచేను. నా జవాబులపెట్టె నిముషంతరవాత ఆగిపోతుంది కానీ శర్వాణి ఆగదు. ఆమెవాణి అక్షయతూణీరం.

"నేనిక్కడ లేనిదాననై ఉన్నాను," అన్నాను ఫోను తీసి.

"ఆహా, I am notకి అనువాదం కాబోలు. ఇంతకీ ఫోను ఎందుకు తియ్యలేదు?"

"పాకశాలలో కాఫీ పచరించే ప్రయత్నంలో చాలా చాలా బిజీగా ఉన్నాను. నువ్వే అయితే ఆసంగతి చెప్తావు కదా. నాకాఫీసేవ అయింతరవాత పిలిచి మాటాడొచ్చు అని ఊరుకున్నా. ఇంతకీ ఎక్కడ కొంపలు మునిగిపోతున్నాయి? ఎవరి కొంపలు మునిగిపోతున్నాయి?"

"నాకొంపే. నాకొంపలోనే."

"అయ్యో, ఏమయిందేమిటి?" అన్నాను రవంత నొచ్చుకుని. నొచ్చుకున్నా లేకున్నా ఆమాత్రం అక్కర చూపడం న్యాయం. ఎంత చెడ్డా పెదనాన్నగారి కాబోయే కోడలికి పెత్తల్లి మనవరాలు. వాళ్ళు వియ్యమందినతరవాత నాకు అత్యంతదగ్గర బంధువులు అయిపోయే అవకాశం ఉంది.

ఇలా ఉంది నాఆలోచనాసరళి శర్వాణి తనకొచ్చిన కష్టాలు చెప్తున్నంతసేపూ. ఊఁ కొడుతూ, మధ్య మధ్యలో ఓ, అలాగా, అయ్యో, అంటూ రెండు మూడు అక్షరసముదాయాలు పలుకుతూ కాఫీ చప్పరిస్తూ నేను విన్నకథ సూక్ష్మంగా ఇలా ఉంది - వాళ్ళ ప్రొఫెసరు తను రాసిన వ్యాసానికి బి ఇచ్చేడు. తాను ఆ పది కాయితాలూ సమకూర్చడానికి ఎంత అవస్థ పడిందో, ఎన్ని గంటలు నిద్ర, ఎన్ని గంటలు "సోషి"జీవితం అనబడే సోషలైజింగు మానుకోవలసివచ్చిందో, ఎన్ని పార్టీలకి రానని చెప్పుకోవలసివచ్చిందో ... వివరంగా ముప్పై తొమ్మిది నిముషాలపాటు ఏకధాటిగా వల్లె వేసింది. వల్లె అని ఎందుకంటున్నానంటే అన్ని విషయాలు అంత విపులంగా అంతసేపు చెప్పగలిగిందంటే, మరో నలుగురికైనా ఈ హరికథ పెట్టి ఉండాలి నా అనుభవంలో. లేకపోతే అక్కడక్కడ ఆగుతారు. మధ్యమధ్యలో ఆఁ, ఊఁ అంటూ ఆలోచనలో పడతారు. కాస్త తడుముకుంటారు మాట దొరక్క. మా శర్వాణికి మాత్రం ఆ ఆటంకాలేమీ లేకపోయేయి. అంచేత అనుకున్నాను ఇది చాలామందికి చెప్పినకథే అయివుంటుందని. అందులో కూడా ఓ సౌఖ్యం ఉంది. అంతమంది అయ్యో పాపం, ఎంత కష్టమెంత కష్టం అని ఆపసోపాలు పడుతూ, సానుభూతి వెలిబుచ్చి ఉంటారు కనక నేను మళ్ళీ అంత ప్రయాసా పడక్ఖర్లేదు. అంచేత, నేను నాఎదుట ఉన్న బల్లమీద ఫోను పెట్టి, ప్రతి ముప్పై సెకనులకొకమారు స్పీకరులో ఓ, అయ్యో, ఆ అంటూ కాఫీ చప్పరిస్తూ కాలక్షేపం చేస్తున్నాను. అక్కడికీ శర్వాణి కనిపెట్టేసినట్టుంది, "వింటున్నావా, నాపాట్న నేనేదో వాగుతుంటే నీపని నువ్వు చూసుకుంటున్నావా?" అంది షెర్లక్ హోమ్స్ మేనత్తకూతురయినట్టు.

"వింటున్నాలే. చెప్పేను కదా కాఫీసేవనం కూడా సాగుతోందని."

మరో పావుగంట ఈ కచేరీ అయేక, "ఇంకేంటి సంగతులు, ఏం చేస్తున్నావు?" అనడగింది. చెప్పొద్దూ. అప్పటికే నా ఓపిక సగం చచ్చింది. ఏమైనా ఉన్నా చెప్పాలనే సరదా పూర్తిగా చచ్చిపోయింది.

"ఏముంటాయిలే," అని తెర దింపేసేను. ఆపిల్లదగ్గర శలవు పుచ్చుకుని, తేరుకుని నా పనులమీదికి దృష్టి మళ్ళించడానికి మరో పావుగంట పట్టింది. ఏం పనుల్లే. నిజం చెప్పాలంటే నాదృష్టి ఎటూ మళ్ళనంటోంది. అచ్చతెలుగులో అలో లక్ష్మణా అని ఏడుచుకున్నానన్న మాట.

ఇంక ఈగదిలో ఉండలేను, కొంచెం లేచి ఎటైనా వెళ్ళొస్తే కానీ మతి స్థిమితపడదు అనుకుని, బట్టలు మార్చుకుని వీధిన పడ్డాను. ఇక్కడ మీరు మరొక విషయం గమనించాలి. వీధిన పడదాం అన్నంతవరకే నా సంకల్పం. ఆ తరవాత నాకాళ్ళు మునిసిపాలిటీ ఎద్దులా వాటంతట అవే తీసుకుపోతాయి తమకి తోచిన దిక్కుకి. తోచినచోట ఆగిపోతాయి. నామెదడు నిర్దేశించ పనిలేదు.

ఆవిధంగా నాకాళ్ళు నాశరీరాన్ని పక్కవీధిలో రంగులబంగళాముందుకి చేరేసేయి. అది సంద్రాలున్న రెండస్థుల మహలు. రూపాయల్లో చెప్పుకుంటే కొన్ని కోట్లు విలువ చేయగల "శ్రీ"నివాసం. ఆ దొరబాబు ఇంటిముందు రాళ్ళతోట వేయించి, వాటికి రెండు వందల యాభైయారు రంగులు పులిమించేడు. అంచేత సంద్రాలు ఆ ఇంటిని రంగులబంగళా అంటుంది. అంచేత నాక్కూడా అదే పేరు, నాకు కాదులెండి, నేను ఆ భవంతికి ఉపయోగించుతున్న పేరు.

నడుస్తున్నంతసేపూ, ఏమిటో ఈ స్నేహాలు అని ఆలోచించుకుంటూ నడుస్తున్నాను. ఆ తరవాత స్నేహాలు ఎలా ఏర్పడతాయో అనిపించింది. ఆ తరవాత స్నేహాలు ఎందుకు అనిపించింది.

తమిళ ఆచార్యులుగారి , "నిజమైన స్నేహితుడు నీకు ఒక్కడు దొరికినా నీజీవితం ధన్యమైనట్టే," అన్న సుభాషితానికి అర్థం ఇప్పుడు నాకు బాగా అవగతమవుతోంది.

గత ఆరు దశాబ్దాలలోనూ నాజీవితంలోకి స్నేహంపేరున వచ్చి పోయినవారందరూ బొమ్మలపుస్తకంలో పేజీ తరవాత పేజీ తిరగేసినట్టు ఒకొకరు నామనఃఫలకంమీద మెదులుతున్నారు. చెప్పేను కదా ఈ స్నేహాలేవీ నేను ప్రారంభించినవి కావని. ప్రతిసారీ వాళ్లే మొదలు పెడతారు. వాళ్లే అంతం చేస్తారు. ... కాదేమో, గట్టిగా ఆలోచిస్తే నేను మొదలు పెట్టకపోయినా అంతం చేసినవి లేకపోలేదు!

ఈ మిత్రవ్యవహారం తలుచుకున్నప్పుడల్లా, నాయనమ్మ నామనసులో మెదులుతుంది. అప్పుడు నాకు పదేళ్లుంటాయేమో, అదే తొలిసారి ఆవిడని చూడడం నేను. బరంపురంలో మా చిన్నాన్నగారింట్లో ఉండేదావిడ. చిన్నినాజీవితంలో మైత్రీభావానికి మధురమైన నిర్వచనం తెలుసుకున్నది ఆవిడదగ్గర్నుంచే. ఆవిడకి ఒక “నేస్తం” ఉండేది. బరంపురంలో “నేస్తం కట్టడం” అని ఒక ఆనవాయితీ ఉందిట. గుళ్ళో దేవునిఎదుట జరుగుతుంది ఈ నేస్తం కట్టడం. అప్పట్నుంచీ ఒకరినొకరు నేస్తం అనే పిలుచుకుంటారు. మీరు, మీరు అని ఒకరినొకరు సంబోధించుకుంటారు. జీవితాంతం ఒకరికొకరు నేసంగానే మెలుగుతారు. పెళ్ళిలాగే అంది నాయనమ్మ. ఇప్పుడయితే పెళ్ళిలా అనడానికి లేదు. పెళ్ళికి విడాకులున్నాయి కానీ ఇలా కట్టిన నేస్తానికి తిరుగు లేదు మరి! మళ్ళీ రెండోసారి నాకాలేజీదినాల్లో నేస్తం అన్న ఆ రమ్యమైనపదం వినడం తటస్థించింది. మాక్లాసులో ఒకమ్మాయికి కూడా అలాటి నేస్తమే ఉండేది. మరి వాళ్ళిప్పుడు ఎక్కడున్నారో, ఆ కట్టిన నేస్తం ఎలా సాగుతోందో తెలిస్తే బాగుండనని ఉంది కానీ తెలుసుకునే అవకాశం లేదు.

మళ్ళీ సునందఇంట్లో కనిపించిన పాప జ్ఞాపకం వచ్చింది. సాధారణంగా స్నేహాలకి ఏదో ఒక ఉభయసామాన్యమైన ఆలోచనో, ఆసక్తో, ఆశయమో, ఆదర్శమో, ఇష్టమో, కోరికో ఉండాలి. ఒకొకప్పుడు విపరీతభావాలు - కోపం, కక్ష, ద్వేషంలాటివి కూడా ఇద్దరిని ఓ దరికి చేర్చవచ్చు. ఆ పైన, నివాసాలు, ఉద్యోగాలూ, సంఘంలో స్థానం, రాజకీయాలూ ... ఇలా మరి కొన్ని కూడా స్నేహం కట్టడానికి దోహదం చేస్తాయి సందర్భానుసారం. వాటిల్లో కొన్ని కలకాలం నిలవొచ్చు కూడాను. అంటే ఇళ్ళూ,

ఊళ్ళూ మారిపోయినా వారిమధ్య ఉదయించిన సుహృద్భావం ఎడతెగక పారు ఏరులా నిరంతరం సాగిపోవచ్చు. ఉద్యోగాలు వదిలేసినా ఆనాటి మిత్రులని పదిలంగా పదిలపరుచుకోవచ్చు. యాదాలాపంగా బజారులో కనబడి మనవాడిలా ఉన్నాడే అని పలకరించి, పరమాప్తులయినవారు కూడా లేకపోలేదు. కానీ ఆ పాపకీ నాకూ ఎలా దోస్తీ కలిసింది అంటే మాత్రం చెప్పలేం. అది "తదితర" విభాగంలోకి వస్తుందనుకోవాలి. లేదా, ఆ పాప ప్రదర్శించింది స్నేహంకిందకి రాదు అని కూడా అనుకోవచ్చు. అది ఒక మనిషిని చూడగానే మరొక మనిషిలో కలిగిన స్పందననీ తద్వారా ఉదయించిన ఆత్మీయతనీ స్ఫురింపజేసి, అందులోని "స్నిగ్ధమాధుర్యం చవి చూపుట" అన్న కోవలోకి వస్తుంది. అది ఆ క్షణానికే కావచ్చు, కలకాలం నిలిచిపోయేది కావచ్చు. ఆ క్షణానికే అయినా అప్పటికి మాత్రం నూటికి నూరు పాళ్ళూ నిజమైన స్పందనే అనుకుంటాను.

నాతలలో తలపులు ఇలా వివిధరీతుల సాగిపోతుంటే, నా కాళ్ళు రంగులబంగళాముందు ఆగిపోయేయి. నేనిలా చెప్పా పెట్టాకుండా వచ్చేయడం బాగుండదేమో అని సందేహిస్తూనే మరో రెండడుగులు ముందుకి వేసేను. అట్టే శ్రమ లేకుండానే సంధ్రాలు కనిపించింది మేపుల్ ఛాయలో సిమెంటు చప్టామీద. ఓ పక్కన నీటిపాయలు మూడు చివ్వున అడుగున్నర ఎత్తుకి గాలిలోకి లేచి, విలాసంగా ఒంపులు తిరిగి కిందనున్న రంగురాళ్ళమీంచి జారిపోతున్నాయి నిర్విరామంగా గలగల చిరుసవ్వడి చేస్తూ.

నేను నెమ్మదిగా మరో నాలుగడుగులేసేను, కళ్ళు చిట్లించి పరీక్షగా చూసేను ఏం చేస్తోందో. సంధ్రాలు తలొంచుకుని ధ్యానముద్రలో ఉన్న మునీశ్వరుడిలా తన చుట్టూ ఉన్న సమస్త చరాచరప్రపంచాన్నీ మరిచిపోయి, ఉడకపెట్టిన పచ్చి వేరుశనగ కాయలు వొలుచుకు తినడంలో నిమగ్నమయి ఉంది.

నేను బాగా దగ్గరకొచ్చే, అలికిడి విని తలెత్తి చూసి, "ఏటిలా వెల్పొచ్చీసినావు ఓ పాలిట్రా అని ఆణ్ణించే కేకేకండా," అంది కళ్ళు చికిలించి చూసూ, బల్లమీద ఓ పక్కకి జరిగి గుప్పెడు వేరు శనక్కాయలు నా చేతిలో పోస్తూ.

అబ్బ ఎంతకాలం అయింది నిన్ను చూసి, రా రా అంటూ ఆప్యాయంగా పలకరించాలి కానీ ఎందుకొచ్చేవని అడగడం ఏమిటి? నేను చిన్నబుచ్చుకుని అదే మాట అడగబోయేను కానీ ఓపిక లేకపోయింది. పైగా ఆమె అన్న మాట కూడా నిజమే. ఎప్పుడు సంధ్రాలుతో ఊసులాడుకోవాలనిపించినా మా మాడాబామీంచే కేకేస్తూ వచ్చేను ఇంతవరకూ.

"ఇవెక్కడివీ?" అన్నాను, సంధ్రాలడిగిన ప్రశ్న వదిలేసి.

"దొరబాబు అదేదో దుకానంల కనిపిచ్చినయ్యని తెచ్చినాడు. నివ్వే ఎందలకొచ్చినవని అడిగ్తే సెప్పవేటి?" అంది మళ్లీ వదలకుండా.

"అస్తమానం నేను నిన్నలా కేకేసి పిలవడం మర్యాద కాదని, అప్పుడప్పుడు నేను కూడా వస్తూ ఉండాలని తోచి వచ్చేను," అన్నాను అతితెలివికి పోతూ.

"నొల్లు కబుర్లు సెప్పమాక. ఏదొ పని బణ్ణాది, వొచ్చినవు. ఏటయిందేటి?" అంది సంధ్రాలు నావంక పొడిచేసేలా చూస్తూ. సంధ్రాలు మాట ఉంచుకోదు. మాట మిగలనివ్వదు. కంప్యూటరులో సెర్చి కొడితే ఆ పదం ఉన్న ప్రతి స్థానము కనిపించినట్టుగానే, సంధ్రాలు జవాబులు కూడా. డొంకతిరుగుడుమాట పొసగదు ఆవిడదగ్గర.

"నీతో మాటాడాలనే వచ్చేను," అన్నాను ఇహ ముసుగులో గుద్దులాట ఎందుకులెమ్మని.

"అత్తెలస్తనే ఉన్ది. ఏటయినాదేటి?" అంది.

నాచేతిలో పోసిన వేరు శనక్కాయలు వొలుచుకుని ఒక్కొక్క గింజే నోట్లో వేసుకు నములుతూ కొన్ని క్షణాలు గడిపేను. తరవాత నెమ్మదిగా అన్నాను, "ఏంటో సంధ్రాలూ, నాకు ఈ స్నేహాలన్నీ రోజురోజుకీ అయోమయం అయిపోతున్నాయి. ఓ

పక్క కావాలనీ ఉంటుంది. మరో పక్క విసుగ్గానూ ఉంటుంది," అన్నాను దిగులుగా. ఇలా చెప్తూ, నాలో నేనే నామీదే జాలి పుట్టి నాదిగులుని రెట్టింపు చేసేసుకున్నాను.

"నీకు సేయితాలు పడవంతవు గద, మల్ల ఉప్పుడిదేటి?"

"అదే నేనంటున్నది కూడాను. ఇవాళ్టికి ఇవాళ ఏమయిందో తెలుసా. ఎవరితోనైనా మాటాడితే బాగుండు అనుకుంటూ బయల్దేరేను. ఎవరో ఒకామె నన్ను రోడ్డుమీద ఆపేసి తనగోడు మొదలెట్టింది. మరి అవి మాటలే కదా, నేను మాటాడాలనే బయల్దేరేను కదా, మరి ఎందుకు నాకు చిరాకేసింది అనీ?"

"నీకసలు బుర్ర నేదు."

"ప్చ్. అందుకే కద నీదగ్గరకొచ్చింది. నీ బుర్ర ఉపయోగించుకుని అర్థం చేసుకుందాంవని."

"ఓనోస్, ఆ మాతరం నీకు తెల్దదని."

నాకు తెలీదని ఒప్పుకోడం కూడా చిన్నతనంగానే అనిపించింది. "కాదులే, ఒకొకప్పుడు తెలిసినసంగతులు కూడా మరొకరు చెప్తే మరింత బాగా చక్కగా స్పష్టంగా తెలుస్తాయి," అన్నాను.

"సరి, ఒకొకరి సంగతి సెప్పు. ఏటయినాదో నాన్సెప్తను," అంటూ లేచింది.

"అదేమిటి, కథ చెప్పమంటూ లేచిపోతున్నావు?"

"సెనిక్కాయ్లుయ్యానాయి. నీలు తెస్తనికెల్తన్న."

పెద్ద కూజాతో తిరిగొస్తున్న సంద్రాల్ని చూస్తే నాకు నవ్వొచ్చింది. నేను చెప్పబోయే హరికథకి అదే చాలు, మరి వేరే వ్యాఖ్యానం అఖ్ఖర్లేదు.

"అది కాదు. మాఆఫీసులో ఒకావిడ ఉందని చెప్పేనా. రోజుకి నాలుగుసార్లు పిలుస్తుంటుంది. నిన్న ఏదో తెలుగు సినిమా ఊళ్ళోకొచ్చింది, వస్తావా అంది. నాకు సినిమాలసరదా లేదు కానీ ఆవిడ పిలిచింది కదా అని సరేనన్నాను. తీరా అక్కడికెళ్ళింతరవాత, ఆవిడా వాళ్లాయనా "పక్క హాల్లో మరో ఆటకెల్తాం, నువ్వు ఈ ఆట చూడు. రెండు ఆటలూ అయింతరవాత ఇక్కడ కలుద్దాం" అంది. నేనొక్కదాన్నీ

ఆట చూడాలనుకుంటే నేను వెళ్ళలేనూ, ఆయమ్మ నన్నెందుకు పిలిచినట్టు? దంపతులిద్దరూ సరదాగా సినిమాకి పోదలుచుకుంటే నన్నెందుకూ పిలవడం?" అన్నాను భట్టి మార్కుడిని ప్రశ్నించిన భేతాళుడిగొంతుతో.

"ఏదో ఆల గొడవలాలకుంటయి."

"సరే. మరోకథ. నేనీదేశం రాకముందునించి తెలిసిన మిత్రసత్తమురాలు వాళ్ళఊరు పిలుస్తుండేది. ఇక్కడికి కారులో ఆగకుండా పోతే మూడున్నరగంటల్లో చేరిపోతాం. సరే అని వెళ్ళి తలుపు తట్టేను. తలుపు తీస్తూనే ఆవిడగారన్న మొదటి వాక్యం ఏమిటో తెలుసా?"

"ఏటన్నదేటి?"

"రమ్మనగానే వచ్చేసేవేమిటి అంది." అన్నతరవాత అనిపించింది, ఇందాకా సంద్రాలు అన్నమాటకి అది దీటుగానే ఉందని. కాదులే, అది వేరు అని నాలో నేనే సరిపెట్టుకున్నాను. సంద్రాలు మరి నన్ను పిలవలేదు కదా.

"చాన్నాల్లగ స్నేయితం అంతన్నవ్ గద. ఆసికాలకనుంటది. నివ్వలగ సీటికి మాటికి. పెతి మాటకి తప్పడ్తవేటి, మల్ల సేగితిం ఉందన్నదంటవ్. నీదే తప్పు."

రత్నంతో పదేళ్ళ స్నేహం. పదే పదే రమ్మంటోందని వెళ్తే, గుమ్మంలోనే, అలా అనడం బాగుందా? మాటకి మాట అనుకునే స్నేహితులమే కనక నేను హాస్యంగానే తీసుకోవచ్చు. నిజానికి ఆనాడు నవ్వేసి ఊరుకున్నాను కూడా. కానీ ఇప్పుడు తలుచుకుంటే కొరతగానే ఉంది!

"నీబుద్ధి బుగ్గయిపోతన్నది నానాటికి."

నాక్కోపం వచ్చిందామాటకి. మొహం ముటకరించుకున్నాను వీధివేపు చూస్తూ. అంతరాంతరాల్లో ఏమూలో ఆమాట నిజమే కదా అంటోంది నా still small voice within కానీ విననట్టు నటించేను.

సంధ్రాలే మళ్ళీ అందుకుంది. "ఆ యమ్మెవురో నీకు సెయ్యిరిగినప్పుడు రెన్నెల్లపాటు ఇంటెట్టుకుని సెప్పలేనంత సాకిరి సేసిందని నిప్పే అన్నవు గద. ఈరోజల్ల ఎవురు సేస్తరల్లాగ. నాల్రోజులున్నిస్తే గెనం."

నిజమే. వరలక్ష్మి నన్ను రెండున్నర నెలలపాటు ఇంట్లో పెట్టుకుని చేసిన సేవకి నాచర్మం  చెప్పులు కుట్టించిచ్చినా చెల్లు కాదు. తోబుట్టువులే "వస్తున్నాం" అంటే ఎన్నాళ్ళుంటావు అని అడిగి కానీ రావచ్చో రాకూడదో చెప్పరు. ఇప్పుడు కాదు అప్పుడు కాదు, ఈ ఏడు కాదు, వచ్చేయేడు అంటూ రావద్దని వాయిదాలరూపంలో చెప్పేవారికి లెఖ్ఖే లేదు. అయినా నాకు సంతృప్తిగా మాత్రం లేదు. ఏదో అసంతృప్తి. రెండేళ్ళు వరలక్ష్మిని చూసినతరవాత నాకు అర్థమయింది. తనకి నేననే కాదు ఎవరో ఒకరు దురవస్థలో కావాలి. ఎవరికి ఎప్పుడు అవుసరం వస్తుందా అని ఎదురు చూస్తున్నట్టుంటుంది ఎప్పుడు పిలిచినా. ఎవరికీ ఏ అవుసరమూ లేనిరోజున నీరసపడిపోతుంది. అది కూడా ఒక దురవస్థ అనడం మర్యాద కాదు కానీ ... నాకు అలా అనిపిస్తుంది.

"సాయం చేసినమాట నిజమే. కానీ అది నేను చెప్తున్నలాటి స్నేహం కాదు," అన్నాను.

"ఎందుగ్గాదు?"

"ఎందుక్కాదంటే ఆపదలోనున్నవారిని ఆదుకోడం ఆ అమ్మాయికి సహజగుణం కర్ణుడి కవచకుండలాలలాగ పుట్టుకతో వచ్చినవి. అందరికీ చేసినట్టే నాకూ చేసింది. నేను ఆమెకి తిరిగి చేయగల సాయం కూడా ఏమీ లేదు. ఇప్పుడు, నా అవసరం తీరిపోయినతరవాత, నాకు మరో అవసరం లేనప్పుడు, తనయితే పిలిస్తుంది కానీ తీరా వెళ్తే మాకు మాటాడ్డానికేం ఉండదు. కాగా ఆమెనించి సాయం పొందవలసిన దుస్థితిలో నేను పడ్డందుకు నాకు మరింత బాధగా కూడా ఉంటుంది," అన్నాను. స్నేహితులు ఆపద్బాంధవులు కావచ్చు కానీ స్నేహం అంటే ఆపదలో ఆదుకోడం మాత్రమే కాదు అంటూ ఆ రెండు అవస్థలమధ్య తారతమ్యం విశదీకరించేను.

“అసలదే నిజవేన సెయితంవంటె. నీకు సేసేను నాకు ఏటి సేస్తవనకండ సేసింది. నివ్ తప్పట్టంవేం మరియాద?” సంద్రాలు కసురుకుంది.

మొత్తం మాయిద్దరిమధ్యా జరిగిన సంభాషణ అంతా చెప్పను గానీ సూక్ష్మంగా నాకెందుకు బాగులేదో చెప్తాను. జ్ఞానేశ్వరి ఏవో తన ఈతిబాధలు చెప్పుకుపోతూ ఉంటుంది కనిపించినప్పుడల్లా. నేనేదైనా చెప్పబోతే మధ్యలోనే కత్తిరించేస్తుంది. మధురగోపాలం తాను చూసిన సినిమాల్లో హాస్యఘట్టాలన్నీ నటించి చూపించేస్తుంటాడు. నాకందులో హాస్యం కనిపించదు. సౌగంధిని పాకశాస్త్రప్రవీణ. కనిపించినప్పుడల్లా తాను చేసిన కొత్త కొత్త ప్రయోగాలన్నీ నాకు ఒప్పచెప్పుతూంటుంది నామొహమ్మీదికి ఒంగి కళ్లూ, చేతులూ రకరకాల భంగిమలలో ఉంచి. అది చూస్తుంటే, ఆవిడ నాకు నాట్యశాస్త్రం నేర్పుతోందో పాకశాస్త్రం నేర్పుతోందో స్పష్టం కాదు. నేను చేయగలిగిందల్లా ఎప్పుడయిపోతుందా ఈ ప్రదర్శన అని ఎదురు చూస్తూ కూర్చోడమే. గోవర్ధనరామావధానులకి నేత్రావధానం నేర్చుకోవాలన్న తాపత్రమయితే ఉంది గానీ దానికి కావలసిన శ్రద్ధ, దృఢచిత్తము, ధారణ, నైపుణ్యము, వైదుష్యము ఆ ఆరడుగుల మూడంగుళాల దేహంలోనూ ఇముడుతున్నట్టు కనిపించదు అంజనం వేసి చూసినా. ఇంక నాకత్యంతం ప్రీతపాత్రమైన సాహిత్యంసంగతి తీసుకుంటే, నేను ఎదురుపడ్డప్పుడు నేనుఎంతో ఘనంగా సాహిత్యసేవ చేస్తున్నానంటూ నామొహంమీద మెరమెచ్చు కబుర్లు చెప్పేవాళ్లే కానీ నిజంగా నేనేం చేస్తున్నానో, చేసేది సాహిత్యసేవ అవునో కాదో చెప్పగల విద్వవద్వరేణ్యులు నాకింతవరకూ తటస్థపడలేదు. నేనీమాట చిత్తశుద్ధితో ప్రమాణపూర్తిగా చెప్తున్నాను. నేను ఏదైనా పనికొచ్చేది చేస్తున్నానా లేదా. నేను చేస్తున్నదానివల్ల ఎవరికైనా ఏమైనా ఉపయోగం ఉందా అని నాకు తెలుసుకోవాలని ఉంది. … అవునౌను. సభలు చాలానే పెట్టేరు, శాలువాలు చేరేయి రెండు పెట్టెలు నిండుకు. లేదు, లేదు, ఇక్కడ “నిండుకు” అంటూ నిండుకున్నాయి అన్న విపరీతార్థంలో కాదు. పెట్టెలనిండా ఉన్నాయనే అర్థం. వాస్తవంలో, ఆ సన్మానాలన్నీ అవి ఏర్పాటు చేసిన సంస్థల, సభాపతుల, కార్యకర్తల

ప్రచారార్థం మాత్రమే అని తెలిసేసరికి నాసాహిత్యజీవితంలో ముక్కాల్ వాసి మురిగిపోయింది. ఒకరిద్దరు నామొహమ్మీదే ఏ సందేహాలకీ ఏమాత్రమూ అవసరం లేకుండా చక్కని భాషలో స్పష్టం చేసేరు నేనెలా ఉంటానో చూడ్డానికొచ్చేరని. అదే, పంతులుగారొగ్గేసిన ఆడమనిషి ఎట్టుంటదో సూణ్ణానికి అన్నమాట. ఇంకా కొందరేమో వారు సృష్టించిన పుస్తకరాజములు నేను అమెరికాలో ప్రచారం చేసిపెట్టగలనేమో అనిట. అవ్విధమున నా సాహిత్యసేవ పవమానసుతుబట్టు పాదములకు చేరిపోయింది. ... ...

ఇలా ఇరవై నిముషాలపాటు గానం చేసేను నా నోరు. ఇలా చెప్తుంటే నామటుకు నాకే హాస్యాస్పదంగా నాచెవుల్లో ప్రతిధ్వనిస్తోంది. ఏ పదహారేళ్ల పడుచుపిల్లో ఇలా కథనం సాగిస్తే, వైనీ అనో వింప్ అనో అంటారు. బతుకు మూడొంతులు ముగిసియిపోయేక కూడా అంతే మరి!

సంధ్రాలు కనుబొమలు ముడిచి, తీక్షణంగా నామొహంలోకి తేరి చూసి, విసురుగా తలాడించింది. నీఖర్మ అనో, నీకింక పుట్టగతులుండవనో నాకయితే సరిగా అర్థం కాలేదు. అంచేత మళ్ళీ అడిగేను. "ఇదుగో, నువ్వేదో నా ప్రాణస్నేహితురాలివనీ, నన్ను అర్థం చేసుకున్నదానివనీ, చేసుకోగలదానివనీ, అపార్థం చేసుకోనిదానివనీ ఇక్కడికొచ్చి, నామనసులో మాట ఉన్నదున్నట్టు, ఎంత వెగటయినా సరే, వెళ్ళగక్కేను. నువ్వేమో హరికథ విన్నట్టు విని, ఆ హరికథ రక్తి కట్టలేదన్నట్టు తలాడిస్తే ఏమనుకోమంటావు?" నాకింక గోదారే గతేమోనని కూడా అని కూడా అనుకున్నాను, పైకి అనలేదు కానీ.

సంధ్రాలు మరోసారి తల పంకించి, చిన్ముద్ర పట్టి, "నీజాతికంల సేయితం నేదు," అంది.

నేను తలాడించేను నాక్కూడా అదే అనుమానంగా ఉందన్నట్టు. ఆ తరవాత, ఓ గ్లాసెడు మంచితీర్థం పుచ్చుకుని సంధ్రాలు నా వాదనలన్నీ ముక్కకి ముక్క పూర్వపక్షము చేయడం మొదలు పెట్టింది.

మళ్ళీ ఆ కచేరీ అంతా ఇక్కడ పెట్టను కానీ, సూక్ష్మంగా సంద్రాలు అభిప్రాయాలు ఇలా ఉన్నాయి. "ఎవురైన ఏటి మాటాడ్తరు. ఆల్లకి తెలిసిందె చెప్తరు. చినిమవోలు చినిమలు, యాపారాలోరు యాపారాలు. మనుంపే కతలు సెప్పుకుంటన్నం సీతమ్మోరి కస్టాలు, కిస్ట పరమాతమ సింగారం సెప్పుకుంతన్నంవా నేదా. నివ్ మాతరంపేటి సెప్తన్నవ్, నీకు తెల్సిన కతలు, నివ్వు రాసిన కతలే గద. నీకు తెల్సిందే సత్తెం, ఆరికి తెల్సింది సత్తెం గాదని ఎక్కడున్నది? నీకు బాగనేపోతె గమ్మునుండు. ఆర్ని తప్పు పట్టమాక. నీకు నచ్చనేదు. వొదిలీ. నీకు స్నేయితం గావాలంతె నీకు నివ్వెంతో ఆరికి ఆరంతె. అవ్వా గావాల బువ్వా గావాలంతె కుదుర్దు."

ఉలిక్కి పడ్డాను. అదా నేను కావాలంటున్నది? తలొంచుకుని ఓ రెండు నిముషాలు ఆలోచించేను. తరవాత తలెత్తి చుట్టూ చూసేను. సంద్రాలు కనిపించలేదు. కళ్ళు నులుముకు చూసేను. సంద్రాలు లేదు.

అకస్మాత్తుగా, నాకు చాలాసారు వచ్చిన కల ఒకటి జ్ఞాపకం వచ్చింది చాలా రోజులతరవాత. ఆ కల కొంతకాలం తరుచూ కనిపిస్తూ ఉండేది. చుట్టూ అనంతపారావారం, దిగంతాలలో నింగిని చుంబిస్తూ అంభోనిధి. రెండు నిలువుల ఎత్తుకి ఎగజిమ్మి, మారీచుసుబాహుల్లా విరుచుకుపడి, మహోధృతమైన వేగంతో నావేపు ఉరుకులు పరుగులుగా వస్తున్నతరంగాలు. నేను పెద్ద బండశిలపైన నిల్చుని చుట్టూ చూస్తున్నాను. కనుచూపుమేర పారావారమే తప్ప, బండశిలమీద నేను తప్ప మరో జీవి కనిపించడం లేదు. నేనెలా అక్కడికి వచ్చేనో, ఈ జలరాసి ఎప్పుడు అంతమవుతుందో అని చూస్తున్నట్టున్నాను. మెళుకువ వచ్చినతరవాత కూడా నాకు ఆదృశ్యం మనసులో చాలాసేపు మెదులుతూనే ఉంటుంది. ఆరోజుల్లో మా అమ్మ చెప్పే సామెత గుర్తుకొచ్చేది. కలలో నీరు కనిపిస్తే నిధి కనిపిస్తుంది అని. ఆ నిధులకోసం ఎదురుచూస్తూండగానే నా జీవితం ముగింపుకొస్తోంది! ఇది ఏకాంతవాసమందు నాకు గల ఆకాంక్షకి సంకేతమేమో అని అనేకమారులు అనుకున్నాను. ఇప్పుడు మళ్ళీ అలా అనిపిస్తోంది. ఎటొచ్చీ ఇది కల కాదు. ప్రస్తుతం నేను మెళుకువగానే ఉన్నాను.

దూరంగా మనుషులు కనిపిస్తున్నారు. చుట్టూ రంగురాళ్లతోపాటు తరులతాగుల్మాదులు జీవకోటి అస్తిత్వాన్ని ఋజువు చేస్తున్నాయి. సంద్రాలు మాత్రం మళ్ళీ కనిపించలేదు.

పొగలుతున్న వగతో విలియం కౌపర్ కవిత నాకళ్ళముందు ప్రభవించింది.

How sweet, how passing sweet, is solitude!

But grant me still a friend in my retreat,

Whom I may whisper, Solitude is sweet.

(**William Cowper**, from *Poems by William Cowper of the Inner Temple, Esq.* (1782). Retirement.)

సంద్రాలూ, నువ్వే న passing sweet ఏకాంతానివి!

(మార్చి 3, 2014)

# 3. యోగాచెప్పులూ, కర్మాఅప్పులు

చెప్పులకి సంబంధించినంతవరకూ నేనింకా పాతరాతియుగంలోనే ఉన్నాను. అమ్మదేశంలో ఉన్నన్నాళ్ళూ ఏ రెండేళ్ళకో ఓమారు ఓ చెప్పులజత కొంటే సరిపోయేది. కంతిరిబజారులో గానుగచెట్టుకింద దుకాణం పెట్టుక్కూచున్న గొడారికి అది ఇచ్చి కుట్టించుకున్నరోజులు కూడా ఉన్నాయి. ఇప్పుడు అమెరికాలో వాటిని "కస్టమ్మేడం"టారు. అన్నాక వాటి ధర మూడు రెట్లు చెప్తారు. మాకాలంలో మాఊళ్ళల్లో అవే కారుచవక.

అమెరికా వచ్చేక మారే ఋతువులతోపాటు పాదరక్షలు కూడా మార్చుకోవాల్సిందే ఇష్టం ఉన్నా లేకున్నా. వీధుల్లో తిరిగినప్పుడే కాక ఇంట్లో కూడా చెప్పులఅవసరం ఉంది.

ఇంతకీ కాలిఫోర్నియాలో చలి తక్కువా, వేకులెక్కువా (ధరలమాట సరేసరి) అని తెలిసికొనినదాననై, ఇక్కడికి వచ్చేముందే కాలానికీ, మాఅమ్మాయిస్థాయికీ తగినజోళ్ళు కొనుక్కోవాలని నిశ్చయించుకున్నాను. మాఅమ్మాయిస్థాయి అంటున్నాను కానీ నిజానికి అమెరికాదేశం అంతటా ఉంది ఈ నఖశిఖపర్యంత పరీక్ష. అంటే మనం ఎదురు పడగానే, జోళ్ళు బాగున్నాయి, శిఖ అందంగా ఉంది అనకుండా సంభాషణ మొదలు పెట్టడం అరుదు.

000

ఓ జోళ్ళదుకాణం ప్రాంగణంలో నిలబడి నేను ధరించగలిగినవి ఇక్కడ ఉంటాయా అని చూస్తున్నాను.

"జోళ్లు చూస్తావా?" అంది అమ్మకాల చిన్నది.

"చూస్తున్నాను."

"ఎలాటి జోళ్ళు?"

"వేసవి చెప్పులు."

"యోగా చెప్పులా?"

అహో, నా "హిండూ"మోము చెప్పకయే చెప్పును, అది జగద్విదతము అనుకుంటుంటే మరో ఆలోచన ఉదయించింది. యోగాభ్యాసానికేవో పద్ధతులూ, నిబంధనలున్నాయని విన్నాను యోగాకి వేరే చెప్పులు అని తెలీదు.

"యోగా చెప్పులా?"

"యోగాచాపలాగే. చెప్పులు కూడా ప్రత్యేకపద్ధతిలో తయారుచేస్తాం."

"చూపించు. ముందు నేను చూడాలి. చూసి కాని చెప్పను."

"ఇది భారీ ఉత్పత్తి కాదు. ప్రతి వ్యక్తికీ వారి ప్రవృత్తికి అనుగుణంగా తయారు చేస్తాం. ఇటురా. ఇక్కడ కూర్చుని ఈ ఫారం పూర్తి చేయ్యి ముందు."

ఈ ఫారం పూర్తి చేయడానికి కూర్చునేముందు కూర్చోడానికి కూడా ఏదైనా ప్రత్యేకపద్ధతి ఉందేమోనని ఆ పిల్లమొహంలోకి చూసేను. కానీ అలాటి సూచనలేమీ లేవు. సరే.

యోగసాధన చేసినా చెయ్యకపోయినా జ్ఞానసముపార్జన కాగలదని ఎంచి, ఆమె చూపిన కుర్చీలో కుదురుగా సుఖాసీనురాలినై ఫారం చదవడం మొదలు పెట్టేను. పేరూ, ఊరూ, ఇంటి చిరునామా, కంటిరంగూ, ఒంటి రంగూ, కేశసంపద రంగూ … … నాకు అనుమానం వచ్చింది. నా అస్తిత్వం దోచుకోమని, చూస్తూ చూస్తూ సర్వస్వామ్యసంకలితముగా ఇచ్ఛాపూర్వకంగా వారికి రాసిచ్చేస్తున్నట్టుంది ఆ ఫారం చూస్తుంటే. తలెత్తి ఆ పిల్లవేపు చూసేను.

"ఏంటి, ఏమైనా సందేహాలా?"

"కంటిరంగుకీ కాలిజోడుకీ సంబంధం ఏమిటనీ?"

"నాకు తెలీదు. పూర్తి చేసి ఇయ్యి. అంతే."

"నాకు జవాబు తెలుసుకోవాలని ఉంది."

"ఆ ఫారం నేను తాయారు రాయలేదు. కంపెనీయజమానులు తయారుచేసిన ఫారం అది. ఆ ఫారం నీకివ్వడం, నీచేత పూర్తి చేయించి, తీసుకుని మా కార్ఖానాకి పంపడంవరకే నా పని."

"ఈ ఫారం పూర్తి చేయడానికి నేను అభ్యంతరం చెప్తే ఏమవుతుంది?"

"నీ చెప్పులజతకి జీవితకాలం భీమా ఉండదు."

"ఎవరి జీవితకాలం? నాదా, చెప్పులదా?"

"ఎవరు ముందు పోతే వారిజీవితకాలం. నువ్వు పోయినా చెప్పులుంటాయి. చెప్పులే ముందు పోతే మేం సరికొత్త జత తయారుచేసి ఇస్తాం ఉచితంగా."

హ్మ్. ఇలాగే దిగుతాం గోతిలోకి. అయినా నేను పోయేక చెప్పులు ఉంటే ఎంత, పోతే ఎంత?.

విజ్ఞానమే నాధ్యేయం కనక మౌనముద్రాంకితురాలినై ఫారం పూర్తిచేసి భక్తిప్రమత్తులతో ఆమెకి అందించేను. ఆ అమ్మాయి నిరామయంగా ఆ ఫారం అందుకుని, అటూ ఇటూ తిప్పి చూసి, మరో ఫారం ఇచ్చింది.

"ఇదెందుకూ?"

"ఇది "కర్మా అప్పు" ఫారం."

"నాకు అప్పు అఖ్ఖర్లేదు. డబ్బిచ్చేస్తాను."

"అయినా అప్పుపత్రం పూర్తి చెయ్యాలి."

"ఎందుకూ?"

"చెప్పేను కదా జీవితకాలం భీమా ఇస్తున్నాం అని. అది అప్పుకిందకే వస్తుంది. రివాల్వింగ్ అప్పన్నమాట."

… …

"ఫారం పూర్తి చేయడం అయిందా?"

"లేదు. ఏం రాయాలో నాకు తెలీడం లేదు. కుడికాలు కొలతలూ, ఎడమకాలు కొలతలూ, బరువులూ - ఇవేమిటి? కాలు బరువు ఎలా తెలుస్తుంది కాలు కొట్టేసి తూస్తే తప్ప."

"ఆ కొలతలు నేను తరవాత తీసుకుంటాను. మాదగ్గర ప్రత్యేకంగా మిషన్లున్నాయి."

"అబ్బ. మీదేశం ఎంత అభివృద్ధి పొందిందీ! కానీ నారెండు కాళ్ళూ ఒక్కలాగే ఉన్నాయి. వాటికి విడివిడిగా కొలతలు లేవు."

"అలా కాదు. ఏకాలుగుణాలు ఆకాలివే. వేలిముద్రలలాగే కాలి ముద్రలు కూడాను."

నాకు చిన్న చిరాకు కలిగింది. నాబాధ ఆకొలతలకోసం నాకాలు ఊడదీస్తుందేమోనని. "అలా కాదు. నా రెండు కాళ్ళకీ ఒకే గుణం. అది దుర్గణం. అది అతిగా తిరగడం" అన్నాను విసురుగా.

అమ్మాకాలపిల్లకి కూడా చిరాకు కలిగే ఉంటుంది. కానీ చాలా శాంతంగా, చిరునవ్వుతో, "మీరూ గమనించే ఉంటారు. మీరు కాలు తీసి కాలు వేస్తూ ముందుకు సాగుతారు. ఏకాలు నేలమీద ఉంటే ఆకాలుమీద మీబరువు ఒకటిన్నర క్షణం ఉంటుంది. దానికి తగ్గట్టు అంటే మీపదఘట్టనకి అనుగుణంగా మేం మీజోళ్ళు తయారు చేసి ఇస్తాం. మీ జోళ్ళు దీర్ఘకాలం మనడానికి గల రహస్యాలలో అదొకటి."

"ఇంతమంచి సమాచారం తెలుసుకుని రెండు దశాబ్దాలయింది. ఇంకా ఏమైనా ఉన్నాయా?"

"ఈజోళ్ళతో తిరగడం అయినతరవాత మీఇంటి ముఖద్వారం దగ్గర వదులుతారు కదా. ఉదయం తలుపు తెరిచి, కొంతసేపు దక్షిణపుగాలి తగలనివ్వండి. దక్షిణవాయువులు ఇతోధికశక్తినిచ్చి, మీకు ఆయురారోగ్యాలు ప్రసాదించడానికి తోడ్పడతాయి."

"మాయింటి సింహద్వారం దక్షిణముఖంగా లేదు," అన్నాను దిగులుగా.

"అయ్యో, చెప్పరేం. అది చాలా ముఖ్యం జోళ్ళకే కాదు మీక్కూడా. వెంటనే ఇల్లు మారండి."

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చేను. ఆ తరవాత జోళ్ళవేట ఆపి ఇళ్ళవేట మొదలు పెట్టి తిరుగుతున్నాను. మూడోరోజున కాటోటు లీల కనిపించింది, "ఈమధ్య కనిపించలేదు. ఊళ్ళో లేవనుకున్నాను."

"ఊళ్ళోనే ఉన్నాను. జోళ్ళపేటతో మొదలయిన వ్యవహారం ఇళ్ళపేటకొచ్చింది. కాళ్లరిగిపోయేలా తిరుగుతున్నాను, మాపూర్వులు పెళ్ళికొడుకులకోసం తిరిగినట్టే," అని సూక్ష్మంగా నా పాదరక్షలకథ సాంగోపాంగంగా వివరించేను.

అంతా విని, "నీమొహం," అని సుతారంగా నా విజ్ఞానాన్ని కొట్టి పారేసి, "గుళ్ళపల్లి మార్కెట్లో చూసేవా?" అని జోడించింది లీల.

"లేదే. అలాటి మార్కెట్టొకటి ఉందనే నాకు తెలీదు."

"మన హిండూలే లే. ఈమధ్యే తెరిచేరు."

"మంచి జోళ్ళు దొరుకుతాయంటావా?"

"జోళ్ళూ బీళ్ళూ నాకు తెలీదు కానీ ఈ యోగాపాఠాలూ కర్మాపాఠాలూ ఉండవక్కడ. ఏదో కొంటే తప్ప నువ్వు దుకాణంలోకి ప్రవేశించేవని కూడా గమనించుకోరు వాళ్ళు."

---------

అన్నట్టు చెప్పలేదనకండి - ఈకథ నిజం కాదు. నిజం చెప్పాలంటే నిక్కచ్చిగా అబద్ధం! నేను జోళ్ళకోసం తిరుగుతుంటే ఒక షాపులో యోగా చెప్పులా అని అడిగినమాట మాత్రం వాస్తవం.

(ఫిబ్రవరి 1, 2015)

# 4. చక్రవాళవ్రత కథ

మున్ను కాదులెండి ఈమధ్యనే నారదులవారు ఇలాతలానికి వేంచేసి, భూనభోంతరాళాల చుట్టుతిరిగి, ఈనాటి నవచైతన్యానికి, నవనవోన్మేషమై పరిఢవిల్లుతున్న నవజీవనవిధానానికీ అచ్చెరువొంది, హడావుడిగా వైకుంఠం చేరుకున్నారు శ్రీమహా విష్ణువునితో సంప్రదించడానికి.

"మహా ప్రభో, ఆంధ్రదేశము నాకు మిక్కిలి అయోమయముగా నున్నది. వీరు అంతర్జాలమునందు వేళా పాళా లేక విహరించుచు, పరస్పర భూషణలతో కాలము గడుపుచున్నారు. మున్ను సత్యనారాయణవ్రతము చెప్పి తమరు జనులను తరింపజేసిరి. ఈనాటిజనులకు అట్టి వ్రతము ఏదైనను గలదా?" అని కరద్వయము ముకుళించి ప్రశ్నించెను దీనాతిదీనముగా.

అంతట శ్రీమహా విష్ణువు గాఢముగా నిట్టూర్చి. "కుమారా, వ్రతము లేకేమి. కలదు గలదు. చక్రవాళవ్రతము అని ఆ వ్రతముపేరు.''

"చక్రవాళవ్రతమా? అది ఏమి స్వామీ? చక్రవాళమననేమి? ఆచరించు విధానమెట్టిది?"

"చక్రవాళమన గుంపు, మంద అని అర్థములు గలవు. మానవుడు ఒంటరిగా బుట్టి, ఒంటరిగా పోవుననునది సర్వజనవిదితమే గదా. ఆదిమానవుడు ఒంటరివాడే. క్రమముగా వాతావరణరీతులనుండి తనను కాపాడుకొనుటకొక నివాసము, స్త్రీసంపర్కముతో కుటుంబమూ, గణవిభజనతో నాయకత్వము మున్నగునవి ఏర్పడినవి. 20వ శతాబ్దములో ఈ virtual మేధవలన తిరిగి ఆ ఒంటరితనము మానవులను ఆయోమయములో పడవేసినది. అందుకు విరుగుడుగా ఈ సామాజికగుంపులు ఉద్భవించినవి, తమ తమ అభిరుచులననుసరించి. వానిలో భాగమే ఈ చక్రవాళములు. తత్సంబంధి ఈ వ్రతము. శ్రద్ధాళువై విని, ఆంధ్రదేశమునందు ప్రచారము చేయుము. నీవును వారును తరింపగలరు," అని వ్రతవిధానము ఈవిధమున వివరించెను.

అది ఎట్టిదనిన -

''రాత నేర్చిన ప్రతి ఒక్కరూ కనీసం మూడు చక్రవాళములలో చేరవలె. చేతివ్రాత రానివారు టైపు నేర్చుకుని, టైపు చెయవచ్చు. రానివారికి వచ్చినవారు నేర్పవలె. అట్టు

రాయనేర్చినవారు రోజువారీ వేలిముద్రలద్వారా గానీ వ్యాఖ్యద్వారా గానీ తమ లేదా తమ స్నేహితులగోడపై సందేశముద్వారా గానీ తమ ఉనికిని ప్రకటించుకొనవలెను.''

"అందరికీ ప్రతిదినము కుదరకపోవచ్చు స్వామీ."

"అట్లు కుదరకపోయినచో, దోషపరిహారార్థము, మరునాడు మూడింతలుగా తమ ఉనికిని ప్రకటించుకొనవలెను."

"ఇది సులభతరముగనే గన్పట్టుచున్నది. ఈ వ్రతమునకు ఉద్యాపన గలదా?"

"ఆహా, గలదు, గలదు. పై విధముగ ఒక నెలపాటు వ్రతమునాచరించి, తరువాత, సంఘేతరులను నలుపురిని తమ తమ చక్రవాళములలో చేర్చి ఉద్యాపన సంపూర్ణము చేసుకొనవలె."

"ఒక నెలపాటు చాలునా?"

"కుమారా, కలికాలములో జనులు సద్యఃఫలమునాశింతురు. వారికి నెలరోజులపాటు అనగా మన కల్పముతో సమము."

"ఈ వ్రతమునకు ఫలశ్రుతి ఏమి?"

"మిత్రసందోహము వృద్ధి కాగలదు. తద్వారా దేశ విదేశములయందు పలుకుబడి పెరుగును."

"ఆహో ధన్యతనొందితిని. ఈవ్రతము నాకు మిక్కిలి ఆనందదాయకముగా నున్నది. వ్రతము కారణాంతరములవలన సంపూర్ణము కాకున్న కలుగు దుష్ఫలితములును వివరించి నన్ను ధన్యుని ఒనరింప వేడుచున్నాను."

"వ్రతము చేయకపోయినను, ప్రారంభించి త్యజించినను జన్మరాహిత్యము కలుగును."

"అదేమి ప్రభూ. జన్మరాహిత్యము పాపపరిహారమెట్టుల కాగలదు? మానవజాతి ప్రభవించిననాటినుండీ మానవాళి కోరునది జన్మరాహిత్యమే గదా."

"నాయనా, ఆ కాలము గతించినది. పూర్వము జన్మరాహిత్యమునకై మానవులు తపములాచరించిరి. ఆ ధర్మములు వేరు. ప్రస్తుతము ప్రజలకు జాలరాహిత్యము రౌరవాది నరకములతో సమము. వారికి జన్మరాహిత్యముప్రశ్న లేదు. సూర్యోదయాత్పూర్వమే లేచి జాలజలధిలో ఓలలాడుటే వారికి జన్మరాహిత్యమంత హర్షమును కలిగించును."

"తండ్రీ, నేనెంతటి అజ్ఞానాంధకారములో మునిగియుంటినో ఇప్పుడు నాకు సంపూర్ణముగా అవగతమయినది. అయినను నాకు మరియొక స్వల్పసందేహమును గలదు."

"ఏమది చెప్పుము."

"వారికి వైకుంఠమునందు ఆసక్తి లేదేని మరి మనగతి ఏమగును?"

"అదియే ఇందలి చిదంబరరహస్యము. అంతర్జాలము విశ్వవ్యాప్తము. నేను విశ్వవ్యాపకుడను. అనగా విశ్వమంతయు వ్యాపించియున్నవాడను. అనగా జాలజనులందరును పరోక్షముగా నన్నును, నాయందే లీనమైయున్న నిన్నును సేవించుచునే యున్నారు."

నారదులవారు వైకుంఠవాసునికి మరొక వంద అభివాదములు సమర్పించుకుని హడావుడిగా భూలోకంలో దిగారు. మూడు రోజులపాటు వింతలు విశేషాలు నిదానంగా పరిశీలించి, తమ తప్పు తెలుసుకున్నవారయి అదురుతున్న గుండెలతో తిరిగి శ్రీమన్నారాయణుడిమందిరం చేరుకున్నారు.

"దేవాదిదేవా, ఆదిదేవా, పరమపురుషా, మీరును నేనును మిక్కిలి వెనకబడి యున్నవారము. మీరు చెప్పిన వ్రతము సుమారుగా చాలాకాలముగా ఆచరణలో ఉన్నట్టే కన్పట్టుచున్నది. ప్రజలు గంగాళమ్మజాతరలోవలె అలివి కాని ఉత్సాహముతో తమ తమ నిత్యనైమిత్తికములను మరచి వెబ్బులో తేలియాడుచున్నారు. ప్రస్తుతము కావలసినది దీనికి ప్రతిహారము గానీ మరొక వ్రతము గాదు," అని చెప్పెను.

శ్రీమన్నారాయణుడు మందహాసము చేసి, "నాయనా, నేను సర్వజ్ఞుడను కదా. నీకు తెలియజేయుటకే నిన్నంపితిని. లెస్స గ్రహించితివి. ప్రతి జాడ్యమునకు విరుగుడు గలదు. నీవు మరల అచ్చటికేగి వారికి ఉపవాసముయొక్క అవుసరమును వివరింపుము. మాసమున కొకమారు 3వ తేదీన గానీ లేదా 5, 9, 14వ తేదీనగానీ, వెబ్ జోలికి పోరాదు, ఆఫీసుపనులు మినహాయింపు. వాస్తవములో కీబోర్డుమీద వ్రేళ్ళు పడిన ఈ చక్రవాళములలోనికి దిగకుండ తమని తాము అదుపులో పెట్టుకొనగలుగుటే ఈ ఉపవాసవిధిలో కిటుకు. అది ఇనుమిక్కిలి దుఃఖతరము, దుస్తరము. మాసములో రెండు దినములు ఒంటిపూట ఉపవాసము చేసినను అదే ఫలము. ఒంటిపూట అనగా రోజుకు ఒకమారు మాత్రమే జాలప్రవేశము చేయుట."

నారదులవారు ఆ ఆద్యంతరహితుని మోము అత్యంత కుతూహలముతో పరిశీలించి చూచి, తల పంకించి, భూలోకానికి తిరిగి విచ్చేసిరి.

అటు పిమ్మట కారణజన్ముడూ, లోకసంచారీ అయిన నారద మహర్షి అవిఘ్నమస్తు అని మనసులోనే ఒక ప్రార్థన చెప్పుకుని, శ్రీమన్నారాయణుని పేరునఖాతా తెరిచేడు చక్రవాళములో .

అంతే, కథ సుఖంగా కంచికి చేరుకుంది!

(ఫిబ్రవరి 5, 2015)

# 5. చెత్తకుండి భద్రం!

చెత్తకుండీల్లో చేరే ఎలకలూ పందికొక్కులగురించి కాదీ కథ. చెత్తకుండీల్లో ఇళ్లల్లోవాళ్ళు పారేసిన చెత్త ఏరుకుని బతుకులు వెళ్ళదీసుకునే బడుగువారిగురించి చెప్తున్నా.



నేను నిత్యా తిరిగేది పట్టుమని మూడు మైళ్ళు కూడా ఉండదు. ఆ పరిధిలోనే కనీసం ఇద్దరు ముగ్గుర్ని చూస్తాను కూరలబజారులో కనిపించే చక్రాలబండి తోసుకుంటూ. ఒకొక బండిలోనూ బండిఅంచుల వేలాడుతూనూ ఐదారు సంచులుంటాయి. వాళ్లలో ఒకమ్మాయిని నేను ప్రత్యేకంగా గమనిస్తున్నాను. యాదాలాపంగానే మొదలయినా, రాను రాను నాకుతూహలం మీరిపోతూ వచ్చింది. అప్పుడప్పుడు ఆ చెత్తకుండీల్లోంచి సగం తిని పారేసిన హేంబర్గర్లలాటివి ఏరుకు తినడం చూసేను కానీ అన్ని సంచులు నింపడానికేం ఉంటాయో నాకు అంతు బట్టలేదు. ఏమిటి ఏరుకుంటోంది, వాటితో ఏం చేస్తుంది, అసలు ఆమె ఆ పరిస్థితికి ఎలా వచ్చింది - ఇవీ నాకు అర్థం కానివీ, జవాబులు దొరకనివీను.

మామూలుగా వీధిలో నడుస్తున్నప్పుడు పరిచయస్థులూ కానివారూ కూడా పలకరిస్తారు. కొందరు అలవోకగా తలెగరేస్తే, కొందరు బాగున్నావా అని కూడా అడుగుతారు. ఇక్కడ అట్టే జనాలుండక కానీ అదే మనదేశంలో అయితే అలా హలోలు చెప్పుకుంటూ కూచుంటే, రెండు రోజులగ్గానీ ఇల్లు చేరం అని నవ్వుకున్న రోజులు లేకపోలేదు. అప్పుడే నాకనిపించింది ఇంతమందికి హలోలు చెప్తున్నప్పుడు ఈ అమ్మాయికి మాత్రం ఎందుకు చెప్పకూడదూ అని. ఒకరోజు పలకరింపుగా చిన్న నవ్వు నవ్వి, కనీ కనిపించనంతగా తలెగరేసేను. ఆ తరవాత నన్ను చూసినప్పుడల్లా ఆ అమ్మాయి కూడా చిన్నగా నవ్వు ప్రదర్శించింది. నాకు మాటాడాలని ఉంది కానీ ఏం మాటాడ్డం, ఏం మాటాడితే ఏం తప్పో. అసలు నాకు మాటాడాలని ఉన్నంతమాత్రాన ఆవిడ కూడా అలాగే అనుకుంటోందని ఎలా అనుకోను?

000

అలా ఆలోచిస్తూనే నా నిత్యసంచారానికి బయల్దేరి మెట్లు దిగుతుంటే, "యాడికి పొద్దెక్కి బయలెల్తన్నవు" అంటూ సంధ్రాలు ఎదురుపడింది.

"రా మంచి సమయానికే వచ్చేవు. నా మామూలు గస్తీకి బయల్దేరేను. పద. నడుస్తూ మాటాడుకుందాం."

ఇద్దరం తీరిగ్గా పెళ్ళినడకలు సాగిస్తున్నాం. కాళ్ళు సాగుతున్నాయి, నోరు వాగుతోంది కానీ కళ్ళు మాత్రం అలవాటయిన దృశ్యంకోసం వెతుకుతున్నాయి.

సంధ్రాలు కనిపెట్టేసింది. "ఏటి సూస్తన్నవ్. నీసేయితులొొస్తారేటి?"

"స్నేహితులు కాదులే. మామూలుగా ఇద్దరు ముగ్గురు కనిపిస్తారు ఈవీధుల్లో. ఇవాళ ఒక్కరూ కనిపించడం లేదేమా అని చూస్తున్నాను."

"నీనాగే పనీ పాటూ లేనోరేనా?"

"నన్నెందుకలా అస్తమానం ఎద్దేవా చేస్తావు?" అన్నాను విసుగ్గా.

సంధ్రాలు నవ్వింది, "మరెవుర్నమంటవు?"

నేను కూడా నవ్వేసి, "లేదులే. నువ్వన్నది నిజమే. నేను చేసే పనేముంది కనక. నేను చూస్తున్నది పూట గడుపుడానికి పాటు పడేవాళ్ళలే. అసలందుకే నిన్ను కూడా రమ్మన్నాను. వాళ్లేం చేస్తున్నారో నాకు సరిగా అర్థం కాలేదు. వాళ్ళగురించి నువ్వేమైనా చెప్తావేమోనని."

"ఏటి సెప్పాల, సెప్పనానికేంవుంది?"

"ఈ చెత్తకుండీలు కెలుకుతూ కనిపిస్తారు. ఏదో ఓ రొట్టెముక్కో కాయోపండో ఏరుకునేవాళ్ళని చూసేను కానీ వీళ్ళు సంచులకొద్దీ ఏమిటి పోగుచేస్తున్నారో, వాటిని ఏం చేస్తారో తెలీడం లేదు."

"ఆయమ్మనే అడగనేకపోనావా?"

"అడిగేను నాకొచ్చిన భాషలో. తల అడ్డంగా ఊపింది ఇంగ్లీష్ అంటూ. అందుకే నువ్వయితే ఆమెభాషలో మాటాడగలవని రమ్మన్నాను."

"ఈడో సెంటరుండాదిలే. ఆ ఇల్లోల్లు తాగి పారేసిన సోడాకాయలూ, గాజుబుడ్లూ ఏరి మూట గట్టుకుని ఆసెంటరోల్లకిస్తే, ఆరు నాలుగో పదో చేతలెడ్తరు."

నాకింకా ఈ ఊరు కొత్తే. సంధ్రాలు సర్వాంతర్యామి నాపాలిట. నా విజ్ఞానసర్వస్వం!

"నాలుగో పదోతో రోజు గడిచిపోతుందా?"

"ఆల్ల ఓపికనిబట్టి. ఒకొకలు యాబయ్, వందా కూడా సంపాయిచ్చుకుంతరు. ఒకాయనయితే 300 దనుక కల్ల సూస్తనన్నడు కలిసొచ్చిన్నాడు."

“వోన్లే. అదీ బాగానే ఉన్నట్టుంది,” అన్నాను సందిగ్ధంగా. నాకెందుకో ఆవిడ చెప్పినంత సుళువు అనిపించలేదు. ఆ అనుమానం కూడా తీర్చేసింది.

“అంత తేలిగ్గాదు. అడుక్కుతినేవోరిలో గిరుకుతినేవోడని. కలిగినోలు పారేసే సెత్త ఏరుకోనానికీ వోటీలే. ఒకుడు తెల్లారిగట్ల లేస్తే, మరొడు అర్తరేతిరే బయలెల్తుడు అందినన్ని అంకిచ్చుకోనానికి. ఊరిమజ్జిన ఓటల్లకాడయితే మరీ తన్నుకుసవ్వాల. కుంత దూరంలో నొంతిల్లోరూ, అద్దికున్నోరూ ఇల్లముంగలెట్టిన సెత్తకుండీలైత నయంపే గానీ అక్కన్నుంచి బండి తోస్కంట సెంటరు కాడికొచ్చేతలికి తల పేనం తోక్కొస్తాది.”

ఆ వృత్తిలో కూడా లుకలుకలున్నాయని తెలిసేక నామనసు తేలిక పడింది. ఈమాట మీకు అన్యాయంగా అనిపించవచ్చు కానీ ఏసంగతకయినా అనేకకోణాలు పరీక్షిస్తే అదే సంతృప్తి. ఇద్దరం నడుస్తున్నాం. దూరంగా వీధిచివర ముందురోజు చూసిన లెమన్ స్టాండు కనిపించింది. “చూసేవా, నాకిక్కడ నచ్చేవిషయల్లో ఇదొకటి,” అన్నాను.

ఎనిమిదేళ్ళ అబ్బాయి నిమ్మరసం అమ్ముతున్నాడు. గ్లాసు 50 సెంట్లు. ముందు రోజు నేనిలాగే నడుస్తుంటే ఆ అబ్బాయి ఆశగా నావేపు చూసేడు. నేను దగ్గరికి వచ్చేక మరింత హుషారుగా నామొహంలోకి చూసేడు.

“నాదగ్గర డబ్బులేవు. నేనూరికే వీధులంట తిరుగుతున్నాను,” అన్నాను క్షమాపణగా.

“ఫరవాలేదు,” అంది తల్లి చిరునవ్వుతో.

వాళ్ళని దాటి మరో పదడుగులు వేసేవేళకి ఆ అబ్బాయి ఏదో అనడం వినిపించింది. నేను వెనక్కి తిరిగి, “ఏమిటీ?” అనడిగేను.

“నువ్వు మళ్ళీ వస్తే, మేం ఇంకా ఇక్కడే ఉంటాం అంటున్నాడు,” అందావిడ.

నేను నవ్వి, “ఇవాళ కాదు కానీ రేపు తప్పకుండా వస్తాన”ని చెప్పి, “అదేమిటి?” అంటూ ఆ బల్లకి కట్టిన బోర్డు చదవబోయేను. నేను చదవక్ఖర్లేకుండానే ఆ తల్లి చెప్పింది కేన్సరుఆస్పత్రిలో పిల్లలకి బొమ్మలు కొనడానికిట ఆ డబ్బు.

నేను మర్నాడు డబ్బు తీసుకొస్తానని మరోమాటు మాటిచ్చి నాదారిన వోయేను. కథ ఆసాంతం చెప్పి, “వీళ్ళలో నాకు నచ్చిందిదే,” అన్నాను.

“ఏటి నచ్చినాది?”

“ఏం లేదు. పిల్లలకి చిన్నప్పటినుండి కొన్ని విలువలు నేర్పుతున్నారు కదా. జులాయిగా వీధులంట తిరిగేబదులు ఏదో సత్కార్యం.”

“సరి నువ్ పద,” అంది సంధ్రాలు నాబుజాలమీద ఉన్న శాలువ లాక్కుని.

నాకు అర్థం కాలేదు. అదే తెలుస్తుందిలే అనుకుని ముందుకు సాగి, లెమన్ స్టాండుదగ్గరకొచ్చి, ఓ గ్లాసు తీసుకుని డాలరు ఇచ్చేను ఆ అబ్బాయికి. అతను ధన్యవాదాలు చెప్పి, డాలరు పెట్టెలో పెట్టుకుని చిల్లర 50 సెంట్లు తీసి లెక్క సరి చూసుకుని ఇచ్చేడు. తల్లి నవ్వుతూ చూస్తోంది.

ఈ బేరం అంతా అయేవేళకి సంధ్రాలు వచ్చింది, శాలువా ఒళ్లంతా కప్పుకుని, తల చింపిరిగా రేపేసుకుని, కళ్ళు చికిలించి చూస్తూ, ఆ పిల్లాడితో దీనాతిదీనంగా, "గొంతెండిపోతన్నది. నాకాడ సెంటన్న నేదు. ఒక్క సుక్క నిమ్మరసం పొయ్ బాబూ," అంది.

ఆ అబ్బాయి తికమకగా చూసేడు. తల్లి ఆ దుకాణంధ్యేయం వివరించింది.

సంధ్రాలు నాచేతిలో గ్లాసువేపు చూసి, "ఒక్క సుక్క గొంతు తడుపుకోనీ," అంది.

నేను ఇరుకున పడ్డాను. ఇస్తే, ఆ అబ్బాయినీ, అతడిధ్యేయాన్నీ కించపరిచినట్టు. ఇవ్వకపోతే గొంతెండిపోతున్న మనిషిపట్ల రవంతయినా జాలి చూపని కర్కశహృదయురాలిని!

సంధ్రాలు చిన్నగా దగ్గుతూ వెళ్ళిపోయింది. "ఉండు. మంచినీళ్ళు తెస్తాను," అంది అబ్బాయి తల్లి. సంధ్రాలు వినిపించుకోలేదు.

నేను నా గ్లాసు తీసుకుని ఆ అబ్బాయి చేస్తున్న మంచిపనికి మరోమారు అభినందనలు చెప్పి, సంధ్రాలుని కలుసుకున్నాను.

"ఏంటి నువ్వు చేసినపని?" అన్నాను కోపంగా.

"నీకు సూపిచ్చిన ఏ యిసయానికైన ఎన్ని సేయలుంటయ్యో."

"ఏం ఛాయలు? పాపం ఆ అబ్బాయికి ఆవిడ కాస్త మంచితనం నేర్పబోతుంటే నువ్వు నన్ను నవ్వులపాలు చేసేవు."

"ఆ యమ్మ నేర్పేది మంచితనంవా డబ్బు సంపాయించేతనంవా?"

"ఆఁ?"

"సంపాయిచ్చి ఏంసేస్తన్నడు. యేరే ఆల్లకిస్తన్నడు. ఆయనకి పెతి సుక్కా డబ్బే."

"అవును, అది సద్వినియోగానికే గదా. రోజులు లెక్క పెట్టుకుంటూ మంచాన బడ్డ పిల్లలకి కాస్త ఉపశమనంగా బొమ్మలు కొనివ్వడం గొప్పవిషయం కాదూ."

"ఆఎనక ఏటవుతాది. అందురూ మాగొప్పగ సెప్పుకుంతరు. పేపర్ల బొమ్మలొస్తయి. ఇయన్నీ ఆ కుర్రోనికేం నేరుపుతయ్?"

నాకు నోట మాట రాలేదు. నేనంతదూరం ఆలోచించలేదు.

"అగ్గదే మరి. నాను పసిబిడ్డని గానులే, నాకూ తెల్సాసంగతి. ఐన నాకు కస్టం ఒచ్చింది గంద. నాకో సుక్క పోస్తే ఏటయిపోసాది?"

“ఏటీ అయ్యోనేదు. ఆ అబ్బాయి ధ్యేస అంతా తలపెట్టిన ఘనకార్యంమీదే ఉండాలని ఆమె కోరిక. అర్జునుడిదృష్టి అంతా తాను కొట్టబోయే పక్షికన్నుమీదే ఉన్నట్టు. ఏపని గానీ చేపట్టినప్పుడు మొత్తం దృష్టి అంతా దానిమీదే ఉండాలి,” అన్నాను నేను ఆవేశంగా.

“నివ్వా ఆల్నాగే మాటాడతన్నవు. నీకింక సాలా తెల్యాల.”

నేను కోపంగా సంద్రాలువేపు చూసేను. హుమ్, నేనెంత చులకనయిపోయేనూ అని కొంచెంసేపు వాపోయేను మనసులోనే.

“ఆహా, సరే. చెప్పు నేను ఇంకా తెలుసుకోవలసిన ఘనాపాఠీ విషయాలు.”

“నేదులే. నేన్నింటం నేదు. ఈదేసంలో అసులు ఇయేలా రేపూ అదే నాయం అయ్యోనాది. దేసంపేటి, నోకం అంత అనాగే ఉన్నాది. ఇందలక నివ్ సెప్తన్నవే ఆ బండి తోసుకు బతికేయమ్మనే సూడు. మొగున్ని నమ్ముకుని ఈదేసం వొచ్చింది. ఆడేమో గొప్పోల్లఇల్లు కడ్తా దూలం కూలి సచ్చిపోనాడు. నేయానికి ఆడికుటుంబంవోలకి నస్టం ఇచ్చుకోవాల ఆకట్టించేవోలు. లేనోల్లకి కోరట్లు కోరట్లు గావు. ఆ యమ్మ ఆలదేసంలో పెద్దసదువే సదూకుందంట. అవుతేనేమి, ఇంగిలీసు రాదు. అందుసేత ఆయమ్మకి సరిపోయీ పని దొరకనేదు. కాలీజీలో గాజుబుడ్లు కడిగి, ఇల్లల్ల బాతురూములు కడిగీ పిల్లల్ని సదివించింది. ఉప్పుడేంవో ఆయమ్మకి కాయితాలు లేవని ఆలదేసానికి పొమ్మంతన్నరు గవుర్మెంటోలు. కొడుకులు సేన్నంలో సేరిపోనారు. సవ్వానానికి పనికొస్తరు గాని బతకతం అంట ఏగానిక్కొర గారు అంటరు మల్ల ఆ యుద్దానికి పంపినోలే.”

“అవును, యుద్ధాలకీ, కూలిపనులకీ మాత్రమే పనికొస్తారు తొక్క తెల్లన కాకపోతే,” అన్నాను నీరసించిపోతున్న హృదయంతో.

మరో పదడుగులు వేసి మలుపు తిరిగేం. సంద్రాలు ఠక్కున ఆగి వీధికి అటుపక్కన నడుస్తున్న అబ్బాయికి చెయ్యూపింది. నేనటు చూసి, “ఎవరది?” అన్నాను. అతను నావేపు చూసి చిన్నగా నవ్వేడు.

“మాదొరబాబు సిన్నకొడుకు. ఆ సొక్కా లాగూ సూసినవ?”

“ఏం? బాగానే ఉన్నాయి కదా.”

“ఈమజ్జనే మందేసంవెల్లి ఆర్నెల్లుండి తిరిగొచ్చినాడు. రెన్నెల్లయింది. ఆకాడ్నించి పెపంచకంవంతా దరిద్రంతో కొట్టకపోతన్నది. మనం - అదేలే ఇక్కడోల్లు - కొవ్వెక్కి సరుకంత దుబారా సేసేస్తన్రు అంటా నీతులు సెప్తా సెత్తకుండీల్లోనించీ ఏరుకున్ని గుడ్డలేరుకుని ఏస్క తిరగతన్నడు.”

“మరి మీదొరబాబు ఊరుకున్నాడా? ఆయనకి పరువు తక్కువ కాదూ?”

“ ఏటి సేస్తడాయన. నువ్విచ్చేది నాకక్కర్నేదు అంటాడీ బాబు.”

"ఈ జనాలందురు తెగ దుబారా సేసేస్తన్నరని ఈబాబు ఆగరం. ఈయన ఆ నొక్కొలాగూలేస్కుని సూపిత్తన్నడంట ఎంత నొమ్ము వుర్దగా పారేస్తన్నరో."

నాకు అందులో తర్కం కనిపించలేదు. నాకింకా నేను రోజూ చూసే తోపుడుబండి అమ్మాయి మనసులో మెదులుతోంది. అతను అవి ఏరుకోకపోతే, ఆ అమ్మాయి తీసుకుని ఆ పూట గడుపుకునేది కదా. ఆమాటే అన్నాను సంద్రాలుతో.

"అనాగ గూడ సేస్తర్లే. ఆలే ఏరుకొచ్చి మల్ల అవుసరంపైనోలకి పంచిపెడ్తరు."

"మరి ఆ యమ్మ అక్కడ్నుంచి తీసుకోవచ్చు కదా."

"ఆమెకి మననొప్పదంట. ఆలు తేరగ ఇచ్చినయి తీస్కుని నాను రోజంత ఏటి సెయ్యాల. నాకస్టం నాను పడి, తింటే నాకు తుర్పి అంటది."

నేను ఉలిక్కి పడ్డాను. అప్పటికి వారంరోజులుగా ఆలోచిస్తున్నాను, పాపం, నేను ఓ రెండు డాలర్లు ఆమెచేతిలో పెట్టొచ్చు కదా అని. అలా చేసుంటే ఏమయేది?

"ఇంకా నయం, నేను తెగించి డబ్బు ఇచ్చేను కాను," అనుకోకుండా బయటికే అనేసానామాట.

"ఏటీ?"

వివరించేను నా ఆలోచన.

"ఇవ్వనేకపోనావా?"

"ఇప్పుడు నువ్వంటున్నదదే కదా. ఇంతవరకూ నేను వెనకాడింది ఆవిడ తీసుకుంటుందో లేదో అన్న భయంచేత. ఒక రోజిస్తే రోజూ దానికోసం ఎదురు చూస్తుందేమోనన్న భయం. నేనిచ్చేనని మగతా బళ్ళవాళ్ళకి చెప్తే, వాళ్ళు నన్నింక బతకనివ్వరేమోనన్న భయం."

సంద్రాలు నావేపు కోపంగా చూసి విసురుగా తలెగరేసింది నిరసన తెలియజేస్తూ.

"ఏం? నిజమే కదా.  ముందొకసారి ఇలాగే ఏదో ధర్మసంస్థకి ఓ పది డాలర్లు పంపేను. అక్కడ్నించీ వాళ్ళే కాదు మరో పది సంస్థలు ఉత్తరాలమీద ఉత్తరాలు గుప్పించేరు. అలా పంచిపెట్టడానికి నాదగ్గరేంవుంది. ఒకమారు ఇస్తే, ఇంక చెప్పలేం మిగతావారు వాయించే వాయింపులు."

"అనాగే అనుకో. ఇయ్యాలనుంటే ఇయ్యి. నేకపోతే ఆ  ఊసెత్తమాక."

"ఆ మొదటి సంస్థ మిగతావారికి మనఎడ్రెసులు అమ్ముకుంటారని నాకు తెలీలేదు అప్పట్లో."

"ఇయన్నీ సాకులు."

000

ఆరాత్రి నాకు ఎంత ఆలోచించినా ఈ రెండు ప్రపంచాలనీ ఒకతాటిమీదకి ఎలా తీసుకురావాలో అర్థం కాలేదు. పెట్టుబడిదారీ సమాజానికి తగినట్టుగా పిల్లలని తయారు చేస్తున్నదొకరూ, పొట్ట పోసుకోడానికి చెత్తకుండీల్లో బతికే జీవులు కొందరూ.

సంద్రాలంది, "ఉప్పుడే ఏం జూసేవు. ఆమజ్జిన ఇన్నా పక్కూర్ల ఆ సెత్తకుండి ఇల్లోల్లు, సెత్తకంపెనీలు సేరి గోలెత్తేరంట. ఆ కుండీలు మా సొంతం, ఆ సెత్త మాసొంతం, సెత్త కంపెనీ ట్రక్కులొచ్చి ఆరి ట్రక్కుల్లోకెత్తుకున్నాక ఆరివనీ, మద్దెన ఎవరైన సెత్తకుండీలో సెయ్యెడితే అది అపసారం అని. జరిమాన కట్టుకో, సేదా జయిల్లో కూకో అంటరంట."

సంద్రాలు తనదారిన వెళ్ళిపోయింది. నేను ఇంటికొచ్చి ఆలోచనలో పడ్డాను. ఇంకా మాఊరికి వచ్చినట్టు లేదు ఆ సౌలభ్యం.

గబుక్కున లేచి, రెండోసారి వీధిలోకి బయల్దేరేను రెండు డాలర్లు జేబులో వేసుకుని. ఇది జరిగి మూడు వారాలయింది. నా చెత్తబండి స్నేహితురాలు మళ్ళీ కనిపించలేదు. కనిపించిందేమిటంటే చెత్తకుండీమూతనుండి వేలాడుతూ తాళం కప్పలు!



000

గమనిక - ఈ కథవెనక వాస్తవాలకి కింద ఇచ్చిన లింకులు చూడండి.

http://en.wikipedia.org/wiki/Homelessness_in_the_United_States
http://en.wikipedia.org/wiki/Freeganism
యూట్యూబులో homelessness మీద విడియోలు చూస్తే తల తిరిగిపోతుంది.

(మార్చి 12, 2015)

# 6. విల్లు రాసి చూడు

"నువ్వేలాగా ఇల్లు కట్టబోవడం లేదు. పిల్లలకి పెళ్లిళ్ళు నువ్వు చెయ్యక్కర్లేకుండానే అయిపోయాయి. వాళ్లే చేసేసుకున్నారు. అసలు నన్నడిగితే ఈ రోజుల్లో ఇల్లు కట్టడం, పెళ్ళి చెయ్యడం కూడా డబ్బు పారేస్తే అయిపోతాయి. నువ్వు కుర్చీలో కూర్చునో పక్కమీంచి దిగకుండానో లాప్టాపెక్కి అన్నీ అరణ్యమెంట్లూ చేసేవొచ్చు," అంటూ మొదలు పెట్టి స్నేహితుడు వాసు యాజులుగారికి లౌకికమైన మరియు ముఖ్యమైన విషయం ఊదర పెట్టేసేడు.

చావు అవాచ్యం. చావుగురించి మాటాడ్డం అమంగళం. అదే తన చావుగురించయితే మరీ కష్టం. ఇహ కొడుకులూ, కోడళ్ళూ, వాళ్ళ పిల్లలూ - వాళ్ళతో మాటాడడం భయంకరం. అంతకన్న నరకం మరోటి లేదు

అస్పష్టంగానో అవ్యక్తంగానో అట్టడుగు పొరల్లో అణిగిమణిగి ఉన్న వాస్తవాన్ని కెలికి వెలికి తీసేడు వాసు. యాజులుగారికి అదేమంత హత్తలేదు. నిరామయంగా పార్కులో ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తూ ఊరుకున్నారు.

వాసు మళ్ళీ అందుకున్నాడు, "వీలునామా అలా కాదు. పండిత పరమేశ్వరశాస్త్రిలా నీకేమీ తికమకలు లేవని నాకూ తెలుసు. తగూలేసుకోడానికి దాయాదులు – అమ్మవంకో అబ్బవంకో ఆకాశంనించి ఊడి పడబోరు అను. కిమ్మనకుండా నమ్ముతాను. కానీ నువ్వున్నది ఇక్కడ దేశం కాని దేశంలో. నీకు ఇక్కడి చిక్కులు తెలీవు. నాయనా, ఇక్కడ చావంటే మాటలు కాదు. ఆ బుర్రకి కొంచెం పని పెట్టు. నీకే తెలుస్తుంది. నీకు ఏమున్నా లేకున్నా శరీరం అంటూ ఒకటుందా? దాన్ని కాల్చాలా? పూడ్చాలా? అదీ ఇదీ కాకపోతే మరేదో గౌరవం దానికంటగట్టి, వివిధ ముక్కలు సద్వినియోగానికి పెట్టాలా? అలా చేసినా అక్కడితో అయిపోదు. ఆ మీదట కొరవ ముక్కల్ని ఏం చెయ్యాలి అన్నది కూడా పెద్ద ప్రశ్నే నువ్వు హరీమనగానే. సరేలే వీటిసంగతి తరవాత చూద్దాం అనకు. చావు మనచేతిలో లేదని ఏరోజు టీవీలో వార్తలు చూసినా తెలుస్తుంది కద. వీధిలోకి అడుగెడితే ఏ కారు నుండో ఊడిపడి చెల్లా చెదురుగా దర్శనమిచ్చే గాజు పెంకులూ ఉక్కు రేకులూ చెప్తాయి మన బతుక్కి నిజ వ్యాఖ్యానాలు."

అంతవరకూ కళ్ళప్పగించి వింటున్న యాజులుగారు ఠక్కున లేచి నిలబడ్డారు. "బాబూ, నీకో దణ్ణం. నావల్ల కాదు ఈ సొది భరించడం."

"సరే నామాట వినకు. మరో కథ చెప్తాను. ఇదే ఆఖరు. నువ్వు కాదంటే మళ్ళీ ఈ ఊసెత్తను. మన ఊళ్ళోనే పాతికేళ్ళక్రితం మాఅక్కయ్య పోయింది. ఒంటరి. బాగానే సంపాదించింది. కానీ ఎక్కడ ఏం ఉన్నాయో ఎవరికీ చెప్పలేదు. పైగా ఇదుగో ఇప్పుడు నాలాగే ఎవరైనా విల్లు రాయమని చెప్తే, అదేదో గొప్ప హాస్యం అయినట్టు విల్లు రాయమంటున్నారు, హాహా అంటూ నవ్వేసేది. ఆవిడగారు హాయిగానే పోయింది కానీ పోతూ పోతూ ఈ భూప్రపంచకంలో వదిలేసిన చిక్కులు నాసెత్తిన పడ్డాయి. ఎక్కడెక్కడ ఖాతాలున్నాయో, ఎవరికి అప్పులిచ్చిందో, ఎవరిదగ్గర తీసుకుందో, ఎక్కడ ఏంపేం పెట్టిబళ్ళు పెట్టిందో, ఏ బాంకుల్లో ఏ ఖాతాలున్నాయో, బంగారం ఎక్కడ దాచిందో అవన్నీ కనుక్కుని చిక్కులు విప్పి ఎలా పంపకాలు పెట్టాలో తేల్చుకోడానికి మూడున్నరేళ్లు పట్టింది నాకు. ఇప్పుడు కూడా రావలసినదంతా వచ్చిందన్న నమ్మకం లేదు."

"సర్లెద్దూ. నాకేముంది అంత ఆర్భాటం చెయ్యడానికి. నెలసరి వచ్చిన పింఛను గాజులబేరం భోజనానికే సరి," అన్నారు యాజులు గారు.

"అదే నేను చెప్తున్నది. మనూళ్ళలోనే ఉంటే బహుశా నీ ఖర్చులు పోగా నీ ఆదాయంలో మిగిలిందాంతోనో లేకపోతే తామే ఖర్చులు పెట్టుకునో నిన్ను తగలేసేస్తారు. అక్కడితో అన్ని ఋణాలూ తీరిపోతాయి, కథ అయిపోతుంది. ఈ దేశంలో అలా కాదు. ప్లీజ్, నామాట వినొద్దు. అదో కాలక్షేపం అనుకో. ఊరికే ఓ లాయరుని కలుసుకుని దాన్లో లుకలుకలు తెలుసుకుందాం," అన్నాడు వాసు వదలకుండా.

వాళ్ళిద్దరూ ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకుని ఒక పంచన పెరిగినవాళ్ళు కారు. కానీ ఈ దేశం వచ్చేక "మనవాళ్ళ మొహాలూ" మాటా కలిపి ఊసులాడుకునేవాళ్ళూ అంత తేలిగ్గా దొరకరు కనక, అంతటి స్నేహమూ కుదిరింది వారిద్దరిమధ్యా. అచిరకాలంలోనే నువ్వూ నువ్వూ అనుకోడం కూడా మొదలెట్టేరు. యాజులుగారి భార్య పోయేకే అమెరికాకి తరలివచ్చేరు కొడుకుల ప్రోద్బలంతో. వాసు ఆవిడని ఎరగడు కానీ మాటల్లో మాత్రం వదినగారనే.

ఆ పూట వాసుమూలంగా యాజులుగారికి శిష్టాచారములు చక్కగ పాటించు ఉత్కృష్టమైన అమెరికాదేశములో తన అశాశ్వత శరీరంగురించీ, దాన్ని అంతమొందించు విధానముగురించి ఆలోచించే మహదవకాశం లభించింది. ప్రస్తుతం ఇది సమాచారయుగం కనక సమాచారము సేకరించుట తన విధి అని నిశ్చయించుకున్నారు. అయితే ఈ చావుతో చచ్చే చావు అని లాయరుని కలిసినతరవాత కానీ తెలీలేదు.

మళ్ళీ వాసుదేవుని కాళ్ళు పట్టుకోలేదు కానీ అతనిమొహంతో, "పద, ఎవరో లాయరున్నారన్నావు కదా," అన్నారు. ఆయనకి తన కుమారులతో సంప్రదించడానికి మనసొప్పలేదు. చూస్తూ చూస్తూ

"నేను చచ్చిపోతే నువ్వేం చేస్తావో ఇప్పుడు అత్యవసరంగా చెప్పేసెయ్" అని ఎలా అడగడం? కొందరికి అదేం విడ్డూరం కాకపోవచ్చు. యాజులుగారికి మాత్రం నోరు రాలేదు. అంచేత వారు వాసుదేవుని శరణు జొచ్చిరి.

వాసు కళ్ళు చిట్లించి చిన్ముద్ర పట్టి రెండో పాఠం పెట్టేడు, "నాయనా, ఏదో నీదగ్గరున్న నాలుగు పరకలూ నీ ఇద్దరు పిల్లలకి సమంగా పంచిపెట్టేస్తానంటే అయిపోతుందనుకుంటున్నావు నువ్వు. లేదు తండ్రీ, అంత తేలికభాషలో చెప్తే ఈ న్యాయ ప్రభువులకు అర్థం కాదు. ఈ గవర్నమెంటోళ్ళు ఏ స్కూల్లో చదివేరో కానీ నువ్వూ నేనూ చదివిన బళ్ళో మాత్రం కాదని ఖచ్చితంగా చెప్పగలను. అసలు వాళ్లకి ఇంగ్లీషు రాదేమో అని కూడా నా అనుమానం. అంచేత వీలునామా అను పత్రం ఎలా మొదలవుతుందో సూక్ష్మంగా వివరిస్తాను, విను.

ముందు నీ గోత్రనామాలు చెప్పుకుంటావు. అదేలే ఇక్కడ గోత్రనామాలు అనరు. ఫలానావారి కొడుకు, కూతురు, భార్య ఇలా మొదలవుతుంది. ఆ ఫలానావారికి గల అస్తిత్వం ఏమిటో నాకర్థం కాదు. నువ్వు చింతామల వెంకటపండిత చొక్కరాయలు కుమారుడిని అంటావనుకో. మరి ఆ చింతామల వెంకటపండిత చొక్కరాయలు ఎవరో కోర్టువారి దివ్యసమ్ముఖానికి తెలిసేడుస్తుందేమిటి? ఏ కాలువపక్కనో కునుకు తీస్తున్న ఏ ముసలాయన్నో తెచ్చి ఈయనే చింతామల వెంకటపండిత చొక్కరాయలు అని నువ్వు చెప్తే వాళ్ళు ఒప్పేసుకుంటారు. మరో సంగతి - ఇక్కడ వీళ్లు పదే పదే వల్లించే ఓ సూక్తి ఉంది విసే ఉంటావు తగుసమయము, తగు స్థానము అని. అలాగే నువ్వు చచ్చేసమయానికి తగుస్థానంలో తగినవారు ఉంటే నీపని నీకు తగ్గట్టు అయిపోతుంది. లేదా, రెండు జరగడానికి అవకాశం ఉంది. నీదగ్గరున్న అణా పరకా ఎలా ఎవరికి చెందాలో నిర్ణయించి అలా నిర్ణయించినందుకు ఖర్చులపేరుతో తినేస్తారు ప్రభేటు కోర్టువారు. నీపిల్లలకి మిగిలేది కాయితపుముక్క మాత్రమే. లేదా ఏ లాయరో నీకేసు అదేలే నీకొడుకులకేసు చేపట్టి, తగువు నీకు సుముఖంగా తీర్పు ఇప్పించేస్తారు. సందేహం లేదు. కానీ ఆ తరవాత ఆ తీర్పు అలా నీకు అనుకూలంగా ఇప్పించినందుకుగాను ఖర్చులంటూ వారు మింగేస్తారు. మళ్ళీ నీపుత్రులకు మిగిలేది గెలిచేం అని చెప్పుకు తిరగడానికి పనికొచ్చే కాయితమ్ముక్క మాత్రమే."

యాజులుగారు చిన్న కునుకు తీసి, కళ్ళు తెరిచి, "సరే," అన్నారు. ఆయన ఎంత విన్నారో వాసు పట్టించుకోలేదు. తనకి తెలిసినదంతా చెప్పేసేనన్న ఆనందంలో ఉబ్బి తబ్బిబ్బయి పోతున్నాడాయన. మొత్తమ్మీద యాజులుగారు వీలునామా రాయించడానికి సన్నిద్ధులయేరు. వాసు తనకి తెలిసిన లాయరుతో మాటాడి సుముహూర్తం నిర్ణయించేరు. వచ్చే మంగళవారం ఉదయం పదిన్నర దివ్యంగా

ఉందిట. లాయరు  ఆఫీసు కూడా యాజులుగారింటికి అట్టే దూరం కాదు. వాసు వచ్చి ఆయన్ని తీసుకెళ్ళడానికి నిశ్చయమయింది.

సదరు మంగళవారం ఇద్దరూ లాయరుగారి ఆఫీసు చేరుకున్నారు ఖచ్చితంగా అనుకున్న సమయానికి.

శాస్త్రప్రకారం కుశలప్రశ్నలయేక, లాయరు అసలు విషయం ప్రారంభించేడు.

లాయరు, "ముందు కొన్ని సాధారణ ప్రశ్నలు అడుగుతాను."

యాజులు, "అలా కాదు. ముందు నేను ఉన్నసంగతి చెప్పేస్తాను."

లా - "సరే. చెప్పండి."

యా – "నాకేమీ లక్షలూ కోట్లూ ఆస్తుల్లేవు. ఉన్న నాలుగు డబ్బులూ ఒకే బాంకులో ఒకే ఖాతాలో ఉన్నాయి. అప్పులు అస్సలు లేవు. ఆ కాస్త సొమ్మూ ఇద్దరు కొడుకులకీ చెరి సగం అని రాసేయండి. అంతే. అదే నా విల్లు."

లాయరు అంతా విని, "నేను కొన్ని సాధారణ ప్రశ్నలు అడుగుతాను," అని మొదలు పెట్టేడు. వాసు నెమ్మదిగా, "వాళ్ళపద్ధతిలో మాత్రమే వాళ్లు పని చేయగలరు. అది వాళ్ళ సిద్ధాంతం. నువ్వు ఏం చెప్పినా లెఖ్ఖ లేదు. వాళ్ళ ప్రశ్నలకి జవాబులు చెప్పేస్తే సరిపోతుంది," అన్నాడు.

యాజులు తలూపేరు.

"నీకు ఎన్ని ఖాతాలు ఎన్ని బాంకుల్లో ఉన్నాయి?"

"ఎన్ని అప్పులు? ఎక్కడెక్కడ? ఎంత అప్పు?"

"ఇతర చరాస్తులు – బంగారం, వెండిసామాను, కార్లు, పురానాణెములు, స్టాంపులలాటివి?"

"జీవితభీమా ఏ కంపెనీ, ఎంతకి?"

యాజులుగారు అనన్యసామాన్యమైన ఓపికతో జవాబులు చెప్పి తన విధి నిర్వర్తించేరు.

తొలి వరుస ప్రశ్నోత్తరాలు తయారయేయి. నిజానికి అంతా ఒకే వాక్యం. ఒకే బాంకులో ఖాతా. ఆయనున్న కాండో పెద్దవాడు పెట్టుబడికింద కొన్నాడు కనక అది వాడిదే. చిన్నవాడికి కార్ల సరదా. రెండేళ్ళకోమారు కొత్త కారు కొంటాడు. అలా తన ముందటి కారు తండ్రికి ఇచ్చేడు. అంచేత ఆ కారు వాడిదే. మరేం లేవు ఆస్తిపాస్తులని చెప్పుకోడానికి.

"సరే. ఇప్పుడు చెప్పు. నీవారసులెవరు?"

"ఇద్దరు కొడుకులు. అంతా వారికి చెరి సగం సమానంగా చెందుతుంది."

అంతవరకూ ఫరవాలేదనే అనిపించిందాయనకి. కానీ ఆ తరవాత లాయరు వేసిన ప్రశ్నలు యాజులుగారిని విపరీతంగా కలిచివేసినవి.

మా పాఠకులకు ఇదే హెచ్చరిక దయతో గమనించవలసిందిగా కోరుతున్నాను. ఇంతకు మున్ను చెప్పిన సాధారణప్రశ్నలు అయినతరవాత జరిగిన సంభాషణ సున్నితమనస్కులకు తగినది కాకపోవచ్చు. మీకు ఇతోధికమైన బాధ కలుగుటకు అవకాశము కలదని మేము నమ్ముచున్నాము.
నిజానికి లాయరుగారు తమ బిజినెస్ 101లో నేర్చుకున్న విద్యనంతా ఉపయోగించి, ఎంతో మృదువుగా చావన్నమాట నోట పలకకుండా, పంచదారపూతలతో వాక్యాలను అష్టవంకరలూ తిప్పుతూ అనేక డొంకలు తిరుగుతూ సాగించేరు. కానీ యాజులుగారిమాటలలో చెప్పమంటే ఆ సంభాషణ వారి మాటలలో ఎలా ఉంటుందో ఇక్కడ ఇస్తున్నాను. నిజంగా జరిగే సంభాషణకీ జవాబులు ఇచ్చుకునేవారికి ఆ సంభాషణ ఎలా మనసులో నాటుకుంటుందో తెల్లమయేది ఆయనమాటల్లోనే చెప్తేనే. అదీ ఈ హెచ్చరిక సారాంశం!
ఆ ప్రశ్నోత్తరములు యాజులుగారి మాటలలో ఇలా సాగేయి:
"నీ వీలునామా executor ఎవరు?"
"హాఁ?"
"అదేనయ్యా నువ్వు చచ్చేక ఎవరు దిక్కని?"
"కొడుకులే కదా?"
"ఇద్దరియితే వాడోమాటా వీడో మాట అవొచ్చు. ఒక పేరు చెప్పు."
"సరే. పెద్దవాడిపేరు రాసుకో."
"పెద్దవాడు. మరి ఆ పెద్దవాడు చస్తే?"
"చిన్నవాడు."
"పెద్దవాడిసొమ్ము ఎవడికి దక్కుతుంది?"
"వాడి పెళ్ళానికే కదా."
"ఆవిడ చస్తే?"
"పిల్లలకి చెందదూ, మళ్ళీ అడగాలా?"
"వాళ్ళు చస్తే?"
"చిన్నవాడు అంతా చూసుకుంటాడు."
"పెద్ద కోడలు ఆస్తి తనదని పేచీ పెట్టొచ్చు. మరో పెళ్లి చేసుకోవచ్చు"
"ఆవిడ అలాటి మనిషి కాదు."
"వారిద్దరిమధ్య ఆ ఏర్పాటు ఉందా?"
"ఉందనే అనుకుంటున్నాను."

"చిన్నవాడు చస్తే?"

"చిన్న కోడలు చూసుకుంటుంది."

"చిన్నకోడలు చస్తే?"

"నా ఇద్దరు కొడుకులు, ఇద్దరు కోడళ్ళు, ఎంతమందో తెలీదు కానీ ప్రస్తుతానికి ముగ్గురు మనవలూ, ఇంకా ఉంటే మునిమనవలూ ... అంతా గాలివానకి తుడిచిపెట్టుకు పోయినట్టు ఒఖ్ఖమారే లేదా వరసక్రమంలో ఒకరి తరవాత ఒకరు చస్తే ఆ పైన నేను కాదు నా డబ్బేం అవుతుందని మీ ప్రశ్న. అలా మొత్తం నాకుటుంబం సర్వనాశనం అయేక నేనింకా బతికుంటాననేనా?"

"నువ్వచ్చుకున్న వెయ్యి డాలర్లకి నీకు ఇదంతా చెప్పడం నావిధి. నీకు పరిపూర్ణంగా తృప్తినిచ్చేలా నేను వివరాలు ఇస్తున్నాను. నువ్వూ నీవాళ్ళూ అందరూ చచ్చేక, నీ ఆస్తి ఏమవుతుందో చెప్పకపోతే, గవుర్నమెంటువారికి పోతుంది."

"ఈ మారణహోమం ముగిసేక ఇంకెవరున్నారు నాసొమ్ము తినడానికి?"

"సాదారణంగా ఏ సాంఘికసేవా సంస్థకో రాసిస్తారు."

"ఆ సంస్థ మాత్రం ఎల్లకాలం ఉంటుందనేముంది? సంస్థ యజమానులు తినేయొచ్చు. అది దివాలా తీయొచ్చు. అప్పుడేమవుతుంది?"

"సంస్థ అప్పులాళ్ళకి పోతుంది మీ ఆస్తితో సహా."

"ఇంత బతుకూ బతికి ఇంటెనక చచ్చినట్టు ఏ దగుల్బాజీ అప్పులో తీర్చడానికా ఈ తాపత్రయం అంతా?"

"సిస్టములు అలాగే పని చేస్తాయి," అన్నాడు లాయరు నిరామయంగా.

"ఇంతమంది చచ్చేక నేనింకా ఉంటాననే అనుకోండి. ఈ నిర్ణయాలేవో అప్పుడే నేను చేసుకోవచ్చు కదా."

"అవును. ఇప్పుడు మరో ప్రశ్న. నువ్వు నిర్ణయించుకోగల స్థితిలో ఉంటావనేముంది? చావూ బతుకూ కాని దిక్కుమాలిన స్థితిలో మంచంలో పడి నెలలతరబడి ఉండిపోవచ్చు. ఆమాటకొస్తే సంవత్సరాలతరబడి కూడా అలా కుళ్లి కృశించిపోయినవాళ్ళున్నారు."

"?"

"అలా జరుగుతుందని కాదు. ఇదంతా ముందుచూపు. బతుకు ఎంత నికృష్టమో, నువ్వు ఎలాటి దురవస్థపాలు కావడానికి అవకాశం ఉందో వాటన్నిటికీ సమాధానాలు సిద్ధపరచి ఉంచాలి. అది విడమర్చి చెప్పడం నా విధి."

"నేను మంచంలో ఉండి నిర్ణయాలు చేయకూడదా?"

"నిర్ణయం చేయగల మతిస్తిమితం ఉంటుందనే అశిస్తాం. ఒకొకప్పుడు కోమాలోనో, మతి మాలిన స్థితిలోనో నెలలూ, సంవత్సరాలూ కూడా ఉండడం జరుగుతుంది. నువ్వు Health Directive సిద్ధం చేసి ఉంచడం నీకే మంచిది."

మరో నాలుగు కాయితాలు తీసేడు లాయరు. మళ్ళీ పైన చెప్పిన పేర్లే మరోమారు అదే వరసలో చెప్పబడ్డాయి. ఆ క్షణంలో తన కొడుకులకి రామా, కృష్ణా అని పేర్లు పెట్టనందుకు యాజులు రవంత విచారించేరు.

మరో వరస ప్రశ్నలు -

"నీ శవాన్ని సంపూర్ణంగా రూపు మాపడం ఎలా?"

"కొడుకులే ఆ సమయానికి వాళ్లకి సుగమం అయినమార్గంలో కానిచ్చేయమని రాయి. నాకు ఏ విధమైన అభ్యంతరాలూ లేవు."

"మీకు ఏది ఇష్టం?"

"అయ్యా! లాయరుగారూ, నాప్రాణం పోయినతరవాత ఈ శరీరం నాది కాదు. నేనే నిత్యం కాదు. శరీరం ఏమవుతుంది అని నేను విచారించాలా?"

"నువ్వు ఇప్పుడు స్పష్టంగా చెప్తే వారికి తేలిక అవుతుంది. ఇద్దరున్నారు కదా. ఇద్దరికీ చెరో ఆలోచనా రావొచ్చు. దాంతో తగువు."

"సరే. ఊళ్లో ఆస్పత్రికి ఇచ్చేయమని చెప్పండి."

"మళ్లీ వాళ్ళు నీ కాయాన్ని వినియోగించే విధానం నాలుగు ఉన్నాయి. 1. క్లాసులో పాఠాలకి 2. పరిశోధన 3 అవరసరమైనభాగాలు అవసరమైనవారికి దానం 4. "

"అవసరమైన భాగాలు అవసరమైనవారికి ఇవ్వమని రాయి."

"ఆ భాగాలు తొలగించిన తరవాత మిగతా భాగాలు ఏం చెయ్యమంటారు?"

"కూరొండుకోమను. లేదా పులుసులో ముక్కలు చేసుకోమను" అన్నారు వాసుతో తెలుగులో.

ఆయన వాసుని సలహా అడుగుతున్నారనుకున్నాడు లాయరు. వాసుతో "అది తప్పనిసరిగా చెప్పాలని కాదు. కానీ ఇప్పుడు అంతా పకడ్బందీగా రాసేస్తే ఆ తరవాత executor కి శ్రమ తప్పుతుంది."

ఎందుకొచ్చిన గోల అడుగడుక్కీ అవరోధం అనుకుని, "కాల్చీమను" అన్నారు యాజులుగారు.

ఆ క్షణంలో ఆయన వీలు రాయించడానికి కొడుకులని తీసుకురానందుకు మనసులోనే సంతోషించేరు.

లాయరు ఆ మాట రాసుకుని, తలెత్తి తనపని సక్రమంగా నిర్వర్తించిన ఆనందంతో, "అంతా అయిపోయినట్టే. మరో రెండు చిన్న విషయాలున్నాయి," అన్నాడు.
"ఇంకా ఏమున్నాయి?"
"ఇల్లు, కారు, ఇంకా ఏవైనా విలువైన వస్తువులు ఉంటే ఎవరికి ఏమి ఇస్తారో చెప్పండి."
"చెప్పేను కదా. ఇల్లు పెద్దవాడిది, కారు చిన్నవాడిది అని."
"నగా, నట్రా వదినగారివి తెచ్చేసుకున్నానన్నావు కదా," అన్నాడు వాసు స్వరం తగ్గించి.
యాజులుగారు ఇబ్బందిగా మొహం పెట్టేరు. నిజమే. ఇల్లాలు పోయేక, ఆవిడ నగలు తనదగ్గరే ఉంచుకున్నారు. వాటికి తనమనసులో ఉన్న విలువ ఇంకెవరికీ అర్థం కాదు చెప్పినా కూడా. లాయరుతో మాత్రం ఏమీ లేవని చెప్పేసేడు.
"Conservator గా ఎవర్ని నిర్ణయిస్తారు?"
"మళ్ళీ అదేమిటి? కొడుకులూ, వాళ్ళ పెళ్ళాలు, వాళ్ల పిల్లలు ... ఇంతమంది ఉండగా."
"ఏదైనా తగువొస్తే, తీర్చడానికి."
"ఎలాటి తగువులొస్తాయి?"
"ఇప్పుడు చెప్పలేం. ఎలాటివైనా రావొచ్చు."
వాసుకి తనపేరు చెప్పొచ్చు కదా అని ఉంది కానీ నాపేరు పెట్టు అని చెప్పడానికి నోరు రాలేదు.
"ఫ్లోరిడాలోనో ఎక్కడో మీ చినతాతగారి మూడో అల్లుడి తమ్ముడు ఉన్నాడన్నావు కదా?"
"బతికుండగా మాటా మంతీ లేదు చచ్చేక వస్తాడా?," అని వాసుకి చెప్పి, "నిజంగా తగువంటూ వస్తే ఆవేళకి ఎలాటి తగువో దాన్ని బట్టి ఎవరో తగిన లాయరుని వాళ్లే చూసుకుంటారులెండి," అన్నారు లాయరుతో.
అక్కడికి ఆ తగువులు ముగిసేయి. ముగిసేయి అని యాజులుగారు అనుకున్నారు.
లాయరు గారు నిటారుగా సర్దుకుని కూర్చుని, "దాదాపు అంతా అయిపోయినట్టే" అన్నాడు మూడో మారు.
"అంటే ఇంకా ఏవో ధర్మవిధులు ఉన్నాయనా?"
"ట్రస్టు కూడా సిద్ధం చేసేస్తే అయిపోతుంది."
"ఇంతసేపూ చెప్పిందేమిటి. అంత ట్రస్టు సృష్టించేంత ఆస్తులేం లేవంటున్నాను కదా."
"ఇక్కడ లక్షకి మించి బాంకులో ఉంటే, పన్నులు ఎక్కువ కట్టుకోవలసివస్తుంది వారసులు."
"లక్షెక్కడుంది. లేదు లెండి."

"ఇప్పుడు లేకపోవచ్చు కానీ ఏ స్టాకుల్లోనో పెడితే పెరుగుతుంది కదా. అంతే కాదు. ఇవాళ మన స్టేటు లక్ష అంటున్నారు. ఆ రూలు అలాగే ఉంటుందనేముంది? రేపు యాభైయే అనొచ్చు."

యాజులుగారికి కళ్ళనీళ్ళపర్యంతమయింది. "కనీసం ఈ బాధలు తప్పించుకోడానికైనా నేను చావకుండా ఉండాలేమో," అన్నారు మిత్రుడితో.

"అంతే మరి. ఈ ప్రభుత్వాలు బతకడానికి దారి చూపవు కానీ చస్తే లక్ష ఆంక్షలు. ఆత్మహత్య నేరం అని పట్టుకు జైల్లో పడేసినట్టు. అక్కడ జైల్లో మరోవిధంగా చస్తే ఏమీ చెయ్యలేరు."

పాఠకులారా, ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది. ఇంక కథ సాగించలేను. కానీ ఒక్కమాటలో ట్రస్టీగా ఎవరిని నియమించాలి అని మొదలు పెట్టి పైన చెప్పిన వరసలోనే ఆ పేర్లే మరోమారు చదివి అయిందనిపించేరు.

లాయరు ఆపీసునించి బయటికి వచ్చేక, వాసు, "భోజనంవేళ దాటిపోయింది. ఇక్కడ తినేసి పోదామా?" అని అడిగేడు.

యాజులు నీరసంగా తల అడ్డంగా ఊపుతూ, "నేనిప్పుడేం తినలేను. ఇంటికి పోదాం పద," అన్నారు.

ఇంటిముందు కారాగేక, ఆయన వాసుకి ధన్యవాదాలు చెప్పి కారు దిగేరు. వాసు అః ఏముంది ధన్యవాదాలకి అని తేలిగ్గా అనేసి వెళ్ళిపోయేడు.

యాజులుగారు మెట్లమీద నిలబడి అట్టే వాసు కనుమరుగయేవరకూ చూసేరు. మ్. ఈ వాసు కలలో కూడా ఊహించని ఒక పని తనచేత చేయించేడు. తనజీవితంలోకి ఇతను ఇందుకే వచ్చేడా? ఎంతమంది తన జీవితంలో వచ్చి పోయేరో తలుచుకుంటూ తలుపు తీసుకుని ఇంట్లోకి అడుగు పెట్టేరు.

హఠాత్తుగా జేబు ఖాళీ అయిపోయినట్టుంది, మొత్తం శరీరమే తేలికగా దూదిపింజెలా అనిపిస్తోంది. "బుల్లిపాపాయి ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయేడు". అసలు తాను పోగు చేసిన వస్తువుసంచయం అట్టే లేనే లేదు. ఉన్న నాలుగు వస్తువులు కూడా తనవి కానట్టు ఉంది. గది కలయజూస్తుంటే ఎదుట అల్మైరాలో పాతికేళ్లక్రితం తనకి చిన్నతాతగారిచ్చిన పుస్తకం కనిపించింది. నెమ్మదిగా లేచి వెళ్ళి, పుస్తకం చేతిలోకి తీసుకుని, దుమ్ము దులిపి తెరిచేరు.

అథ! ...

000

(అథ పదానికి వివరణ - పతంజలి యోగసూత్రాలలో మొదటి సూత్రం "అథ యోగానుశాసనమ్". అందులో మొదటి పదం "అథ". ఆ పదానికి పండితులు ఇచ్చిన వ్యాఖ్యానం ఏమిటంటే

గృహస్థధర్మాలు నిర్వర్తించిన తరవాత మనిషి యోగసాధనగురించిన ఆలోచనతో యోగ్యుడయిన గురువుని ఆశ్రయించినప్పుడు, "ఇప్పుడు యోగసాధన మొదలు" అని.)

(సెప్టెంబరు 8, 2015)

# 7. విల్లు రాసీసేక ఇహ పండుగే!

"ఊర్ల అందుర్కి బుద్ధి సెప్తవు, నివ్వెందకు రాయవూ?" అంది సంద్రాలు చిరాగ్గా.

"రాస్తాను."

"పదవుతే. ఏటాలీసం?"

"ఆలస్యం అదేదో అశుభం అని కాదు."

"మరేటవుతె?"

"ఇప్పటికే మూడు రాసేను కదా. అంచేత ఈమారు రాసింది ఆఖరిది కావాలి. ఇహ మరే మార్పులూ ఉండవు నాజీవితంలో అని గట్టిగా నమ్మకం కుదిరేక రాసేద్దాం అని ఆగేను."

"బాగున్నాది. మారుపులు సెప్పొస్తాయేటి. ఒప్పటికప్పుడె అదె నిజం. నాకస్లు ఇదె ఆకరనిపిస్తన్నాది," అంది సంద్రాలు.

నేను సుదీర్ఘంగా నిట్టూర్చేను. అంతే మరి. ఎప్పుడనుకున్నాను నాబతుకు ఇన్ని సుళ్లు తిరుగుతుందని. స్థితిగతులు మారిన ప్రతి మారూ అయిపోయిందనే అనుకున్నాను. ఇప్పటికి మూడయేయి. అక్కయ్య పోయేక వీలునామా లేనందున అన్నయ్య పడ్డ అవస్థలన్నీ తలుచుకుని తొలిసారి రాసీసేను. ఆ తరవాత ఇల్లు కొన్నప్పుడు, మళ్ళీ ఆ యిల్లమ్ముకున్నాక, ఊరు మారినప్పుడు ఇలా రాస్తూనే ఉన్నాను ఓనమాలనాడు ఒరవడి దిద్దుకున్నట్టే. తుడుపులూ, కొట్టివేతలూ, తిరిగి రాయడాలూ ... బతుకంతా ఇలా పునః పునః రాస్తూనే ఉన్నాను. మ్. ప్చ్. హుంమ్ ... ఊ ...

"ఏటాలోసిస్తన్నవ్?"

"ఏం లేదులే పద," అన్నాను.

అవును మరి. రాయి రాయంటూ అయినవాళ్ళనీ కానివాళ్ళనీ అందర్నీ పోరి పోరి, ఇప్పుడు నావంతు వచ్చేసరికి చూదాం చూదాం అంటూ వాయిదాలెయ్యడం ఏం న్యాయం!

నావిల్లు రాసి రాగల సమస్యలన్నీ ఓ కొలిక్కి తీసుకురాగల వీలునామా విజ్ఞాని తేలిగ్గానే దొరికేడు.

ఇద్దరం అనుకున్నరోజున వారి ఆఫీసుకి వెళ్లేం.

వెనకటికథలో విల్లు రాసినప్పుడు ఎదురయే ప్రశ్నలన్నీ రాసేను కనక మళ్ళీ అవన్నీ ఇక్కడ ఏకరువు పెట్టను కానీ మీ వినోదార్థం కొన్ని కబుర్లు మాత్రం చెప్తాను.

"ఎవరెవరికి ఏమేం ఇవ్వాలో ఏ రూపంలో ఇవ్వాలో చెప్పు."

ఒక్క క్షణం ఆలోచించి అన్నాను, "అంత పంపకాలకి నాకేమీ దివాణాలూ, సంస్థానాలూ లేవు. ఉన్నదేదో ఈమెకే," అన్నాను సంధ్రాలివేపు చూసి.

"అంతానా?"

"చెప్పేను కదా నాలుగు డబ్బులు బాంకులో తప్పిస్తే మరేం లేవు."

"కొందరు కొంత సొమ్ము ధర్మసంస్థలకి కేటాయిస్తారు."

"రాయక్కర్లేదు. నేనూ ఆవిడా వేరే మాటాడుకుంటాంలెండి ఆవిషయాలు."

సంధ్రాలు నావేపు చూసి, "అయేయో సైటులున్నాయి గద. అయన్నీ సూట్టం నాకు తెల్దు." అంది.

"లేవులే. వాటిమాట ఇప్పుడొద్దు. తరవాతిసంగతి చెప్పండి," అన్నాను.

"సైటులకి విలువుంది తెలుసా?" అన్నాడు విజ్ఞాని.

"ఇవి అలాటివి కాదులెండి. ఇవి అణాపైసల్లో లెక్క లేనివి."

"మీకు తెలీదు. సైటుపేరు చెప్పండి. విలువ చెప్తాను."

"అవసరంలేదు. తరవాతి ప్రశ్న చెప్పండి."

"అడగ్తన్నరు సెప్పరాదా అయేటో," అంది సంధ్రాలు కసుర్తున్నట్టు.

నాక్కూడా చిరుకోపం వచ్చింది. "చెప్తున్నా కదా. డాలరు పణం పెట్టి వేలం వేస్తే డైముకి చెల్లవు అవి. అయినా నీకెందుకు? నీకెలాగా వాటిమీద ఆశ లేదు," అన్నాను విసురుగా.

సంధ్రాలు మొహం ముడుచుకుంది. "ఆశుందన్నేదు. నీకే గద అదంత గొప్ప."

"మీకు తెలీదు ..." అంటూ మళ్ళీ లాయరెత్తుకున్నాడు కానీ నేను సాగనివ్వలేదు.

"నీకు చెప్పలేదు. నీకవి నడిపే ఓపికా లేదు, చేతా కాదు కదా అని వేరేవాళ్ళకి తరలించేసేను," అని వీ.విజ్ఞానివేపు తిరిగి, "పదండి పైవిషయానికి," అన్నాను గుండెలు చిక్కబట్టుకుని.

భౌతికకాయాన్ని మన్ను చేయడమా, మసి చేయడమా? అదీ ఇదీ కాదు, తరిగి ముక్కలు పంచిపెట్టడమా? అనిట.

ఆ అంశంమీద మళ్ళీ మరో పాఠం మొదలు. వింటుంటే అది నాగురించి కాక మరేదో వస్తువుగురించిలా ఉంది. "నేను నేను కాద"న్నసంగతి కొట్టొచ్చినట్టు కనిపించింది. నా దేహం గాజుపెట్టెలో వస్తువులా కనిపిస్తోంది. మరి ఈ దేహము నాది కానప్పుడు ప్రాణం పోయేక అది ఏమవుతుందో అని విచారించడం మాత్రం ఎందుకూ. అందులో వైరుధ్యం కూడా కనిపిస్తోంది. నాది కాని దేహం ఏమి చేయాలో, ఆవిషయంలో నా అభీష్టం ఏమిటో ఇప్పుడు నేను నిర్ణయించాలంటే నవ్వు రాదూ ఎవరికైనా?

"నవుతావేటి ఆరు అడ్గతంటే. సెప్పు," అంది సంద్రాలు. చూడగా చూడగా సంద్రాలు నామీదా నాశరీరంమీదా ఆధిపత్యం తీసేసుకున్నట్టనిపిస్తోంది. ఆ అధికారం నేనే ఇచ్చేసేమో.

మొత్తంమీద తంతు ముగిసేక, దక్షిణ సమర్పించుకునే సమయం వచ్చింది.

ఆయన చెప్పిన అంకె విని ఉలికిపడ్డాను కానీ పైకి కనిపించకుండా జాగ్రత్త పడ్డాను. పడ్డాననే అనుకున్నాను కానీ ఆయన విజ్ఞాని కదా. మీకు తెలీకపోవచ్చు కానీ లా విజ్ఞానులు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగలరు.

చిన్న దగ్గు దగ్గి, క్షమించమని చెప్పి పక్కగదిలోకి వెళ్ళేడు నీళ్ళకోసం అన్నట్టు. అది నాకు ఆలోచించుకోడానికి టైము ఇవ్వడం నాకు తెలుసు. ఇలాటి ఎత్తులు చాలానే చూసేను.

"ఏటాలోసిస్తన్నవ్," అంది సంద్రాలు.

సూక్ష్మంగా నాకథ ఇది. నేను ఇప్పటికే చాలా వీలునామాలు రాసి పారేసేనని చెప్పేను కదా. విల్లులు రాయడం నాకు మంచినీళ్ళప్రాయం. మొదటిసారి పాతికేళ్ళక్రితం రాసినప్పుడు ప్రముఖ విల్లెండు ఎస్టేటు ప్లానింగు విజ్ఞానినే సంప్రదించేను. అప్పట్లో మూడొందలయింది. ఆ తరవాత నాకున్న ఆస్తిపాస్తులకి అదేం అవసరం లేదని అర్థమయింది. అంతర్జాలంలో ఫారములు తీసుకుని, సూక్ష్మంగా నా సొమ్మంతా ఫలానావారికి అని ఓ ముక్క గిలికి, ఇద్దరిచేత సాక్షి సంతకాలు పెట్టిస్తే పని అయిపోతుంది. ఆ తరవాత మరో రాష్ట్రానికి మారినప్పుడు, ఈ స్టేటులో ఎస్టేటు నిబంధనలలో కొన్ని తికమకలున్నాయని తెలిసింది. వేరు చెప్పనేల అంతర్జాలం మూలంగానే. అది నమ్మి మరో న్యాయపురుషుని శరణు జొచ్చేను. ఈసరికి ఖర్చు మూడునించి ఏడయింది. ఇలా ఆదాయం పెరగకపోయినా, ఖర్చు పెరుగుతూ వస్తోంది. ఇలా మరో నాలుగు విల్లులు రాసేనంటే, ఇంక వారసులకి పంచిపెట్టడానికి ఏమీ మిగలకపోవచ్చు, హా హా.

"నిన్నే," అంటూ మళ్ళీ రొకాయించింది సంద్రాలు.

ఈ పరిస్థితికి మరో కోణం – మామూలుగా నాకు తక్కువఖర్చుతో అయిపోయేదానికి ఎక్కువ పెట్టడం ఇష్టం ఉండదు. కారణాలు కూడా చెప్తాను. ఉదాహరణకి కంప్యూటరు కొనాలని వెళ్తాననుకోండి. ఎంత చెట్టుకంత గాలిలాగే ఆ కంప్యూటరుధరకీ దాని బలాబలాలకీ అనులోమ సంబంధం ఉంది. ఎక్కువ పెడితే ఎక్కువ విశేషాలుంటాయి spreadsheet, presentations, faster లాటివి. నాకు అవి అక్ఖర్లేకపోతే, నేనిచ్చుకున్న అధిక సొమ్ము వృథా. రెండోది, ఎక్కువ ధర పెట్టి కొన్న వస్తువులు ఎక్కువ కాలం మన్నుతాయన్న హామీ లేదు. ఇది స్వానుభవంతోనే చెప్తున్నాను. అంచేత చవకలో కొంటే అది పనికిరాకుండా పోయినప్పుడు, పారవేయు సమయం వచ్చినప్పుడు "అంత సొమ్ము పోసి కొన్నానే," అన్న బాధ ఉండదు. అది పారేసి కొత్తది, మరో చవకది తేలిగ్గా కొనుక్కోవచ్చు.

విజ్ఞాని మంచినీళ్ళ సీసాతో వచ్చేడు. అంతా నటనే.

"కానిచ్చీ. ఉప్పుడు నివ్వు రెండు డబ్బులు ఏసాయని ఇసారిస్తె ఆ యెనక నాను కోరట్లసుట్టు తిరగనేక సవ్వాల."

నేను సంధ్రాలువేపు పరీక్షగా చూసేను.

"ఆమె నొమ్ము కదా," అన్నాడు వి.వి.

హమ్మ ఎంత ఆలోచన! మొత్తమ్మీద జ్ఞాని అనిపించుకున్నాడు. నిజమే, సంధ్రాలుకి లేని బాధ నాకెందుకు?

సరే కానిమ్మని తలూపేను. మరో గంట తరవాత బయట పడ్డాం హమ్మయ్య అనుకుంటూ.

అక్కడ్నించీ వీధిలోకి వెళ్ళినప్పుడల్లా, ఈ దేహము నాది కాదు అనే కాక దారిన పోయేవారిలో ఎవరు ఏ భాగానికి సరిపోతారో ఆలోచిస్తూ కూడా వస్తున్నానిప్పుడు.

ఇంతలో పండుగరోజులొచ్చేయి. పండుగ అమ్మకాలహోరు మొదలయింది. నా కెమెరా విరిగిపోయింది కదా ఒకటి చూదాం అని బయల్దేరేను.

ఓ దుకాణంలో ధరలు చూస్తున్నాను. చీకటిలో కూడా బొమ్మ తీయగలిగితే చుక్కల్నీ చందమామనీ కూడా పట్టొచ్చు. Action underwater photography అక్కర్లేదు. నవ్వు మొహం గుర్తించేది కొంతవరకూ ఉపయోగపడొచ్చు. మైక్రో కూడా అంతే. ముద్దుగా ఎర్రగా నిగనిగలాడుతూ అరచేతిలో గువ్వపిట్టలా అమరిపోయే కెమెరావేపు చూస్తూ ఆలోచిస్తున్నాను. మూడు వందలదాకా అవుతుంది టాక్సులూ అవీ కలుపుకుని.

"ఉప్పడదెంత ఎట్టి ఎందుకూ?" అంది సంధ్రాలు వెనకనించి.

"ఎంతేమిటి? అసలు కెమెరాకి 300 అంటే లెక్కలోకి రాదు. మూడు వేలెట్టి కొనేవాళ్ళు ఎంతమందో తెలుసా?"

"ఆలంతా దేసాలు తిర్గతరు. పెల్లిల్లు, పెరంటాలు, కుటుంబంవూ అయాని. నీకేటున్నది?"

ఆమాట నిజమే కానీ సంధ్రాలు అలా అంటుంటే వినడానికి బాగులేదు. "మొన్న నిండుపున్నమినాడు చందురుని చూస్తే ఎంత బాదేసిందో తెలుసా బొమ్మ తీయలేకపోయినందుకు," అన్నాను ఆనాటి విచారం మళ్ళీ మొహంలోకి తెచ్చుకుని.

"అద్సరె. బొమ్మ తీస్తవు. తరవాతేటి సేస్తవు అంటన్న. తెరమీదికెక్కిస్తవు. పదిమందో ముప్పైమందో సాన బావున్నాదంటరు. ఆపూటయినంక ఏంవుంది? కతయిపోతది."

"ఏమిటంటావయితే. ఆమాత్రం ఆనందానికైనా నేను నోచుకోలేదా?"

"నోస్కున్నవులె. మనింటెనక దుకానంలో పాతపెట్టి ముప్పైకే దొర్కతది. అది సాల్నీకు."

రెండు నిముషాలు ఆలోచించేను. ఆమాట నిజమే. నేను తీసే బొమ్మలకీ, ఆ బొమ్మలజన్మ సార్థక్యానికీ 30 పెడితే చాలు. కళ్లు చిట్లించి సంద్రాలువేపు చూసేను.

ఆవెంటనే నాకు పట్టలేనంత నవ్వొచ్చింది. ఫక్కున నవ్వేను అదేదో సినిమాలో సత్యనారాయణలా.

"నాసొమ్ము కాదు కదా!"

000

(డిసెంబరు 10, 2015)

# 8. పుచ్చుకొన్ననాటి ముచ్చట!

ఏ సూత్రానికి గానీ ఏ కాలంలోనూ మినహాయింపులుంటాయి. వీటినే ఆపద్ధర్మం అంటారు. ధర్మవ్యాధుడు మాంసం అమ్ముకున్నా ధర్మరాజు అశ్వత్థామ హతః కుంజరః అన్నా ఫరవాలేదన్నదందుకే. అబద్ధమాడరాదు, ప్రాణిహింస చేయరాదు – ఇవి సూత్రాలు. పైన చెప్పినవి మినహాయింపులు. ఆ మినహాయింపులకి సమర్థింపులు ఉన్నాయి. అలాగే కోర్టుల్లో, వార్తల్లో చూస్తున్నాను. నిష్కారణంగా నిర్దాక్షిణ్యంగా క్రూరంగా మరొకరిని కాల్చి పారేసినవారు కూడా ఏవో కారణాలు చెప్పి తప్పు తమది కాదంటారు. అలా అనడానికి వీలుగా చట్టం సౌకర్యాలు కల్పించింది. ఇంతా లోతుగా సుదీర్ఘంగా నిశితంగా పరిశీలించి చూచుకొనవలసిన అవుసరం ఇప్పుడు నాకెందుకొచ్చిందో చెప్తాను.

ముందు ఇచ్చిపుచ్చుకోడాలతో మొదలు పెడతాను. ఏదో ఓ పండుగపేరు చెప్పి అనవసర ఇచ్చిపుచ్చుకోడాలకి వ్యతిరేకిని అని ఇంతకుముందు చెప్పేను కదా. మరి పుచ్చుకోడం జరిగితే దానికి సమాధానం ఇచ్చుకోవాలి కనక. చేసిన పాపం చెప్తే పోతుందంటారు అన్నారు కనక. ఇన్ని "కనక"ల మధ్య అసలు కథ చెప్పలేదని అనకండి. ఇదుగో మొదలు పెట్టేస్తున్నా.

ఆ కథాక్రమంబెట్టిదనిన – నెల రోజులయింది నా కెమెరా బొమ్మలు తీయాలన్న నాకోరికతో సహకరించడం మానేసి.

ఇక్కడే మరోమాట చెప్పుకోవాలి. మామూలుగా ఎంత చిన్న వస్తువు కొన్నా దానిని ఎల్లవేళలా ఉపయోగపడేలా ఉంచడానికి అంటే maintenance అనబడు కార్యక్రమానికి మరో నాలుగు వస్తువులు కొనవలసివస్తుంది. ఎంత చిన్న వస్తువయినా సరే దాన్ని నీటుగానూ, భద్రంగానూ ఉంచడానికి ఏ నోమో వ్రతమో చేసేటప్పుడు ఉన్నంత తతంగం ఉంటుంది.

ఉదాహరణకి కెమెరామాటే తీసుకోండి. దానికి అమర్చిన రెండున్నర అంగుళాల యల్సీడీ తెర తుడవాలంటే కేవలం అది తుడవడానికి మాత్రమే సృష్టింపబడిన గుడ్డముక్క ఒకటుంటుంది. అది ఏదో ఒక్క దుకాణంలో మాత్రమే దొరుకుతుంది. ఆరో పదో డాలర్లు పెట్టి కొనాలి. దానితోపాటు చిన్న కుంచె, చిటికెడు పొడి, ఇంకా ఏవేవో కూడా వస్తాయి. ఏది ఏ చేత్తో ఎన్ని వేళ్ళతో ఎలా పట్టుకోవాలో బొమ్మలతో సహా సక్రమపద్ధతి వివరించబడి ఉంటుంది. అచ్చంగా ఇలాగే కాకపోవచ్చు కానీ సుమారుగా ఇలాగే ఉంటాయి ఇక్కడి వ్యవహారాలన్నీ. ఎట్టి పరిస్థితుల్లోనూ ఓ పాత పీలిక తీసుకు తుడుస్తూ ఉండండి అప్పుడప్పుడు అని ఒక్కమాటలో చెప్పడం మాత్రం జరగదు.

ఇంతకీ నా పూర్వ కెమెరా సంగతి. పైన వివరించిన శుభ్రపరుచు విధానం ఉంది కానీ అంతర్జాలంలో చూస్తే ఓ చుక్క నీళ్ళతో తుడిస్తే చాలు అని తెలిసింది. ఆ విషయం కనిపెట్టేసిన ఆనందంతో పొంగిపోతూ వంటింట్లో కొళాయిదగ్గర ఆ కాస్త చదరపుముక్క శుభ్రపరిచి గిరుక్కున వెనుతిరిగేను. నా ఉత్సాహంపాలు శృతి మించినట్టుంది నేను వెనుదిరగడంలో. ఆ విసురుకి కెమెరా చేతిలోంచి జారి రప్పున లినోలియం నేలమీద పడి మట్టి కరిచింది. ఏమైందో అనుకుంటూ ఆన్ చేసి రెండు మూడు బొమ్మలు తీసేను. బాగానే వచ్చేయి. సరే, ఇంకా దానికాలం చెల్లలేదు అనుకుని సంతోషించేను.

మరోవారం రోజులు పోయేక వీధిలోకి వెళ్తే చెట్లు కొట్టేస్తూ కనిపించేరు సిటీవారు. ఇక్కడ శిశిరం ప్రవేశిస్తుండగానే ఎంత పెద్ద చెట్టయినా సరే నిచ్చెనలేసుకుని మరీ కొమ్మలు నరికేస్తారు. ఈ క్షవరకల్యాణానికి tree maintainance service అని పేరు. పాతిక అడుగులు ఎదిగిన చెట్టు. పది పదిహేను బారలు సాగిన కొమ్మలను హృదయవిదారకంగా నరికేసే ఆ క్రియావిశేషాన్ని maintainance అనడం నాకయితే హాస్యాస్పదంగానే ఉంది.

అలా నవ్వుకుంటూ నేను ఆరోజు వెనక్కెళ్ళి నా కెమెరా తీసుకు మళ్ళీ అక్కడికి చేరుకున్నాను ఆ మెయింటెనెన్సు విశేషం నా బొమ్మలడబ్బాలో భద్రపరచడానికి. రెండు బొమ్మలు తీసినట్టే కనిపించింది. మరో నాలుగడుగులేసి, మరో బొమ్మ తియ్యబోతే పొరబాటొచ్చింది. "ఆఫ్ చేసి మళ్ళీ ఆన్ చెయ్యమం"టూ ఆదేశం జారీ చేసింది. మరి పెట్టె చిన్నదే అయినా దానిమాటకే మనం లొంగాలి. నేను అలా చేస్తాను. చేసేను కూడా బుద్ధిగా. మళ్ళీ అదే సందేశం. రెండోమారు, మూడోమారు, నాలుగూ, ఐదూ … అలా ఆ చిన్నపెట్టెతో గంటసేపు ముచ్చట్లాడి, ఇహ ఇది పనికిరాదని అర్థం చేసుకున్నాను.

నాప్రాణసమానమైన కెమెరా నీలిగిపోయినందుకు నా హృదయం బావురమని ఘోషించింది. ఆవెంటనే నాకు ఇతర ఆలోచనలు వచ్చేయి. "ఏటుండిపోతాది," అన్న సంధ్రాలు మాట మననం చేసుకున్నాను. తరవాత ఒకచోట స్థిరంగా స్తిమితంగా కూర్చుని తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టేను.

ఎందుకీ తాపత్రయం అన్న ప్రశ్నతో ప్రారంభించి సదరు కెమెరా ఉండుటవల్లను, ఉండకపోవుటవల్లనూ నాకు కలుగగల మంచి చెడ్డలు బేరీజు వేసుకున్నాను. నాకు కెమెరా అవసరం ఉందా? ఏ స్థాయిలో ఉంది? నేను తీసే బొమ్మలతో ఏం చేస్తాను అని ఆలోచించాను. అందరూ ఏం చేస్తున్నారో గుర్తు తెచ్చుకున్నాను. పండుగవేడుకలు, పుట్టినరోజులు, విహారయాత్రలు, సత్కారాలు, సమావేశాలు, ఆవిష్కరణసభలు – వీటిలో ఒక్కటి కూడా కనిపించలేదు నాకు అన్వయించుకోగలది ఎంత బుర్ర చించుకున్నా.

రెండో స్థాయిలో ఇంతవరకూ ఏం చేసేనో ఆలోచించేను. నేను తీసిన చెట్టూ, పుట్టా, పువ్వూ, కొమ్మా బొమ్మలు ముఖపత్రంలో పెట్టేను. ఓ పూట వెలుగుతుంది. అంతటితో వాటి జీవితం సరి. ఆ మాత్రందానికి కెమెరా కొనాలా? గత 30 ఏళ్ళలోనూ నేను తీసిన బొమ్మలతో నా తెరజీవితం గడిచిపోతుంది కదా. చదువరులకు అవి పాత బొమ్మలని తెలిసే అవకాశం లేదు నేను చెప్తే తప్ప, మరియు నా తొమ్మిదో ఏడునాటి బొమ్మ పెడితే తప్ప.

"పెతిపచ్చం ఆలోచిన సేయాలని మారుసులు సెప్పేరు గద," అంది సంధ్రాలు.

"హా" ఉలిక్కిపడ్డాను. సంధ్రాలు ఋషులవాక్కులను కూడా వల్లిస్తోందంటే ఇంకేం చెప్పను?

"ఎదరింట్లున్న జానిపాప గూడ అదె గద సెప్పీది," అని మరో విసురు విసిరింది. ఎదురింట్లో ఉన్న జానిపాప అంటే జానెట్. ఆవిడ సైకోతెరపిస్టు. గంటకి మూడొందలు పుచ్చుకుని ఆవిడిచ్చే సలహాలకంటే తన లోకజ్ఞానమే మేలని సంధ్రాలు గట్టిగా నమ్మింది. వాళ్ళదొరబాబు కొడుకు కోడలుమధ్య తగువులొచ్చినప్పుడు ఆ జానిపాప ఇచ్చిన సలహాలకీ తను ఇచ్చిన సలహాలకీ తేడా లేదనీ, అందుకు వారు అంత డబ్బు తగలేసేరనీ సంధ్రాలికి కోపం.

ఇంతకీ సంధ్రాలుమాట నాక్కూడా సబబుగానే తోచింది. మహర్షులు చెప్పేదీ సైకోతెరపిస్టుల చెప్పేదీ కూడా ఒకే మంత్రం – మనం కావాలన్నది నిజంగా మనకి అవసరం లేదని మనని మనం నమ్మించుకోవాలి అని. అంటే మనం ఎందుకు కావాలనుకుంటున్నామో ఆ కారణాలకి ప్రతి కారణాలు ఆలోచించడం.

ఆకోణంలోనుండి చూస్తే నా ఆలోచనలు ఇలా సాగేయి - నేను బొమ్మలు తీయకపోతే లోకానికేమీ నష్టం లేదు, బొమ్మలు తీయుట నా వృత్తి కాదు. నాకు ఏ ఛాయాచిత్రకారుల సంఘాల్లోనూ సభ్యత్వం లేదు. ఏ జాతీయ, అంతర్జాతీయపోటీలలోనూ పాల్గొనబోవడం లేదు.

వీటన్నిటికంటే మరో పెద్ద కారణం కూడా ఉంది. నాల్రోజులకిందట ముఖపత్ర అధిపతులు ఇదుగో ఇదీ నువ్వు గత ఏడు సాధించిన ఘనకార్యం – వారిభాషలో గతసంవత్సరం పునరావలోకం – అంటూ కొన్ని బొమ్మలు ఎంచి నాకు అందించేరు. మిగతావారితో పంచుకో అని కూడా శలవిచ్చేరు. తీరా చూస్తే అవి అన్నీ నాముఖారవిందాలే! అది నేను నా ముఖపత్రమిత్రులతో పంచుకుని ఉంటే ఈమనిషికి ఇంత ఈగో ఏమిటీ అంటూ యాగీ చేసేయురా అనిపించింది నాకు. ఇలా ఆలోచించినకొద్దీ కొత్త కెమెరా కొనకుండుటే మేలు అని నిశ్చయంగా తెలిసింది. నాకు సంతృప్తికరం అనిపించేక, కెమెరాసంగతి వదిలేసి ఇతర వ్యాపకాల్లో పడ్డాను.

పది రోజులయింది. నీ నిత్యసంచారంలో ఇది బొమ్మ తీస్తే బాగుండు, అది ఎంత బాగుందో అనిపించినా, చూసి సంతోషిస్తున్నాను కదా అనుకుని ఆనందిస్తున్నాను. ఒకొకప్పుడు అక్కడే మరో రెండు

నిముషాలు నిలబడి పరికించి చూస్తున్నాను. నిజానికి అలా చూడడంలో మరింత అందంగా కూడా కనిపిస్తున్నాయని గ్రహించేను. చూసేరా, ఇదే సంధ్రాలు చెప్పిన "పెతిపచ్చ ఆలోసిన్లు".

రెండు వారాలయింది. "మేం మాలుకెళ్తున్నాం. వస్తావా?" సరయు పిలిచింది,

సరేనన్నాను కాలక్షేపంగానూ ఉంటుంది, వాళ్ళిద్దరితో కొంచెంసేపు గడపొచ్చు అని. అలా ముగ్గురం బజారులో తేలేం.

మీరు సూక్ష్మగ్రాహులు కనక ఆ తరవాతేమయిందో గ్రహించేసి ఉంటారు ఈసరికి. అయినా చెప్పడం నాధర్మం కనక చెప్తాను.

"ఎలాగా వచ్చేం కదా కెమెరా చూడు."

అసలు మాఅమ్మాయి ఆ మాట అనక్ఖర్లేదు. ేఅయస్కాంతం ఇనపముక్కని ఆకర్షించినట్టు నాకాళ్ళు అటుపేపు లాగబడతాయి నాకు ఏమీ అక్ఖర్లేని రోజుల్లో కూడా. మామూలుగా కొందరు చీరెలూ నగల అల్మారాలవేపు పోతారు. కొందరు సూట్లూ, టైల కౌంటరులదగ్గర చేర్తారు. నేను కెమెరాలు, కంప్యూటర్లూ ఉన్నచోటికి తేలిపోతాను ఏటివాలులో తెప్పలా. (మీలో కొందరికైనా నా ట్రాన్సిస్టార్, రేడియో ముచ్చట్లు గుర్తుండే ఉంటాయి) Electronics కౌంటరులు కనిపించడం చర్య. నేనక్కడ తేలడం అసంకల్ప ప్రతీకారచర్య.

ఆనవాయితీప్రకారం నాకళ్ళు ఠక్కున ఓ కెమెరామీద పడ్డాయి. అది ఎంతో ముద్దుగా అచ్చు నా పాత కెమెరాలాగే ఉంది. నాకెమెరా నాచేతిలోనే నాశనమయి నాచేతే దాచిపేయబడింది అని నాకు తెలీకపోతే, అది నా కెమెరాయే అనుకునేదాన్నన్నమాట. అంత పోలికలున్నాయి దానికి. "అరె, సరిగ్గా ఇలాటిదే నాది," అన్నాను హాచ్చెర్యపడిపోతూ.

"తీసుకో."

వెంటనే నాకు తెలివొచ్చింది. కెమెరా లేకుండా ఎంతకాలం గడపగలనో చూదాం అనుకున్నాను కదా.

"ఇప్పుడొద్దు. తరవాత చూస్తాను."

పిల్లలదగ్గర తల్లులమాటలు చెల్లవు. నామాట చెల్లలేదు. ఆఖరికి మరో చుట్టు "నేనే కొనుక్కుంటాన"నని నేనూ, "కాదు, మేం కొంటాం" అని వాళ్ళూ కొంచెంసేపు వాదులాడుకున్నాం. అక్షరాలా అది ఆటలాగే అనిపించింది. అంచేత "వాదు"లాడుకున్నాం అనే చెప్పాలి.

ప్చ్ ఏం చెయ్యనూ కోరి ఇస్తానంటున్న కూతురూ, మేమిద్దరం ఇవ్వాలనుకున్నాం అంటున్న కొత్తల్లుడూ ... వాళ్ళసరదా చూసి ముచ్చట పడిపోతూ వెనక్కి తగ్గిపోయాను :p.

ఇప్పుడు మళ్ళీ చదవండి మొదటి పేరా. ఎంత మధనపడ్డానో ఈ కానుక పుచ్చుకోడానికి తెలుస్తుంది :p.

ఆ తరవాత కింద బొమ్మ చూడండి.

నా సరికొత్త బహుమతితో తీసిన కలబంద వనం!

చూడుమదే చెలియా  వేడుక తీరా కానుకను

విడివి పుచ్చుకున్న చేతులవే!!

000

(డిసెంబరు 20, 2015)

# 9. పొరుగువారితో శాంతియుత సహజీవనం!

ఇరుగుపొరుగులతో శాంతియుతసహజీవనం చేయాలని యుగయుగాలుగా మనకి కథలున్నా నాతలకెక్కింది మాత్రం నెహ్రూ చైనాతో ఈ "శాంతియుత సహజీవన" మంత్రం ప్రారంభించేకే. పూర్వం కట్టిన ఇళ్ళు ఇంటిచుట్టూ పెరడూ, ప్రహరీ గోడా, ఇంటిముందు అరుగూ ఇలా ఉండేవి. అరుగుమీద కూర్చునో ప్రహరిగోడవార  నిలబడో వండుకున్న కూర దగ్గర్నుంచి ఊళ్ళో కొత్తకోడలు తీసుకొచ్చిన సారెవరకూ అనేక ఊసులాడుకునేవారు. అప్పట్లో ఇంటిగుట్టు లంకకి చేటు అని సామెతయితే ఉంది గానీ నిత్యజీవితంలో అందరి బతుకులూ అందరికీ తెరిచిన పుస్తకమే. దాపరికాలు లేవు. అప్పటికింకా ప్రైవేసి అన్న పదం తెలుగు మెదళ్ళలో చేరి హఠం వేసుక్కూచోలేదు.

సరేలెండి ఆ సొదంతా ఎందుగ్గానీ ఇప్పుడు పెద్ద పెద్ద మేడలూ అందులో వాటాలపేరుతో కుదించుకుపోయిన నివాసాలూ వచ్చేక మొత్తం జీవనసరళి మారిపోయింది. పది పదిహేనేళ్ళు ఒకే మేడలో పక్క పక్క ఉన్నవాళ్లు ఒకరికొకరు తెలీదు. ఒకవేళ ఒకరికి మాటాడే తీరికా కోరికా ఉన్నా రెండోవారికి ఆ రెండూ ఉండవు. ఇది ఒక సరళి. రెండో సరళి ఏమిటంటే ఆ పక్క వాటాలో వారేం చేస్తున్నారూ, ఈ పక్కవాటాలో వారెక్కడికెళ్ళేరూ, పైవాటాలో కొత్తగా వచ్చినవారు ఎక్కడినుండి వచ్చేరు … అంటూ అదే యావగా జీవితం గడిపేవారు.

నాఖర్మ కాలి, నేను ఈ రెండో జాతిలోకొచ్చి పడ్డాను. అంటే నేనేదో కావాలని అదే పనిగా ఓ పెద్ద పథకం వేసుకు ఆచరణలో పెట్టింది కాదు. పొరుగువారిమీద నిఘా వేసి, పరిశోధక ఉద్యోగానికి పూనుకోలేదు. అది అనాలోచితంగా అనుకోకుండా అర్థంతరంగా జరిగిపోయింది. నా ఆత్మశాంతికోసం అవసరమైంది. ఇందులో ఏ కుళ్ళుబుద్ధులూ లేవని భగవద్గీతమీదా బైబిలుమీదా ఇంకా ఏవైనా ఉంటే వాటిమీదా కూడా ప్రమాణం చేసి చెప్పగలను.

జరిగిన సంగతి చెప్పేముందు నాదినచర్యగురించి కొంత చెప్పాలి. రోజులో కనీసం 8 గంటలు నేను ఎక్కడ కూర్చుని ఎలా గడుపుతానో మీకు తెలియాలి. అంటే నా గది ఆకారవికారాలు తెలియాలి మీకు. ఆ ఆకారం ఇలా ఉంది.




వికారాలమాట - హాలుకేమీ లేవు కానీ నాకున్నాయి కొన్ని. మాయింట్లో గదులన్నీ బోడిగా అయ్యవారి నట్టిల్లులా ఉంటాయి. "అయ్యవారి నట్టిల్లు" అని ఎందుకంటారో నాకు తెలీదు కానీ ఖాళీగా ఉన్నఇంటిని అలా అనేది మాఅమ్మ. నా గోడలమీద బొమ్మల్లేవు. హాలులో ఓ రెండు సోఫాల్లాటివి ఉన్నాయి కానీ కంటికి నదురుగా కనిపించే అలంకరణలు లేవు. రెండో వికారం ఎలెక్ట్రీ దీపాలు వెలిగించను తప్పనిసరయితే తప్ప. బయటినుండి వచ్చే గుడ్డి వెలుగు నాకు చాలా ప్రశాంతంగా ఉంటుంది. అంటే నేనేదో పెలట్రీ పొదుపు చేసి లోకాన్ని ఉద్ధరించేస్తున్నానని కాదు. ఎందుకో తెలీదు కానీ నాకు ఆ కృతక వెలుగులు ఇబ్బందిగా ఉంటాయి. సాధారణంగా వంట చేసినప్పుడూ, ఇంటికెవరైనా వచ్చినప్పుడూ తప్పనిసరి అవుతుంది. నావంటగది చీమలు దూరని చిట్టడివి కాకులుదూరని కారడవిలా ఉంటుంది. వంటగదిలో దీపం ఉన్నంతసేపూ హాల్లో గోడవారనున్న సోఫాలో అంటే క్రీనీడలో కూర్చుంటాను. నాకు బుద్ధి చెప్పడానికేమో అన్నట్టు నాగదికి ఎదురుగా ఉన్న మేడ కిందివాటాలో ఉన్నాయన రాత్రీ పగలూ కూడా లైటు వేసే ఉంచుతారు. అయినా నాకు బుద్ధి రాలేదనుకోండి అది వేరే సంగతి. ఇటీవల జరిగిన ఉదంతంమూలంగా మరొక సౌంజ్ఞ కూడా ఏర్పాటు చేసుకున్నాను. వంటింట్లో దీపం వెలిగినంతసేపూ అగ్నిహోత్రం రాజుకుంటున్నట్టే లెఖ్ఖ. ఆ నిర్ణయంతో పొయ్యి మండుతోందని మరిచిపోయే ప్రమాదాలు తక్కువ కదా. ఇంతకీ కృతక సంగతులమాట చెప్పాలంటే నాకు ప్రాణసమానమయినవి ఈ సాంకేతిక పరికరాలే! టివీ ఆన్లో ఉంటే వచ్చే వెలుగు చాలు నాపనులు చేసుకోడానికి. ఇతి వికారాల అధ్యాయం సమాప్తం.

ఇదివరకు నేను ఉన్న అన్ని ఇళ్ళల్లోనూ ఏ గదిలోకెళ్ళినా బయటిప్రపంచంలో ఉండే చెట్టూ చేమా పిట్టా ఉడతా కనిపిస్తూ నాకు అమందానందం కలిగిస్తూ ఉండేవి. ప్రస్తుతం ఆ సౌభాగ్యం మృగ్యం. ప్రస్తుతం నాలోకం అంతా టీవీ, లాప్టాప్ మాత్రమే.

ఇప్పుడు చూడండి. నేను సోఫాలో కూర్చుని కళ్ళెత్తి చూస్తే ఏం కనిపిస్తుందో.

ఎదురుగా రెండు వాటాల్లో ఉన్నవారు –



పైవాటాలో ఒక అమ్మాయీ అబ్బాయీ, కింద వాటాలో ఒక అబ్బాయి – వాళ్ళు అటూ తిరుగుతూంటే నాకు నలుపు-తెలుపు మూకీ ప్రదర్శన అన్నమాట. మొదట్లో వాళ్ళకి నేనే మాటలూ పాటలూ ఊహించుకుని వినోదించేను కొంతకాలం. ఏం చెయ్యను మరి? నాకు టీవీ, లాప్టాపూ విసుగొచ్చేక కళ్ళెత్తి చూస్తే కనిపించే దృశ్యం అదే.

పైవాటాలో వాళ్ళు ప్రవేశించగానే వాళ్ళ ప్లాస్టిక్ తెర బార్లా తెరిచేసేరు. నేను ఉలిక్కి పడి నా తెర బద్దలు కోణం మార్చేను. వాళ్ళకి నేను కళ్ళబడకుండా. ఆ తరవాత వాళ్ళు నలుగురు అతిథులని పిలుచుకుని, ఎలెక్ట్రీ గ్రిల్లుమీద వంటలు మొదలెట్టేరు. వాళ్ళ వరండాలో దీపం దేదీప్యమానంగా వెలిగింది. నేను గబుక్కున లేచి నా తెర పూర్తిగా మూసేసేను. నా అభిప్రాయం వాళ్లు గ్రహించేరేమో ఆ తరవాత మళ్ళీ ఎప్పుడూ ఆ దీపం వెలగలేదు. అదీ నేను అంటున్నది శాంతియుత సహజీవనం. నోటితో చెప్పకుండా ఎవరికి ఏమి ఇష్టమో తెలియజేసి తదనుగుణంగా నడుచుకుంటున్నాం అన్నమాట. ఆ ఉద్దేశంతోనే ఒక మొక్క కూడా కొని చిన్న ఉపతెర సృష్టించేను. వారికీ నాకూ మధ్య.

పోనీ, టీవీ, లాప్టాపు విసుగొచ్చినప్పుడు ఓ పుస్తకం తీసి చదువుకుందాం అన్నా, కళ్ళు కాయితమ్మీద నిలవవు. నాలుగు వాక్యాలు చదివేలోపున మరేవో ఆలోచన వస్తాయి. కళ్ళు మరో పనికి మళ్ళిపోతాయి. అంటే ఆ patio తలుపులకి ఉన్న ప్లాస్టిక్ బద్దలలోంచి బయటికి చూడ్డం.

పైవాటాలో వాళ్ళు వాళ్ళవరండాలో కూర్చుని బీరు తాగుతూ, కబుర్లాడుకుంటూ, బొగ్గుల గ్రిల్లుమీద ఏవో కాల్చుకుంటూ, అతిథులతో కబుర్లు ఆడుకుంటూ దర్శనమిస్తారు. కిందవాటాలో ఒక్కడే అటూ ఇటూ తిరుగుతూ కనిపిస్తాడు కానీ నాలాగే ఒంటిపిల్లి రాకాసి కాబోలు అట్టే ఆర్భాటం కనిపించదు ఆ ఇంట్లో.

ఇలా మేం ఎంతో అండరుస్టాండింగుతో కాలము పుచ్చుచుండగా, మరొ వింత జరిగింది. అదే అసలు కథ. నెల రోజులక్రితం. టీవీ చూస్తుండగా హఠాత్తుగా కనుకొల్లో ఒక చిత్రం మెదిలింది లీలగా. అటు తిరిగి చూస్తే, కిందవాటాలో ఉన్నతను వారి patioతలుపు బార్లా తీసి నావేపు తిరిగి చేతులు బారజాపి, తల విసురుగా ఊపుతూ ఏదో చెప్తున్నాడు.

మొదట ఉలిక్కి పడ్డాను. తరవాత అటువేపు చూడకుండా ఉండడానికి ప్రయత్నించేను. గుండెలు గిలక్కాయలా గలగల్లాడుతున్నాయి. కాళ్ళలో రక్తం చివ్వున ఎగిసింది తలకిందులుగా ప్రవహిస్తున్న ఆకాశగంగలా. అతను ఏమిటి చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు, నేనేం తప్పు చేసేను అని ఆలోచించడం మొదలు పెట్టేను కళ్లు టీవీమీద దృఢంగా నిలిపి. నాకు భయం వేసిందని మీదగ్గర మాత్రం ఒప్పుకుంటాను. కానీ అతనికి తెలియజేయాలా వద్దా అన్నదే సంశయం. నామొదటి ఆలోచన అక్కడినుండి లేచి పక్కగదిలోకి వెళ్ళిపోవచ్చు అని. కానీ అలా చేస్తే నేను భయపడుతున్నానని అతనికి తెలుస్తుంది. అలా తెలిస్తే విజయం అతనిదే. అది నాకు ఏమాత్రమున్నూ సమ్మతం కాదు. నా సిద్ధాంతం ఏమిటంటే భయం మానవనైజం. భయం కలగడం సహజం కానీ మనం భయపడుతున్నామని ఎదటివారికి తెలియనివ్వకూడదు. (ఇది రిపబ్లిక్ నాయకులు గ్రహించవలె). కానీ గుండెలు మాత్రం దబదబ కొట్టుకుంటూనే ఉన్నాయి.

ఫోను తీసి సరయుని పిలిచేను ఓమాటు రాగలవా అని. మామూలుగా 20 నిముషాల్లో రాగలదు కానీ ఇప్పుడు రోడ్డుమీద రద్దీ తారస్థాయిలో ఉంటుంది. రోజంతా పని చేసి ఎప్పుడెప్పుడు ఇంట్లో పడదామా అని ప్రతి ఒక్కరూ తహతహలాడే వేళ. ఎంత లేదన్నా గంటన్నర పడుతుంది తను రావడానికి. ఈ లోపున ఈ ప్రదర్శన అంతమయిపోవచ్చు. సలీనాని పిలువు అంది. సలీనా మా మేడ మేనేజరు. నాపక్క వాటాలోనే నివాసం. సరే అని ఫోను పెట్టేసేను.

సలీనాని పిలవడానికి నాకు మనస్కొప్పలేదు. ఎంత మంచి మనిషి అయినా నాకు భయం అని ఆవిడకి తెలియడం నాకిష్టం లేదు. ఈ పూట ఎలాగో గడిచిపోవచ్చు కానీ ఆ తరవాత నేను బతికున్నంతకాలం ధైర్యంపాఠాలు వినాల్సొస్తుంది.

ఆ పాఠాలేవో నాకు నేనే చెప్పుకుంటే పోతుంది కదా అనిపించింది. రచయిత్రిని కదా ఆ మాత్రం నాలుగు వాక్యాలు రాసుకోలేనా? అనుకుని మొదలు పెట్టుకున్నాను - నాయింట్లో నేను ఉన్నాను కానీ వారింట్లో లేను. స్థానబలం అంటారు కదా. నేను కదలకపోతే ఆ మనిషి నన్నేం చెయ్యగలడు? అంతగా అయితే మరింత గట్టిగా అరుస్తాడు. అంతే కదా, అరవనీ. అసలు ఇన్నాళ్లుగా ఉన్నానిక్కడ. ఇదివరకెప్పుడూ లేవు ఇలాటి వేషాలు. మందుమీదున్నాడేమో, లేదా, ఇంకెక్కడో ఇంకేదో జరిగితే అక్కడేం చెయ్యలేక ఇక్కడ ఇలా కక్ష తీర్చుకుంటున్నాడేమో … ఇలా ఆలోచించుకుంటూ నేను సర్దుకుని మరింత దృఢంగా కూర్చున్నాను, కళ్ళు టీవీమీద  కట్టిపడేసి. కానీ నాకు మనసు మనసులో లేదు. నాలుగు నిముషాలయేక మళ్ళీ అటు చూసేను.

సీను మారిపోయింది. అతను గదిమధ్యకి జరిగి, చేతులు చాపి ఒక కాలు మునివేళ్ళమీద లేచి గిర్రున తిరిగేడు ballet డాన్సు చేస్తున్నట్టు. అహా, ఏదో పాత్ర ప్రాక్టీసు చేస్తున్నాడు అని అర్థం చేసుకునేశాను. ఆ తరవాత పూటంతా నాకు వినోదమే. మాటలూ, పాటలూ నేనే రాసుకున్నాను తదనుగుణంగా.
అప్పట్నుంచి నాకు అదో కాలక్షేపం అయింది. ఏదో సమయంలో అనాలోచితంగానే అటు చూస్తాను. వారం రోజులు కనిపించకపోతే, సరే ఎక్కడో ప్రదర్శనలకి వెళ్ళేడేమో అనుకుంటాను.
ప్రభలతో వెలిగిపోయింది. సాక్షాత్తు సూర్యభగవానుడు నా నట్టింట వెలిసినట్టే! ఆ వెలుగు వస్తున్నవేపు తిరిగి చూస్తే చూస్తే ఎదురుగదిలో patio doorకి పక్కనే వెలుగు వరదకి అడ్డం పడుతూ ఓ పెద్ద గొడుగు – అదో సినిమా సెట్ లా ఉంది. నేను గబుక్కున లేచి నా patio shutters దగ్గరికి లాగేను ఆ తేజస్సునుండి నన్ను నేను రక్షించుకుంటూ.
పదిహేను నిముషాలయింతరవాత ఆ వెలుగులు అదృశ్యమయేయి. సహస్రకోటిప్రభలతో సాక్షాత్కరించిన దేవదేవుడు అంతర్థానయేడు.
సరయుతో చెప్తే, "headshots కాబోలు," అంది.
మరో రెండు వారాల్లో మరో నాలుగుసార్లు ఆ దేవదేవప్రభలు నాగదిలో వెలిగేక, ఆ తలబొమ్మలు పేరేవారివి కాబోలు, అది అతనికి వ్యాపకం కాబోలు అనుకున్నాను.
చూసేరా! నేను పనిగట్టుకు వారిమీద నిఘా వేసి ఏదో డిటెక్టివ్ నవలలోగ డిటెక్షను చెయ్యలేదు. నాఇంట్లో నేను కూర్చుని నాపనేదో నేను చేసుకుంటుంటే, నన్ను కదిలించి చూడు చూడమంటూ నాముందుకొచ్చేయి ఆ విశేషాలు.
ఇలా వీధినాటకాలు జరుగుతుండగా, ఒక రోజు రెండు వాటాల్లోనూ దీపాలు వెలగలేదు. అంటే వాళ్ళు ఊళ్ళో లేరు. నాకు హఠాత్తుగా మరో చిత్రం – నిండు పున్నమినాటి చంద్రుడు ఎదురింటి గాజుగోడమీద ప్రకాశిస్తున్నాడు ముళ్ళపూడివారి యువరాజులా.



అదీ ఇరుగు పొరుగులతో నా శాంతియుత సహజీవన హేల.

(డిసెంబరు 29, 2015)

# 10. వినిపించని ధ్వనులు

హారతి మేలుకుని కిటికీ ప్లాస్టిక్ బద్దల్లోంచి చారలు చారలుగా కనిపిస్తున్న ఆకాశం పరికించి చూసింది, ఓ ఈ రాత్రి కూడా పోలేదన్నమాట.

మూడు ఇరవై. వాచీ చూడలేదు. చూడక్ఖర్లేదు. మొదట్లో చూసేది కానీ ఆ అవుసరం లేదని ఈమధ్యనే తెలిసిపోయింది. ప్రతిరోజూ అదే సమయానికి మెళుకువ వస్తుంది. "రాత్రి ప్రాణం పోలేదన్నమాట" అనుకుని అలవాటయిన స్తోత్రం స్మరించుకోడం మొదలు పెట్టింది. స్తోత్రం పూర్తి కాకముందే మళ్ళీ నిద్రలోకి జారుకుంటుందని తనకి తెలుసు. మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఐదు యాభైమూడు. ఇంత ఖచ్చితంగా టైము ఎలా కుదురుతోందో తెలీదు కానీ ప్రతిరోజూ ఇంతే. ... చెప్పుకోదగ్గ విచిత్రాలేమీ లేవు. ప్రతి చర్యా లెక్కప్రకారం అతిమామూలుగా కొనసాగుతాయి.

మొహం కడుక్కున్నాక కాఫీ, బ్లాగు, ఉత్తరాలు, ముఖపుస్తకం వీటితో ఓ అరగంట

000

టీవీలో వార్త - క్లబ్బులో కాల్పులు, 50మంది మరణం, మరో యాభైమంది క్షతగాత్రులు. ఏ ఛానెల్ చూసినా అట్టుడికినట్టుడికిపోతోంది ఆ దౌర్జన్యకాండ వివరాలతో. హింసని కేంద్రం చేసుకుని తమఘనతని చాటుకుంటున్న అభ్యర్థుల ఓటి ప్రమాణాలూ హీనంగా నీచంగా హాస్యాస్పదంగా ఉన్నాయి! ఇంతకుముందు ఎన్ని కాల్పులు జరగలేదు? ఎంతమంది ఎన్ని ప్రమాణాలు చెయ్యలేదు? ఎన్ని తరాలుగా ఎన్ని యుగాలుగా ఈ దారుణ మారణహోమాలు జరుగుతున్నాయో. నిరసనలు, ధర్మబోధలు, కొత్త చట్టాలు ... ఏవీ నిజంగా మానవులలో మార్పు తెచ్చినట్టు కనిపించదు.

000

పక్కమీంచి లేవబోతే మోకాలు కలుక్కుమంది. ఇదేమిటి చెప్మా నిన్న బాగానే ఉంది కదా. నేను పడుకుని ఆ కాలుని అధికంగా కష్టపెట్టేనేమిటి!! రెణ్ణెల్లవుతుందనుకుంటా ఏపూట ఎక్కడ ఈ నొప్పి కనిపిస్తుందో తెలీడం లేదు.

నెలరోజులక్రితం ఇలాగే మోకాలునొప్పి అని క్లినిక్ ని పిలిస్తే, అర్జంటు కాదని పది రోజులతరవాత రమ్మంది డాక్టరమ్మ. ఆపూట మోకాలు నొప్పి లేదు.

"మరి నొప్పి లేకపోతే దేనికి మందివ్వను?" అనడిగింది ఆ కలికాలధన్వంతరి.

"ఇవాళ మోకాలు కాదు మణికట్టు నొప్పెడుతోంది. ఇదే చూడండి."

"నేను మోకాలుడాక్టరుని, మోకాలు మాత్రమే చూసాను. మణికట్టుడాక్టరు పేరు. పేరిస్తాను. ఆవిడని చూడండి."

మరో పది రోజులు పోయేక ..

"ఇవాళ మణికట్టు కాదు, మోచెయ్యి నొప్పిగా ఉంది. ఇదుగో, ఇక్కడ."

"మోచెయ్యివైద్యుడు వేరే. పేరిస్తాను. పిలిచి చూడు."

000

హారతి ఇంటికొచ్చేసింది మరే వైద్యవరులతోనూ ఏర్పాటూ చేసుకోకుండానే. మరి ఆ మోచేయిడాక్టరుని చూడడానికి వెళ్ళినరోజున మణికట్టు కాక మెడ నొప్పి కావచ్చు. ఇలా డాక్టరు తరవాత డాక్టరు నాలుగు స్తంభాలాట ఆడుకుంటూ పోతే ఇతర నొప్పులెలా ఉన్నా తలనొప్పి ఖాయం. అప్పుడింక తలనొప్పిడాక్టరుని వెతుక్కోవాలి! హాహా లేదులే. తలనొప్పికి డాక్టరెందుకూ, రెండు అలీవ్ మాత్రలు వేసుకుంటే సరి.

హారతి వంటగది ప్రవేశించి, కిస్మిస్ పళ్ళు నానవేసిన నీళ్ళు తాగుతూ అత్తయ్యని మరోమారు తలుచుకుంది.

ఇదెలా జరిగిందంటే నెలరోజులక్రితం రవలడ్డుకోసం కిస్మిస్ పళ్ళు కొంది. ఆతరవాత మిగతావాటితో ఏం చెయ్యడమా అని ఆలోచిస్తుంటే అమ్మ చెప్పిన అత్తయ్యవైద్యం ఒకటి గుర్తొచ్చింది.

అత్తయ్య రెండోకొడుకుకి పుల్లల్లా కాళ్ళూ, గుమ్మడికాయలా పొట్టా - లివర్ కాబోలు. అత్తయ్య రాత్రి ఐదారు కిస్మిస్ పళ్ళు నీళ్ళలో నానేసి ఆనీళ్ళు పొద్దున్న వాడిచేత తాగించేదిట. లివరవునో కాదో కానీ వాడు కోలుకున్నాడు. తరవాత యాభై ఏళ్ళు బతికేడు.

హారతి కూడా చూదాం అని నాలుగుపళ్ళు నీళ్లలో వేసి ఉదయం తాగితే రోజూలా నీరసం లేదు ఆ పూట. అంత వెంటనే ఫలితం కనిపించడం భ్రమే కావచ్చు కానీ తనకి ఆ రోజు హాయిగా అనిపించడం నిజం. వారం రోజులవుతోంది. ఆ ద్రాక్షనీళ్ళతో బాగున్నట్టే ఉంటోంది. బహుశా ఆ ద్రాక్షనీళ్ళు ద్రాక్షాసవంగా పరివర్తన చెందే స్థాయికి తొలిమెట్టేమో. అయితే మరి వైను తాగవచ్చునా? ఏమో తెలీదు. ఆ ప్రయోగం హారతి చేయదలుచుకోలేదు. మిత్రులెవరైనా చేయదలుచుకుంటే వాళ్ళిష్టం (చిరునవ్వుతో).

000

తాను కర్పూరహారతిలా నిలిచి వెలగాలని పెట్టేరుట ఆ పేరు. తరిచి చూసుకుంటే ప్రస్తుతం తన జీవితం హారతికర్పూరంలా హరించిపోతున్నట్టుంది.

20 ఏళ్ళనించీ ఎదురు చూస్తోంది ఆ రోజుకోసం. రమ ఇప్పటికీ వెక్కిరిస్తూనే ఉంటుంది 60 దాటి బతకనన్నావు కదా అని. ఎందుకలా అనుకుందంటే తనజాతకంలో వాక్యాలు రెండు తనని అలా నమ్మేలా చేసేయి. అన్ని జాతకాలలోలాగ ఈ జాతకురాలికి గొప్ప యోగము గలదు అని రాయలేదు సిద్ధాంతిగారు. "ఈ జాతకురాలికి భుక్తికి లోపము ఉండదు" అని రాసేరు. అది సత్యమే అయింది.

ఘనంగా చెప్పుకోగల మేడలూ, ఖరీదయిన కార్లూ లేకపోయినా దేహీ అని ఎవర్నీ కాణీ అప్పు యాచించకుండా జరిగిపోతోంది. రెండోది "ఈజాతకురాలికి 60 సంవత్సరములకు తక్కువ చెప్పకూడదు" అన్నది. అదుగో అక్కడే మొదలయింది. ఆ తరవాత ఆలోచనలు అన్నీ అదే దారిలో నడిచేయి - తనవయసు మేనమామకూతురు - ఇద్దరూ కలిసి ఆడుకునేవారు చిన్నతనంలో - 60 దాటగానే హరీమంది. ఇహ నావంతు అనుకుంది హారతి అప్పుడే. క్రమంగా 61, 62, 63 ... పోలేదు. అప్పుడే రమతో అంది ఏదో మాటల్లో. "రెండు దశాబ్దాలయినా ఇంకా ఉన్నావు రాయిలా," అంటుంది వీలు దొరికినప్పుడల్లా. ఆ తరవాత అన్నయ్య ఏదో మాటలసందర్భంలో "మనవంశంలో ఎవరూ 80 దాటి బతకలేదు," అన్నాడు. తరవాత ఇంట్లో ఒక్కొక్కళ్ళే పోతూంటే హారతి లెక్కలేసుకుంటూ చిదానందముద్ర పట్టి గమనించసాగింది. ప్రస్తుతం పోయినవాళ్ళ వయసులు - 64, 70, 78, 80కి వారం ఉందనగా, తరవాత 79. ఒక్కరూ 80వ పుట్టినరోజు చూడలేదు. ఎలా అనుకోడం తను 80లు చూస్తానని.

కానీ ఈవిషయం ఎవరితో గానీ మాటాడ్డం కష్టం. ఎందుకో చావుమాటెత్తితే ఝుడుసుకుంటారు అందరూ! కానీ మృతియె లేకున్న రుచి ఏది బ్రతుకులోన అంటాడు గాలిబ్. రుచిమాటెలా ఉన్నా మృతి మాత్రం ప్రకృతి సహజం. చక్రవర్తులు, మహా కవులు, మహా యోగులు ఎవరు ఉండిపోయేరు కనక. అందరూ కొంతకాలం ఉండి తరవాత పోయినవారే.

కొంతవరకూ హారతి పుట్టి పెరిగిన వాతావరణం కూడా కావచ్చు. ఎప్పుడూ ఎవరికీ ఎదురు చెప్పలేదు. పెద్దలకి ఎదురు చెప్పకూడదు అన్నసంప్రదాయంలో పెరిగింది. తాతగారు మాటాడరు కానీ ఉరిమి చూస్తే చాలు చెట్టంత కొడుకులు తలొంచుకు నిలబడడమే కానీ నోరిప్పలేదు. అమ్మమ్మ కొంపలు మునిగిపోతున్నా పల్లెత్తి ఒక్క పలుకు లేదు. చిన్న కనిపించీ కనిపించని చిరునవ్వుతో తలూపడమే కానీ పెదమి కదిపి అలా కాదూ అనలేదు. అవునని కూడా అనలేదు. ఆవిడమనసులో ఏముందో ఆవిడని పుట్టించిన బ్రహ్మకి తప్ప ఎవరకీ తెలీదు.

000

హారతి లేచి నిత్యసంచారానికి బయల్దేరింది. వీధివార కాలిబాటమీద ఓ చిన్నపిల్లాడు ఓ వెదురుతట్టనిండుకు రంగుసుద్దలతో కూర్చుని సిమెంటుగచ్చుమీద లతలూ, చక్రాలూ, చదరాలూ గీస్తున్నాడు. వాడిఅమ్మా నాన్నా కాబోలు ఇద్దరు పెద్దలు కూడా యథాశక్తి తమ చిత్రకళ ప్రదర్శిస్తున్నారు ఆ సిమెంటుగచ్చుమీద.

హారతి ఆగి చిరునవ్వుతో వాళ్ళని చూస్తోంది. "ఏదైనా గియ్యి," అన్నాడతను ఓ సుద్ద అందిస్తూ.

హారతి నవ్వి "ఏం గీయను?" అంటూనే ఆ సుద్దముక్క అందుకుని, "ఆహా ఇవాళ నాకు బహు సుందరం," అని రాసి అతనివేపు చూసి, "సరేనా?" అంది.  అతను అటో చూపు విసిరి, మరో సుద్దముక్క ఇస్తూ, "ఏదైనా గీయి," అన్నాడు.

తాను రాసింది అతనికి నచ్చలేదు కాబోలు. హారతి ఆ సుద్దముక్క తీసుకుని తనకి చేతనైన ఒకే ఒక బొమ్మ పద్మం గీసి అతనివేపు చూసింది. అప్పటికే అతను తాను గీస్తున్న గీతలతో చాలాదూరం వెళ్ళిపోయేడు. హారతి ఓ క్షణం ఆలోచించి చేతిలో మిగిలిన సుద్దముక్క అక్కడే పడేసి ముందుకు సాగిపోయింది.

మర్నాడు కెమెరా తీసుకుని వెళ్ళింది ఆ గచ్చుమీద చిత్రకళ బొమ్మ తీసుకోడానికి.

తాను రాసిన వాక్యం, గీసిన పద్మం కూడా తుడిచిపెట్టుకుపోయేయి. ఆమేర శుభ్రంగా కడిగేసి ఉంది. వాళ్ళు వేసుకున్న బొమ్మ మాత్రం ఉంది. హారతి అదే బొమ్మ తీసుకుని ముందుకి సాగింది.

హారతికి ఆ క్షణంలో హఠాత్తుగా మరొక వాస్తవం స్ఫురించింది.

000

నేనక్కడ ఏం రాసేను అన్నది ప్రధానం కాదేమో అతనికి. గీయి అన్నాడు కానీ నన్ను మెచ్చుకో నాబొమ్మ మెచ్చుకో అనలేదు. ఈ బొమ్మలు నీకు బాగున్నాయా, నేను అందంగా గీసేనా అనడగలేదు. నేనే అడిగేను నామాట నీకు నచ్చిందా అని. అలా అడగడంలో నామాటని నువ్వు మెచ్చుకోవాలి అన్న ఆశ లేదూ? హ్మ్. వాళ్ళు ఆ గీతలు సరదాకి గీస్తున్నారు. కాలక్షేపానికి గీస్తున్నారు. గీయడం గీయడం కోసమే. అంతే. గీతలవల్ల గలిగే ఆనందమే కానీ గీసింది అద్వితీయం, అద్భుతం అవునా కాదా అని కాదు. సిగ్గుచేటు కాదూ!

ఇంకా ఆలోచిస్తుంటే నారాతలద్వారా రోజూ ఆ ముఖపత్రంలో నేను చేస్తున్నదీ అంతేనేమో. ఏదో ఒకటి రాయడం, ఎవరేమన్నారు, ఎవరేమనుకుంటున్నారు, ఎంతమంది బాగుందన్నారు, ఎన్ని వేలిముద్రలు - ఇవన్నీ ఏమిటి? వీటిలో "నేను" అన్న అహమిక ఎంత బలంగా స్థగితమయి ఉంది?! ఎవరినో అనడం కాదు.

చూడు. ఏం చేస్తున్నావో … నీముఖపత్రం చూసుకున్నతరవాత మిగతా  ముఖపత్రాలు, అక్కడ ఓ వేలిముద్రో, మెప్పో గిలికి మరో కాయితానికి … తేలిగ్గా సాగిపోవడం వాలుగాలిలో కాయితప్పడవలా …

".... గారు ఇక లేరు."

"అయ్యో. అంతటి … మరొకరు లేరు. ,,, గారి సేవ అమోఘం. అద్వితీయం. వారి లేని లోటు ఎవరూ తీర్చలేరు …"

ఏమిటో ఈ సానుభూతి ప్రకటనలు. ... చచ్చినవాడికళ్ళు చారెడన్నట్టు ఆ మనిషి ఎంత మంచివాడో ఎంత గొప్పవాడో తమకి ఎంత ఆప్తుడో ... నమ్మాలనిపించదు. ఆ చెప్పేదేదో వాడు బతికుండగానే చెప్తే సంతోషించి ఉండేవాడు కదా. చెప్పేరేమోలే. చెప్పే ఉంటారు. కానీ ఇంత కొట్టొచ్చినట్టు కనిపించదు. హ్, అందరికీ ఇలాగే చెప్తారు అనుకని ఊరుకుంటారు.

ఆ వెంటనే, "ఆహ్, భలే జోకు."

తరవాతిపేజీ, "అబ్బ, ఎంత చక్కగా ఉంది."

మరో పేజీ, ...

తరవాతి క్షణం, "అబ్బ, అద్భుతమైన కవిత. మీరు తప్ప మరొకరు ఇలా రాయలేరు."

,,, ,,, జాలం, జీవితం ... ఎక్కడయినా అంతే. క్షణం తరవాత క్షణం. దినం తరవాత దినం, సన్నివేశం తరవాత సన్నివేశం, సంఘటన తరవాత సంఘటన, ఒక పని తరవాత మరో పని, ఒక ఆలోచన తరవాత మరో ఆలోచన. ...

చావుపుట్టుకలు కూడా అంతే. చావు బతుకులో భాగం నిశ్శబ్దంలో ముప్పేటగా అల్లుకుపోయిన శబ్దాలలాగే. వాటిని విడదీయలేం. బతుకుభయమూ లేదు. మృత్యుభయమూ లేదు. బతుకుతున్నందుకు విచారం లేనట్టే చావంటే కూడా విచారం ఉండకూడదు.

వ్రాత వ్రాసెడు హస్తమ్ము వ్రాసి
కదలి వ్రాయుచును పోవుచుండ
ఆ వ్రాతలోని పంక్తి సగమైన
మరి రద్దు పరచలేవు

000

హారతి పక్కమీద వాలింది ఆలోచిస్తూ. ఈ రాత్రి గడిచేక రేపు లేస్తానో లేవనో తెల్లవారి లేచినప్పుడు తెలుస్తుంది. లేవకపోతే మరో అధ్యాయం.

000

(జూన్ 15, 2016)

# 11. బాల్యం

(పిల్లలచదువులగురించి పెద్దలు పడే ఆరాటంగురించిన కథలు చాలానే వచ్చేయి. ఆ సందర్భంలో పిల్లలమనసులు ఆవిష్కరించడానికి చేసిన యత్నం ఇది. 60వ దశకంలో నవల రాయాలని మొదలు పెట్టినట్టున్నాను. మొదటి అధ్యాయంతోనే ఆగిపోయింది. ఇప్పుడు నవల పూర్తి చేసే ఓపిక లేదు. అంచేత ముగింపు ఇచ్చేసి చిన్నకథగా ప్రచురిస్తున్నాను. ఈ కథలో వాతావరణం ఆనాటిదిగా గ్రహించగలరు.)

000

మాలిగుడిసెముందు కోడి చుట్టూ ఓమారు చూసి “తెల్లారిందని వీళ్ళకి చెప్పాలి” అనుకుంది.

“అప్పుడే తెల్లారిపోయిందా? ఈరోజైనా జీతండబ్బులిస్తారో లేదో,” అనుకుంటున్నాడు మాలి పక్కమీంచి లేస్తూ.

“ఊహుఁ. ఇంకా తెల్లారలేదు. ఇంకొంచెంసేపు పడుకోవచ్చు,” అనుకుంటున్నాడు రాముడు కళ్ళు గట్టిగా మూసుకుని.

“లే, లే. బళ్లోకెల్లవేటి?” అంటూ గట్టిగానే కసిరింది సీత తమ్ముణ్ణిగురించి. అలా అనడంలో “నువ్వు బడికెళ్ళొచ్చు,” అన్న అక్కసుంది. “నన్నెల్లొద్దన్నాడు అయ్య” అన్న నొప్పి ఉంది.

అదే సమయంలో "కన్నా, లేవవే. తెల్లారిపోయింది," అంటూ ముద్దుముద్దుగా కృష్ణ అను నామధేయం గల కూతుర్ని సరోజమ్మ లేపడానికి ప్రయత్నిస్తోంది.

"ఎందుకు తెల్లవారిపోయింది?" అని ప్రశ్నిస్తోంది కన్నా కళ్ళు తెరవకుండానే.

రెండిళ్ళవతల "ఇంక లేచి స్నానం చెయ్యి బాబూ," అంటూ రామనాథంగారు అప్పటికే చాలాసేపట్నుంచి చదువుకుంటూ కూర్చున్న కొడుకు మనోహర్ని హెచ్చరించేరు.

అప్పటివరకు కలుగులో ఎలుకలా తూర్పున దిగంతాల్లోంచి తొంగి చూస్తున్న కర్మసాక్షి మొహమాటం వదిలి కొంచెం పైకి లేచేడు.

కన్నా ముచ్చటగా ముస్తాబయింది. ఉగాదికి కుట్టించుకున్న కొత్త పువ్వులపరికిణీ కట్టుకుంది. ఊదారంగు సాదా జాకట్టు వేసుకుంది. రెండు జడలు వేసుకుంది. ఓ జడలో నాజూగ్గా మల్లెచెండు ఓ చివర దోపింది. కన్నుల కాటుక దిద్దింది. ఊదారంగు బొట్టు గుండ్రంగా దిద్దింది.

"వెళ్తున్నానమ్మా," అని చెప్పడానికొచ్చిన కూతుర్ని చూస్తూ సరోజమ్మ, "దీనికి ఓణీలు కొనాలి," అనుకుంది.

తల్లి దేన్నిగురించి ఆలోచిస్తోందో, తనకెందుకు జవాబివ్వలేదో గమనించకుండానే కన్నా ఛెంగున గెంతి పరుగెట్టుకు వెళ్ళిపోయింది. అలా పరుగెత్తి ఎంతో దూరం వెళ్ళలేదు. గేటుదగ్గర నిలబడి సీతకోసం చూస్తోంది. సీత ఎంతకీ రానందువల్ల విసుగేసి రోడ్ మధ్యకి వెళ్ళి నిలబడి కనిపించినంత మేరా చూసింది. కానీ సీత కనిపించలేదు. విసుక్కుంటూ చిరాకు పడుతూ రోడ్ చివరికి వెళ్ళి చూసింది. గబగబ నడిచి మనోహర్ ఇంటివరకూ వచ్చింది. వాడు అప్పుడే బయల్దేరుతున్నాడు.

"సీత రాలేదా?" అనడిగేడు కృష్ణని చూసి.

"ప్చ్. ఇంతవరకూ చూసి వచ్చేసేను." ఇద్దరూ కలిసి సీతఇంటికి వెళ్ళబోతుండగా రాముడు వచ్చేడు.

"ఏరా, సీతేదీ?" కృష్ణ అడిగింది.

"రాదు. మాఅయ్య నన్నెల్లమన్నాడు," అన్నాడు రాముడు.

"ఎందుకు రాదూ?"

"ఆడగుంటలకి సదుగెందుకు. సదిగింది సాల్లే. నివ్వెల్లు అంటన్నడు."

"ఆడగుంటలయితె అక్షరాలు కొంకరగా కనిపిస్తాయేంటి? ఎవరు చదివినా క క లాగే కనిపిస్తుందా మరోలా కనిపిస్తుందా? ఆడి తప్పరాదు అంటే అది ఆడపిల్లలకి వేరుగా ఉంటుందేమిటి?" కృష్ణ విసుగ్గా అంది.

"ఏటో మరి," అన్నాడు రాముడు. వాడిక్కూడా సీత బడికి వస్తేనే బాగుణ్ణని ఉంది.

రాముడు వాళ్ళల్లోకి చిన్నవాడు. ఈ యేడే ఫస్టుఫారంలోకి వచ్చేడు. మనూ, కృష్ణ third formలోకి వచ్చేరు. సీత స్కూలికి వస్తే అది కూడా third formలో ఉండేదే. వాళ్ళిద్దరూ క్లాసులోకి వెళ్తుంటే సీత ఇంట్లో కూర్చోడం వాడికి నచ్చలేదు. ఏం? సీత వాళ్ళకంటే ఏం తీసిపోయింది? సీతని తల్చుకుంటే వాడికి జాలేసింది.

"పోనీ, నేనెల్లి పిల్చుకొచ్చేసీదా?" వాడికి తోచిన ఒకే ఒక ఉపాయం అదీ.

"పిల్చుకొచ్చీ," అంది కృష్ణ.

"అదెలాగ? మీనాన్న పుస్తకాలకీ, జీతానికీ డబ్బియ్యడు. అల్లరవుతుంది. Attendance registerలో పేరు లేకపోతే మేష్టరు క్లాసులోకి రానియ్యడు," మనూ కష్టాలెకరువు పెట్టేడు.

"స్కూలికి టైమయిపోతూంది," రాముడికి హఠాత్తుగా తన కొత్త క్లాసు గుర్తొచ్చింది. ముగ్గురూ స్కూలికి బయల్దేరేరు.

రాముడు అక్కసంగతి మర్చిపోయేడు కానీ కృష్ణకీ మనూకి బాగులేదు. సీత వచ్చి ఉంటేనే బాగుండు అనిపిస్తోంది. స్కూల్లో కూడా వాళ్లిద్దరికీ మోచేతిదగ్గర ఎవరో కొరతయినట్టే అనిపిస్తూనే ఉంది. పిల్లలందరూ సీతేదీ అనో అలా ఉన్నావేం అనో అడుగుతూనే ఉన్నారు కృష్ణని. మనూ పిల్లలతో కలిసిపోయేడు కానీ కృష్ణకే మరీ కష్టంగా ఉంది.

సీత లేకుండా మిగతావాళ్ళతో ఆడాలనిపించడం లేదు. ఆఖరికి మాస్టారు కూడా అడిగేరు సీత రాలేదేం అని. అది తెలివైనది అని కాదు కానీ దానిమనసు మంచిది. ఎవరికి ఏం కావాలన్నా అది ప్రత్యక్షమవుతూంటుంది. అమెరికావాళ్ళలా కాకుండా డొక్కా సితమ్మతల్లిలా ప్రవర్తిస్తుంది. (1). సీత పక్కనుంటే కృష్ణని ఎవరూ పలకరించరు. కానీ సీత తనని చెయ్యి పుచ్చుకు లాక్కుపోతుంది. అందరూ సీతచుట్టూ తిరిగితే సిత తనచుట్టూ తిరుగుతుంది. అది తనకి గర్వకారణం. ఈ కారణాలచేత కృష్ణప్రియకి ఎంత కోపం రావాలో అంత కోపం వచ్చింది తనతో చెప్పకుండా ఆగిపోయినందుకు సీతమీదా, తనని అడక్కుండా మాలి సీతని మానిపించేసినందుకు మాలిమీదాను.

సాయంత్రం సరాసరి సీతఇంటికి వెళ్ళింది. సిత కోడిపిల్లల్ని బుట్టకింద పెడుతోంది.

"ఏం చేస్తున్నావే?" కృష్ణప్రియ కోపంగా అడిగింది.

కృష్ణని చూడగానే సితకి సంతోషంవేసింది. "నువ్వొచ్చేవే," అని పలకరించింది. "వెంకటలక్ష్మి, రాజ్యం, సుందరి, రమణ అందరూ వచ్చేరా క్లాసుకి? క్లాసులో ఏంటి చెప్పేరు?" అంటూ స్కూలు విశేషాలు అడిగింది.

కృష్ణప్రియకి ఈ ప్రశ్నలు వింటుంటే ఇంకా కోపం వచ్చింది. "ఆఁ అందరూ వచ్చేరు. నువ్వెందుకు రాలేదూ?"

స్నేహితురాలిని చూస్తుంటే సీతకి నవ్వొచ్చింది. "సత్తెబామలాగున్నావే," అంది నవ్వుతూనే.

"నేనెలాగున్నానని నిన్నెవరూ అడగలేదు. నువ్వెందుకు రాలేదని అడుగుతున్నాను. అందరూ నన్నడగడఁవే సీతేదీ, సీతేదీ అంటూ. జవాబు చెప్పలేక చచ్చేను. ఆఖరికి మాస్టారు కూడా అడిగేరు."

అందరూ తనగురించి అడిగేరు అని తెలియగానే సీతగుండెలు అవ్యక్తానందంతోనో మరి దేనితోనో వేగంగా కొట్టుకున్నాయి.

"రాముడు చెప్పలేదూ? అయ్యెల్లొద్దన్నాడు," సీత నిదానంగా జవాబు చెప్పింది.

"చెప్పాడు. కానీ నువ్వెందుకొప్పుకున్నావు? ఏడీ? మీనాన్న ఎక్కడ? నేనడుగుతాను ఎందుకు మానిపించీసేడో?"

సీత ప్రేమగా కృష్ణప్రియభుజంమీద చెయ్యేసి, నులకమంచందగ్గరికి తీసుకెళ్ళింది. వాళ్ళిద్దరూ ఒక వయసువాళ్ళే అయినా సితకున్న ప్రపంచజ్ఞానం కృష్ణకి లేదు. ఆ సంగతి సీతకే బాగా తెలుసు.

అందుకే కృష్ణని స్నేహితురాలిలా కాక చీకట్లో పెరట్లోకి వెళ్ళడానికి భయపడే చిట్టి చెల్లెలులా చూసుకుంటుంది.

"అది కాదే. స్కూలికొచ్చి సదివితేనే సదువేటి? నువ్వు సదూకునొచ్చి నాకు సెప్పు," అంది.

"నేం చెప్పను. అసలు నువ్వెందుకు మానీయాలీ?" చిల్లు పడ్డ గ్రాంఫోను రికార్డులా అదే మాట పదే పదే అడుగుతుంటే ఏం చెప్పాలో సీతకి తెలీలేదు.

"ఇస్కూలంటే మాటలేటి? జీతం నేదంటరు గానీ ఏవో స్పెసలు ఫీజులనీ సందాలనీ తేతెమ్మంటరు. అవి కాక లాటరీలూ ఎక్సకర్సనులూ అంటరు. ఉతికి ఆరేసిన బట్టలేసుకు రా అంటరు. పొతకాలూ, పెన్సిల్లూ కావాల. మాలాటాల్లకి అయన్నీ ఏడొస్తయి సెప్పూ?" అంది.

కృష్ణకి అర్థం కాలేదు. అదొక పెద్ద ఖర్చు అనిపించలేదు. "మానాన్నగారితో చెప్తానుండు," అనేసి ఇంటికొచ్చేసింది విసుక్కుంటూ.

ఎంతసేపటికీ టిఫినుకి రాని కూతురుకోసం ఎదురు చూస్తోంది సరోజమ్మ. వరండాలో కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది కృష్ణ. ఆవిడకి కంగారు పుట్టింది. "ఏంపైందే? ఎవరైనా ఏ(పైనా అన్నారా?"

కృష్ణప్రియ చాలాసేపు మాటాడలేదు. మాటాడగలిగినప్పుడు చెప్పినమాట ఆవిడకి అంత హృదయవిదారకమైనదిగా అనిపించలేదు.

"సర్లే. అది స్కూలికి రాకపోతే అంత ఏడవడం ఎందుకూ? సాయంత్రం ఇద్దరూ ఆడుకుంటూనే ఉంటారు కదా. రోజూ దాన్నిక్కడికే రమ్మను. పద టిఫిను తిందువు గాని."

ఆవిడ చెప్పదలుచుకున్న ఓదార్పుమాటలు, కృష్ణప్రియ సమస్యకి పరిష్కారం, ప్రస్తుత కర్యవ్యం ఒక్క వరసలో చెప్పేసి తన పాత్ర అయిపోయిన నటిలా ఇంట్లోకి వెళ్ళిపోయిందావిడ.

తనకి ఇంత బాధగా ఉన్న విషయాన్ని తల్లి అంత తేలిగ్గా ఎలా తీసుకోగలిగిందో కృష్ణకి అర్థం కాలేదు. తల్లివెనకే నడుస్తూ, "అది కాదమ్మా ఎందుకు మానిపించేయాలి?" అంది.

"సరేలే. అందరూ తూగగలరుటే. డబ్బుండొద్దూ అందులోనూ వాడి సంపాదనతో. ధరలు చూస్తే మండిపోతున్నాయి. వాడికొచ్చే వందలో నాలుగు రాళ్ళు వెనకేసి దాని పెళ్ళే చేస్తాడా, గంజి కాచుకు గొంతు తడుపుకుంటాడా."

కృష్ణకి విసుగేసింది. అమ్మెప్పుడూ ఇంతే, తనొకటి అడిగితే వేరొకటి చెప్తుంది అనుకుని గబగబ టిఫిను తినేసి పాలు తాగేసి వెళ్ళిపోయింది సీతదగ్గరికి. సీతదగ్గర కూర్చుని వేరుశనక్కాయలు తింటూ కబుర్లు చెప్పుకుంటుంటే తృప్తిగా ఉంది. సీతగురించి ఎవరు ఏమేం అడిగేరో, తనేం చెప్పిందో, కొత్తక్లాసు విశేషాలు, కొత్త పిల్లల ఆకారాలు మళ్ళీ మళ్ళీ చెప్తూనే ఉంది మాలి వచ్చి "పదండమ్మాయిగోరూ, సీకటడిపోనాది. ఇంటికాడ దింపుతా," అనేవరకూ.

మాలితో ఇద్దరూ నడుస్తుంటే కొంతదూరం వచ్చేక కృష్ణకి గుర్తొచ్చి అడిగింది, "ఏం మాలీ, సీతని ఎందుకు మానిపించేసేవూ," అని.

ఆ స్వరంలో ఇందాకటి జోరు లేకపోవడం చూసి సీత చిన్నగా నవ్వుకుంది. దానికి ఇదంతా ఇలాగే జరుగుతుందని ముందే తెలిసినట్టు అనిపిస్తోంది.

మాలి నెమ్మదిగా నడుస్తూ ముందూ వెనకా చూస్తూ నెమ్మదిగా అన్నాడు, "తఃవరు సిన్నోరు. తఃవకి తెలీదండి. నాను పెద్దోన్నయిపోతన్నను. మరో రెండేల్లుంటది నాసవీసు. మరి నాను రిటేరయిపోనాక ఏఃవున్నది? ఈ నాలుగు డబ్బులు గూడ కల్ల పడవ్. సైకిలు సూస్కో వోరగా నడండమ్మా. మీనాగ దాన్ని బియేలూ యమేలూ సదించలేను. కనీసం కులపోన్ని సూసి పెల్లయినా సెయ్యాల. అందుకే అమ్మగోరికాడ నాలుగు డబ్బులు గూడపెడతన్న."

కృష్ణకి ఆశ్చర్యం వేసింది. తన తల్లి కూడా మాలితో కుమ్మక్కయిందన్నమాట.

"సూస్కోవాల తల్లీ. రాముడు గూడ పెద కాలాసుకొచ్చినాడు. నానూ కాలీజికీ పొద్దున్నే ఎల్తే సాయంకాలానికొస్తాను. మరీ ఆడూ అంతే గంద. మరి ఇది కూడా ఇస్కులికెల్లిపోతే ఇంటికాడెవరుంటరు? మాకేంవీ ఆస్తుల్లేవు గానీ ఆ ఉన్న రొండు బొచ్చెలు ఎత్తుకుపోయే యెదవలు వస్తన్నరు ఆకుల్నాకీవోడికి మూతుల్నాకీవోడ్నాగే. అయ్యయ్యో సూసీరా కార్లు నడిపీ యదవలు మడుసుల్ని కానుకోరు. మాసీతమ్మ పక్కన నడాపోతే ఏమైపోయీవోరూ. రోడ్డుమీన ఒక శెనం పరాగ్గా ఉన్నా పైసలయిపోతరు .."

మాలి మాటలు వినడం మానేసి సీతా కృష్ణా కబుర్లు చెప్పుకుంటూ ఇంటిదాకా వచ్చేసేరు.

సరోజమ్మ వీధిగుమ్మందగ్గర స్తంభాన్నానుకుని కన్నాకోసం ఎదురు చూస్తోంది. కూతుర్ని చూడగానే భయంస్థానంలో విసుగూ, ఆపైన చిరాకూ దరిమిలా కోపమూ వచ్చేసేయి ఆవిడకి.

"ఏఃవేఁ అర్థరాత్రిదాకానా ఆటలు? చీకటి పడకముందే కొంప చేరాలని తెలీదు," అంటూ కసిరింది.

"వస్తున్నా కదా," అంది కన్నా మెల్లిగా.

మాలి అమ్మగారిదగ్గరా, కృష్ణ సీతదగ్గరా శెలవు తీసుకుని వెనుదిరిగేరు.

"నువ్వు చెప్పమ్మా సీతని స్కూలికి పంపమని," అని కృష్ణ అంటుండగానే ఎటు వాళ్ళు అటు పోయేరు. కన్నా తనగదికి వెళ్ళి బట్టలు మార్చుకుని భోజనానికొచ్చేసరికి, అప్పటికే తమ్ముడు భోజనం చేసి వెళ్ళిపోయేడు.

000

[(1) అమెరికా సంగతి ఆరుద్ర కవిత ఆధారం అనుకుంటాను. ఏదో పద్యంలో "ఎక్కడ ధర్మగ్లాని జరిగినా అమెరికావారు తయారు" అని చదివినట్టు గుర్తు.]

(జులై 9, 2016)

(2వ భాగం)

సరోజమ్మ దేవీస్తవం చదువుకుంటూ హడావుడిగా వంటింట్లోకీ పెరట్లోకీ తిరుగుతోంది. తులసిమొక్కముందు నాపరాతిపలక చేత్తో తుడిచి, నీళ్ళ జల్లి బియ్యప్పిండితో ముగ్గు పెడుతోంది. కన్నా వచ్చి కాఫీ అడిగింది. "వంటింట్లో ఉంది, తీసుకో," అని చెప్పి, ముగ్గు పెట్టడం ముగించి హడావుడిగా ఆవిడ కూడా వంటింట్లోకి వెళ్ళింది. ఉదయం ఏడున్నరవుతోంది.

"వాడొచ్చేడేమో చూడు," అని కన్నానుద్దేశించి ఓ కేక వేసి కూర తరగడానికి కూచుంది కత్తిపీటముందు.

సీత వెనుదిరిగి ఓమారు చూసి, కాఫీ చప్పరిస్తూ "లేదు" అంది.

"అలా వీధిగుమ్మంవరకూ వెళ్ళి చూసి రా. అరిగిపోవు. ఝాం పొద్దెక్కినా పువ్వులు తేకపోతే పూజెలా అవుతుంది, వంటెప్పుడవుతుంది," అందావిడ చిరాగ్గా.

తల్లికోపం చూసి కన్నాకి కోపం వచ్చింది. వీధిగుమ్మంవరకూ వచ్చినవాడు లోపలికి రాడూ? రుసరుసలాడుతూ వీధిగుమ్మంవరకూ వెళ్ళి, ఆపైన కనిపించినంత మేర చూసి వచ్చి, "లేదు" అంది.

సరోజమ్మ ఆ పూటకి తులసీదళాలతోనూ పసుపూకుంకుమలతోనూ పూజ కానిచ్చి పని అయిందనిపించుకుంది. కన్నా అన్నం తింటుంటే, "స్కూల్లో రాముడు కనిపిస్తే అడుగు పువ్వులెందుకు తేలేదో," అంది సరోజమ్మ.

కన్నా సరేనంది కానీ తీరా స్కూలికెళ్ళేక ఆ సంగతే జ్ఞాపకం లేదు. సరోజమ్మకి కూడా మర్నాడు మళ్ళీ పూజవేళకే గుర్తొచ్చింది. భర్తతో చెప్పింది. ఆయన కాలేజీ ప్రిన్సిపాలు. కనుక్కుంటాలే అన్నారు కానీ ఆయనకసలు కాలేజీకి వెళ్ళింతరవాత ఇంటిసంగతులేమీ గుర్తుండవు. ఇంక పూజాసుమాలసంగతి వేరే చెప్పాలా?

మర్నాడు మాలి తమఇంట పూసిన తొలి ఫలసంపెంగ తీసుకొచ్చేడు సరోజమ్మకోసం. వాడిమీద అరిచిందావిడ, "ఏరా రాముడుగాడు పూలు తేడం మానేసేడు. ఏం అబ్బాయిగారి పాంటివ్వండి, షర్టివ్వండి అంటూ ఇంటిచుట్టూ తిరుగుతాడు. పూజకి నాలుగు పువ్వులు తేడం మాత్రం కష్టవా?"

మాలి, "నేను కూడా చెప్పేనమ్మగోరూ, ఇండంలేదు. ఆడికి నామోసీగా ఉందంటడు పూలు తెచ్చీనానికి. నాసెల్లని కూకుడుండిపోనాడు."

సరోజమ్మ ఆశ్చర్యపోయింది, "ఔనా? పువ్వులు తెస్తే నామోషీవా?"

"ఏటో ఆడిగోల ఆడిది. ఇండంసేదమ్మగోరూ. ఇస్కూల్ల పిల్లగోల్లెవరో సూసి ఏటి ఆరింట పాలికాపు పన్సేస్తన్నవ అన్నారంట. నాన్సప్పినానండి. అంటె తప్పేటి పాలికాపులంగాక మంతుర్లవాఁ ఏటని. ఇనకున్నడు. ఏసీ ఆడిమాట ఒగ్గీండి. రెపుట్నుంచి నానొట్టుకొస్త. పూజకి పూలట్టుకొస్తే మన గోరవం కొరవడతాదేటి. అస్లు నన్నడితే పున్నెంపే గద."

"ఓరి వెధవా. నాకళ్ళముందు పుట్టేడు అంతవాడయేడా? పువ్వులు తెస్తే అవమానమా? ఊరికే తెస్తున్నాడేమిటి? బిళ్ళకుడుముల్లా నెల తిరిగేసరికి రెండు రూపాయలు పుచ్చుకోడం లేదూ? ఆ పైన పిల్లాడిబట్టలు చిరుగైనా పట్టని పాంట్లూ చొక్కాలూ వాడి ఎదాన కొట్టడం లేదూ?"

"ఏస్లేండమ్మా, సిన్నకుంక. ఆడికేటి తెలుస్తాది మరేద. నానైస్తనంటన్న గంద."

సరోజమ్మ మరో వరస మాలినీ, రాముణ్ణీ, వాళ్ళజాతినీ తిట్టిపోసి లోపలికి వెళ్ళిపోయింది. మర్నాడూ మూడోనాడూ మాలి తెచ్చిచ్చేడు పూలు. నాలుగోరోజు రాలేదు. ఐదోరోజు వచ్చినప్పుడు నాలుగోరోజు రానందుకు సంజాయిషీ ఇచ్చుకున్నాడు. ఆరోరోజు ఆలోస్యంగా వచ్చేడు. ఏడోరోజు, ఎనిమిదోరోజు కనిపించలేదు. పధ్నాలుగోరోజు రాలేనని పదమూడోరోజు చెప్పేడు. ఒక్కమాటలో ఆవిడకి పూలు ఖచ్చితంగా ప్రతిరోజూ అందడం లేదు.

"ఆ బాబు కాలీజీ ప్రిన్సిపాలు అవుతే మాఅయ్య కాలీజీలో తోటమాలి. ఆయమ్మ ప్రిన్సిపాలు గాదు. నాను ఆయమ్మ బంట్రోతుని గాను. నానెందుకు ఆఁవెకి దినమూ పూలు తీసికెల్లాల?" అని రాముడుగాడు ఎవరితోనో అన్నాడని, వాళ్ళు తనకి చెప్పేరని కన్నా తల్లికి చెప్పింది.

రాముడుగాడ్ని నిలేసి అడిగితే తానలా అనలేదనీ, తాను అలా రోజూ పూలు తెస్తున్నందుకు మిగతా పిల్లలు గేలి చేస్తున్నారనీ, అది తనకి చిన్నతనంగా ఉందనీ చెప్పేడు.

000

కొత్త క్లాసు, కొత్త పుస్తకాలు, తలకి మించిన homework వీటితో కృష్ణ గమనించలేదు కానీ సీతని తరుచూ కలవడం పడడం లేదు. మొదట్లో పది రోజులపాటు సీతఇంట్లో కృష్ణ, కృష్ణఇంట్లో సీతా కనిపించేరు కానీ అనతికాలంలోనే తగ్గిపోయింది. కలిసినప్పుడు కూడా ఎంతసేపు చెప్పినా స్కూలు విషయాలు - తానక్కడ ఏం చేసిందో, ఏ మేష్టరు ఏ ప్రశ్నలు వేసేరో, ఏ పిల్లలు ఏ మేష్టరుని ఎలా ఏడిపించేరో గంటా గంటన్నరసేపు చెప్పి ఆ తరవాత, "నువ్వు మాటాడవేం?" అనడిగేది.

సీత నీరసంగా "ఏం మాటాడను?" అనేది. "ఏంవుంది మాటాడ్డానికి?" అనేది. కృష్ణ మూతి ముడుచుకు వెళ్ళిపోయేది. తనకే తెలియకుండా సీతకి దూరం కాసాగింది.

000

ఓరోజు సీత కృష్ణకి రోడ్డుమీద కనిపించింది. హఠాత్తుగా అనుకోకుండా నాలుగు రోజులతరవాత సీత కనిపించడంతో ఎక్కడలేని అభిమానం పొంగి పొర్లింది కృష్ణమనసులో. "సీతా" అంది ఉక్కిరిబిక్కిరి

అయిపోతూ సీతభుజంమీద ఆప్యాయంగా చెయ్యేసి. "కనిపించడంలేదేఁవేమే?" అంది ప్రేమగా.
"అవుస్లే నేనెందుకు జ్ఞాపకం ఉంటానూ?" అంది నిష్ఠూరంగా.
సీత నిర్వికారంగా నవ్వి, "తీరలేదే?" అంది.
కృష్ణకి అర్థం కాలేదు. స్కూలూ హోంవర్కూ లేని సీతకి తీరనంత పనులేముంటాయి? సీత సూటిగా సమాధానం చెప్పలేదు.
"ఉండదనుకుంటే ఉన్నది, నేదనుకుంటే నేదు," అంది.
అంత ఎండలో మిట్టమధ్యాహ్నంవేళ అది ఎక్కడికి వెళ్తోందో కృష్ణకి అర్థం కాలేదు. సీత అప్పుడు చెప్పింది తాసిల్దారుగారింట్లో పనికి కుదిరిందిట. వాళ్ళమ్మాయికి కాఫీ, టిఫినూ పట్టుకెళ్తోందిట.
కృష్ణ మండిపడింది, "ఏదీ ఆ కోతిమొహం కోమలికేనా, పదోక్లాసులో ఉందీ? నువ్వు కాఫీ పట్టుకెళ్తున్నావా? సిగ్గు లేదూ?"
సీత మాటాడలేదు. అయ్యతో ఆ వాదనలన్నీ ఇంతకుముందే అయిపోయేయి. మాలి చెప్పేడు, "రేపో మాపో అమ్మాయిగోరు ఉజ్జోగం సేయరా? ఎవురు ఏం సేసినా ఆ పైసలకోసంవే గద. సిన్నకూలీ పెద్ద కూలీ అంతే యత్తేసం. ఇంక తాసిల్దారుగోరి బార్య పుట్టింట నాను పని సేస్తి. అమ్మాయిగోరు బూమ్మీద పడిన్నాటినుంచి నాకెరిక. ఉప్పుడు ఆరికి సాయం గావాలంత నాను ఒల్లగాదంటనా? మరియేదేనా? సీతని అంపుతాలే అంటి."
"ఛీ అదేం పని. చెయ్యనని చెప్పేసెయ్. నిన్ను స్కూలు మానిపించడమే చాలు. పన్లోకి తోల్తాడా. అదే రాముడయితే ఏం అనడా," అంది కృష్ణ.
సీతకీ తెలుసు కానీ ఏం చేయగలదు. రాముడు పువ్వులు పట్టుకెళ్ళడం అవమానం అంటే మాలి ఏం అనలేదు. తను తీసుకెళ్తానన్నాడు కానీ తనూ సరిగా చేయడం లేదు. మరి తనని మాత్రం వీళ్లింటికీ వాళ్ళింటికీ పనికి పంపొచ్చు!? తనూ అంతే. తండ్రి ఎంత చెప్తే అంతే. గట్టిగా చెప్పలేదు చెయ్యనని.
"సాయంత్రం ఓమారు రారాదూ?" అనడిగింది సీత కృష్ణని. కృష్ణఇంటికే వెళ్తే సరోజమ్మగారి అజమాయిషీలో కదలకుండా మెదలకుండా కూర్చోవాలి. సీతఇంటికే వస్తే ఇద్దరూ సరదాగా బీచికెళ్ళొచ్చు.
ఆ సాయంత్రం కృష్ణ వచ్చింది. ఇదివరకులా ఇద్దరూ అలలమధ్యకి వెళ్ళలేదు. సీతకి దిగులుగా ఉంది. సీతని చూస్తుంటే కృష్ణకి అదేమిటోగా ఉంది.
కనుచీకటి పడుతోంది. దూరంగా అలలమీద స్టీమర్లు కదిల్తున్న రాజప్రాసాదాలలా తేలిపోతున్నాయి. వాటిని చూస్తూ సీత చెప్పింది అయ్య ఊళ్లో లేడని. కృష్ణకి తెలుసు లేడని. క్రితంరోజు మాలి తల్లితో

చెప్తుంటే వింది కానీ కారణం తెలీదు. ఆమాటే అంది సీతతో. ఆ లోటు పూర్తి చేసింది సీత. అనకాపల్లిలో ఎవరో కుర్రాడున్నాడుట. మాటాడ్డానికి వెళ్ళేడు.
"ఏమిటీ? పెళ్ళా?" అంది కృష్ణ ఉలిక్కిపడి.
సీత మాటాడలేదు. దానికీ అలాగే ఉంది. తనఈడు పిల్లలంతా స్కూలికి వెళ్ళి చదువుకుంటున్నారు. అసలు ఎవరో చెప్పేరు అంత చిన్నవయసులో పెళ్ళి చేయడానికి గవుర్నమెంటోరు ఒప్పుకోరని.
"పోలీసులకి తెలిస్తే పట్టుకుంటారే," అంది కృష్ణ.
సీత నవ్వింది. మొన్నటికి మొన్న రంగయ్యమామ చేసుకోలేదూ? దానికి ఎనిమిదేళ్లే. దానిమాఁవ పోలీసే. పెళ్ళివేళకి దర్జాగా వచ్చి దీవించి వెళ్ళేడు. జరుగుతున్న పెళ్ళిళ్ళన్నీ పోలీసులకి తెలీకుండానే జరుగుతున్నాయా?
"అయితే నీకిష్టమేనా?" అడిగింది కృష్ణ మరేం అన్లేక.
"ఇస్టంవో కస్టంవో నన్నెవరడుగుతారు? అయ్యా రావుడత్తా ఎల్లేరు. ఆల్లే మాటాడుకొచ్చేత్తారు." ఆగొంతులో బాధ ధ్వనించింది. కృష్ణకి కూడా సీతని రక్షించడానికి ఏమైనా చేయాలనిపించింది. ఆ అసురుసంధ్యవేళ ఆ పిల్లలిద్దరికీ తమకేదో అన్యాయం జరిగిపోతోందని తోచింది కానీ అదేంవిటో దానికి ప్రతిగా ఏం చెయ్యాలో తోచలేదు.
"పోనీ, ఎక్కడికైనా పారిపోతేనో?" కృష్ణ సలహాకి సీత సావిత్రిలా నవ్వింది.
"ఇది సినిమా అనుకుంటన్నవేటి. కతల్లోనూ సినిమాల్లోనూ అవుతే ఆడాల్లు సాయిసం సేసి పారిపోతారు. గొప్పోల్ల ఇల్లల్ల బడతారు. పేంవించుకుంటారు. పాటలు పాడుకుంతారు. పెల్లి సేసేస్కుంటారు. నాలాటిది ఎక్కడికి పారిపోతాది? సంద్రంలోకి పోవాలంతే," అంది సీత.
"పోదూ ఒట్టి కబుర్లు చెప్తావు," అంది కృష్ణ కానీ దానికీ మనసులో బెరుగ్గానే ఉంది.
ఇద్దరూ దిగులుమొహాలతో ఇళ్ళు చేరుకున్నారు.
కృష్ణకి తల్లినడగాలనుంది సీతకి ఇప్పుడే ఎందుకు పెళ్ళి చేస్తున్నారని. కానీ తల్లి సరైన సమాధానం చెప్పదేమో. నీకెందుకంటుంది.
కృష్ణ మర్నాడంతా ఉదాసీనంగానే ఉంది. అలా ఉన్నావేం అని అడిగినా సమాధానం చెప్పలేదు. ఆ సాయంత్రం మళ్ళీ సీతదగ్గరికి వెళ్ళింది. మాలి ఇంట్లో లేడు. సీతా రావుడత్తా ఉన్నారు. కృష్ణని చూడగానే అమ్మాయిగోరు అంటూ రావుడు లేచి నిలబడింది. సీత గబుక్కున లేచి, కృష్ణచేయి పుచ్చుకుని పద అంటూ లాక్కుపోయింది.

దార్లో చెప్పింది. నిశ్చయం అయిపోయినట్టేనట. అబ్బాయి సన్నగా ఎర్రగా ఉంటాట్ట. స్కూల్లో ప్యూనుట. ఐదో ఫారంవరకూ చదివేడుట. ఇల్లుందిట. ఆదివారం పెళ్ళిచూపులకొస్తాట్ట. సీతమొహంలో సిగ్గుతెరలు లీలగా గోచరించేయి కృష్ణ అమాయకపుకళ్ళకి. అయినా ఊహలు మాత్రం తక్కువేం లేవు.

"అది కాదే మరి నువ్వు ఒప్పేసుకుంటావా? ఇంకా చూడలేదు కదా," అంది. అడగడుగునా దానికి అభ్యంతరాలే గోచరిస్తున్నాయి.

"చెప్పేను కదా ఆదివారం వస్తన్నడని,"

"అవుననుకో. అప్పుడు నీకు నచ్చనడనుకో. అయినా చేసేసుకుంటావా?"

కృష్ణకి సీత ఒప్పుకోకపోతే బాగుండునని ఉంది. దానికి ఇష్టమే అనుకోడం కష్టంగా ఉంది. సీత కూడా ఆ ప్రశ్నకి సూటిగా సమాధానం చెప్పేస్థితిలో లేదు. "రానియ్. చూదాం," అంది.

000

అనుకున్న ఆదివారం వచ్చింది. కృష్ణ పరుగెత్తుకు వెళ్ళలేదు. సీతే పరుగెత్తుకు వచ్చింది. సీతమొహం చూడగానే కృష్ణకి తెలిసిపోయింది. సరోజమ్మ కూడా సరసమాడింది "మొగుణ్ణి చూసుకున్నావా?" అంటూ.

సీత ముసిముసి నవ్వులు నవ్వుతూ సిగ్గుగా తలొంచుకుంది. కృష్ణకి మాత్రం చాలా కోపం వచ్చింది. ఇద్దరూ డాబామీదికి వెళ్ళేక అడిగింది, "అంత బాగున్నాడా? బాగా తెల్లగా ఉన్నాడా?"

"తెల్లంగనే ఉన్నడు కానీ కుంచెం పొట్టి."

"అయితే నీకిష్టమేనన్నమాట."

"ఏమో కన్నా. నన్నడక్కు. నాకేంవిటో బయంగ ఉన్నది."

ముందంతగా చూడలేదు కానీ "తలెత్తు పిల్లా ముకం సూస్తం," అందిట అబ్బాయితల్లి. అలా తలెత్తి చూసినప్పుడే అబ్బాయిని చూసిందిట తను. అప్పుడే అబ్బాయి కూడా తనవేపు చూస్తున్నాట్ట. దాంతో తనగుండెలు టపటప కొట్టుకున్నాయిట. "రౌడీఏసాలు నాయెంక సూసి నవ్వినాడు," అంది సీత బుంగమూతితో. ఆ స్వరంలో కోపం లేదని కృష్ణకి కూడా తెలిసిపోయింది.

మర్నాడు మాలి వచ్చి నిశ్చితార్థం చేసుకున్నాం అని చెప్పేడు సరోజమ్మతో. వాడు తనదగ్గర దాచుకున్న వంద రూపాయలూ తెచ్చి ఇచ్చింది. మరో ముప్ఫై ఇచ్చి పిల్లకి ఏమైనా కొని పెట్టమని చెప్పింది. మాలి ఆ డబ్బు అందుకుని కళ్ళకద్దుకుని, అమ్మగారికి దణ్ణం పెట్టి పదికాలాలపాటు సల్లగుండు తల్లీ అన్నాడు. ఖర్చులకోసం వెయ్యి రూపాయలు అప్పు చేసేట్ట. చీటీ కట్టిన ఐదువందలు, మరో ఐదు వందలు. కుర్రాడికి వాచీ, సైకిలు ఉంగరం కొనిస్తాట్ట. పిల్లకి బంగారు కమ్మలు పెడతాట్ట. అంతకంటె నాసేం సేయలేను అన్నాడు. అంత పెట్టగలిగినందుకు వాడికి

సంతోషంగా ఉంది. అంతకంటె ఎక్కువ పెట్టలేనందుకు బాధగా ఉంది. పెళ్ళి చేస్తున్నానన్న పొంగు ఉంది. చేసి పిల్లని పంపేయాలి కదా అన్న వ్యథ ఉంది. పెళ్ళికి నువ్వు తప్పకుండా రావాలని కృష్ణకి నొక్కి నొక్కి చెప్పింది సీత.

పెళ్ళి నూకాలమ్మగుళ్ళో చేసేరు. సీత స్వయంగా కృష్ణనే కాక హెడ్ మాస్టరుగారినీ, మనూని, మిగతా క్లాసు పిల్లల్నీ కూడా పిలిచింది. పిల్లలందరూ చందాలేసుకుని స్టీలు పళ్ళెం కొనిచ్చారు. కృష్ణకి సీత నచ్చింది కానీ దానిచుట్టాలు నచ్చలేదు. వాళ్ళ మాటలు, తీరు, అలంకరణలూ అన్నీ దానికి అసహ్యంగానే ఉన్నాయి. మొగపెళ్ళివారు మరీ ఎడ్డెమనుషుల్లా కనిపించేరు. పెళ్ళికొడుకు మాత్రం బాగున్నాడు. వాణ్ణి చూడగానే సీత ఎందుకు ఒప్పుకుందో అర్థమయిపోయింది.

పెళ్ళి బాగానే జరిగింది. సీత అత్తారింటికెళ్ళిపోయింది. వెళ్ళేముందు సరోజమ్మ ఇంటికొచ్చి ఆవిడకీ ప్రిన్సిపాలుగారికి కాళ్ళకి దణ్ణం పెట్టింది. సరోజమ్మ పళ్ళూ పువ్వులూ ఓ జాకట్టుగుడ్డా దానిచేతిలో పెట్టి దీవించేరు.

సీత కృష్ణని కౌగలించుకుని ఏడ్చింది. కృష్ణకి కూడా పట్టలేనంత దుఃఖం వచ్చింది. ఇద్దరూ ఒకరినొకరు మర్చిపోమనీ, ఉత్తరాలు రాసుకుంటూ ఉంటామనీ బాసలు చేసుకున్నారు. సిత వెళ్ళిపోయేక రెండురోజులపాటు కృష్ణకి అన్నం సయించలేదు. ఎవరితోనూ మాటాడ్డంలేదు. ఎక్కడ పడితే అక్కడ కూలబడి ఉసూరుమంటూ కూర్చున్న కూతుర్ని చూస్తే సరోజమ్మకి కూడా బాధగా ఉంది. ఆఖరికి ఆవిడ గట్టిగా నాలుగు చీవాట్లు వేసేక కృష్ణలో కొంచెం చైతన్యం కనిపించింది.

000

సీత దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అక్కడ చిన్న ఇల్లు అద్దెకి తీసుకున్నారుట. ఇద్దరూ బాగానే ఉన్నారుట. అన్నవరం, సింహాచలం వెళ్ళొచ్చేం అని రాసింది. వాడు చాలా మంచివాడుట. తనని ఎంతో బాగా చూసుకుంటున్నాడుట. ఇంచుమించు రోజు సినిమాకి వెళ్తున్నారుట.

కృష్ణ ఆ ఉత్తరం వందమార్లు చదువుకుంది. ఏవో కొత్త ఆలోచనలు రాసాగేయి. తెలుగు పుస్తకం చదువుదాం అని తీస్తే చేయీ చేయీ పట్టుకుని నూకరాజుతో సింహాచలం మెట్లెక్కుతున్న సీత కనిపించింది. సీత సిగ్గుపడుతూ నూకరాజువేపు చూసినట్టు చూస్తూ నవ్వినట్టు కూడా కనిపించసాగింది. సాయంత్రం సినిమాకెళ్తే సినిమాలో నాయకీనాయకులు సీతా నూకరాజులా కనిపించేరు.

పోస్టుకార్డు తీసుకుని సీతకి ఉత్తరం రాసింది. ఉత్తరంనిండా స్కూలు విశేషాలే. ఆ తర్వాత సీతదగ్గర్నించి మళ్ళీ ఏ కబురూ లేదు.

సీత ఊరు విడిచి వెళ్ళిపోయినరోజు కృష్ణ వెక్కి వెక్కి ఏడ్చింది పక్కమీద పడుకుని. నాలుగు రోజులు అన్నం తినలేదు. రెండు వారాలపాటు ఏదో పారేసుకున్నట్టు ఉసూరుమని కాళ్ళీడ్చుకు స్కూలికి వెళ్లొస్తుండేది. సరోజమ్మకి దిగులు పట్టుకుంది దీన్ని ఓదారికి తీసుకురావడమా అని. ఆఖరికి ఓ రోజు స్కూలినించి వచ్చి మధ్యగదిలో కిటికీదగ్గర కూర్చుని వేపచెట్టుమీద వాలిన కాకుల్ని చూస్తున్న కృష్ణని సరోజమ్మ, "ఇలా అన్నం నీళ్లూ మానేసి బెంగటిల్లిపోడమేవిటి ఎంత స్నేహాలయితే మాత్రం. ఎవరు మాత్రం ఎక్కడివాళ్ళక్కడ కలకాలం ఉండిపోతారేమిటి? నేనూ మీనాన్నా పుట్టడమే ఇలా ఇక్కడ పుట్టేమేమిటి? సీత కాకపోతే గీత మరో నేస్తం వస్తుంది. రేప్పొద్దున్న నువ్వు మాత్రం పెళ్ళి చేసుకు పోవూ మొగుడితో?" అంటూ గట్టిగా అరిచింది.

కృష్ణ తెల్లబోయి తల్లివేపు చూస్తూ, "స్కూల్లో రమణ, సీతాలక్ష్మి, జానకీ వాళ్ళందరూ నేను డాక్టరవుతాను, నేను ఇంజినీరవుతాను అని ఏవేవో చెప్తున్నారు. నేనేం అవుతానా అని ఆలోచిస్తున్నాను," అంది.

ఈమారు తెల్లబోవడం సరోజమ్మవంతు అయింది. పిల్లలు ఎంతలో ఎదిగిపోతారూ అంటూ విస్తుపోయిందావిడ.

000

(జులై 9, 2016)

# 12. నీబలం నీకు తెలీదు

"ఏటాలోసన?" అంది సంధ్రాలు నామొహంలోకి గుచ్చి చూస్తూ.

గుప్పెడు పళ్ళు పట్టుకు వచ్చింది. ఇటొస్తూ దారిలో కనిపిస్తే కోసుకొచ్చిందిట. ఆ వెనకే తారకం కూడా వచ్చేడు.

"చాలాకాలం అయింది కనిపించి. అంతా పనేనా?" అన్నాను అతడిని చూస్తూ.

"లేదండి. మాఊరికెళ్ళేను చూసి చాలాకాలం అయిందని."

"జాగిలోరు గొప్ప గొప్ప పీచీలు సెప్తాడు నిద్దరోతున్న జాగిలాలని ఉసి గొలిపినట్లె. అయి ఇనీస్తే నీకు గొప్ప బలవుం వొడుసుకొచ్చీస్తాదన్నమాట, అనుమంతులోరినాగ. బాలసెందురుడిని శానమ్మ ఎత్తివొడవలే? అనాగె. అపుడు నివ్ గబుక్కుని లేడిపిల్లనాగ లేసీసి రంగంనోకి ఉరికీసి ఎంతో గనకార్యేలు సాదించేస్తవు ఆపైన."

తారకం అయోమయంగా నావేపు చూసేడు, "జాగిలోరా?"

"Zig Zaglar అని సుప్రసిద్ధ ప్రోత్సాహక ఉపన్యాసకుడు. నువ్వు చాలా బాగా రాణించగలవు, నీకు చాలా శక్తి ఉంది అని అందరికీ మాటలు చెప్తూ లక్షలార్జించేడు."

"ఆయన్ని మీకు తెలుసా?"

నేను మాటాడలేదు. నాజీవితంలో అది గర్వపడదగ్గ సంగతిగా నేను భావించను. నేను చేసినవన్నీ చిన్న ఉద్యోగాలే అయినా కొన్ని చెప్పుకోడానికి నాకు మొహమాటం లేదు. కొన్ని మాత్రం తలుచుకుంటే నామనసు కుతకుత ఉడికిపోయి కూలబడిపోతుంది.

"అదేటిమాట. నీబిడ్డ సెప్పుకుంటాది గద గొప్పగ మాయమ్మకి నొంత కుంపెని ఉండీదని."

నేనూరుకున్నాను సందిగ్ధంగా తలూపి. అది చెప్పుకుంటుంది. తల్లి ఏం చేసినా పిల్లలకి గొప్పగానే ఉంటుంది మరి.

"అయితే మీకు పనికిరాలేదేమిటి ఆయన ప్రోత్సాహక వాక్కులు?"

ఆఖరికి నోరు పెగిలింది నాకు. "సంధ్రాలంటున్నది అది గాదులే. ఆసభలో జరిగిన మరో కత."

"ఆ కత గూడ సెప్పరాద?"

"నువ్వే చెప్పు."

"చెప్పండి మరి," అన్నాడు సంధ్రాలువేపు తిరిగి, కుర్చీలో సద్దుకు కూర్చుని.

సంధ్రాలు నావేపు చూసింది చెప్పనా అన్నట్టు. నీఇష్టం అన్నట్టు తలా చేయీ ఆడించేను. నిజానికి నాకైతే ఆ జీవితం సిగ్గుగానే అనిపించినా ఆ సంఘటన మాత్రం తమాషాగా చెప్పుకోడానికి బాగానే ఉంటుంది మరి.

సంధ్రాలు మొదలు పెట్టింది తారకం ఎదుట కూర్చుని. "ఈయమ్మ యాపారం సేసిందని తెల్సు గద. యాపారాలోల్లు ఈ సబలు బెడతరు. యాపారాల్లో మెలుకులు సప్తెరంటరు. నిజింగ అయి అందురుకి పనికొస్తనుకోమాక. అందుల కిటుకదె. నీకు ఏంవీ అరతం గాకున్నా ఏదో ఉండాది గావల అనుకుంతవు నివ్. అదన్న మాట నిజింగ జరిగీది."

"ఈమెగారికి ఆయనమాటలు నచ్చలేదంటారా?" తారకం అన్నాడు విసుగు కనపడనీయకుండా.

"ఆ బాబు నీకు ఎంత బలంవున్నదో నీకు తెలీదు నాను సూపిస్త. నాకు అసింటొకరు గావాల, ఎవురొస్తరు? అనడిగినాడు. ఎవురూ సేయెత్తనేదు. అప్డు ఈ యమ్మ నానొస్తనంట లేసింది."

తారకం నావేపు నమ్మలేనట్టు చూసేడు. "మిగతా అందరూ ఏమవుతుందో అన్న భయంతోనే కదా ముందుకి రాలేదు."

"అదే మరి. అందురూ బయపడీనోటికి ఈయమ్మ ఉరుకుతూ పోతాది."

"ఆ తరవాతేమయిందయితే?"

"ఆ బాబు నీకేమైనా ఆపరేసనులు అయీ అయినాయా అని అడిగీడు. ఈమే నేదన్నాది. సరి రమ్మని యేదికమీదికి తీసుకుపోనాడు. ఆడ రొండు కొయ్య కురిసీలు యెనక్కి తప్పి ఎడంగ అమర్సినాడు. ఆటిమజ్జన ఈమెని నిలబడమన్నాడు. ఆయెంట యేయో మంతరాలు సదివి, ఈమెని ఎత్తి ఆ కురిసీలమీన పండబెట్టినాడు, ఓ కురిసిమీన మెడ, రొండో కురిసీమీన మడమలూని. అంటే మజ్జన మెడనించీ కాలవర్కూ దన్ను నేకండా."

తారకం కళ్ళు మరింత విచ్చుకున్నాయి.

"ఆయన మరోకురిసీమీన కాలేసి, ఈయమ్మ పొట్టమీదికెక్కి నిలబడ్డాడు. 'సూసేరా ఈమెబలం' అన్నడు. జనాలు నోరెల్లబెట్టి కిక్కురుమనకండ సూస్తన్నరు. మరి ఈయమ్మేంవో వంద పవున్లన్నదో నేదో. ఆయనేంవో నూటఎనబయి పవున్లుంటడు."

తారకం మొహంలో ఆశ్చర్యం, అనుమానం, భయం ఒక్కుమ్మడిగా ముంచుకొచ్చేయి.

"మీకెంత ధైర్యంవండీ!" అన్నాడు నావేపు తిరిగి.

"ధైర్యం కాదు. నేను అట్టే ఆలోచించను. ఏమవుతుంది మహా అయితే .. అని."

"మహా అయితే ... ఆ తరవాత ఏం అనుకున్నారు? పూర్తి చెయ్యండి మరి."

"ఏం లేదు. అది తరవాత కదా తెలిసేది. అంచేత మహా అయితే ...అనుకునేసి ఊరుకుంటాను."

"ఏదీనైన ఈయమ్మ అంతె. కిందటోరం అయేటో పల్లు ఏటో తెలీకండ తినీసింది."

"ఏం పళ్ళండీ?"

"తెలీదు," అన్నాను తల అడ్డంగా ఆడిస్తూ.

"ఇప్పటికీ తెలీదా?"

"తెలీదు. నాచిన్నప్పుడు మాయింట్లో రకరకాల పళ్ళచెట్లుండేవి. ఆ చెట్లకింద తిరుగుతూనో చెట్టెక్కో అందిన పండు కోసుకుతినడం నాకు అలవాటే కదా. అంచేత ఏ పళ్ళచెట్టు చూసినా ఓ నిముషం ఆగి ఆ కాయలేమిటో అనుకోకుండా ఉండలేను. ఈ కాయలు కనిపించినప్పుడు కొంచెం ఆలోచించేను కానీ ఏమయితే అయిందిలే అనిపించి ఓ పచ్చికాయ కొరికి చూసేను. వగరుగా ఉంది. సరే ఇది పచ్చికాయన్నమాట, అనుకుని ఎర్రగా ఉన్నది దోరపండు అనుకుని కొరికి చూసేను. తియ్యగా బాగుంది. మొత్తమ్మీద ఆకుపచ్చ, పసుప్పచ్చ, పసుపూ ఎరుపూ, ఎర్రటి ఎరుపూ మొత్తం గుత్తులు గుత్తులుగా నయనానందకరంగా ఉన్నాయి కదా అని ఫొటో తీసేను. మర్నాడు మా పొరుగువారికి బొమ్మ చూపించి అడిగితే, కాయలు తీసుకొచ్చి చూపమన్నారు. సరే మళ్ళీ వెళ్ళి ఓ చిన్న సంచీలో గుప్పెడు కాయలు తీసుకొచ్చేను. ఇద్దరికీ తెలీదుట అవేమిటో. ఒకావిడ తిని చూసి తెలీదంది. రెండో ఆవిడ తిని చూడడానికి కూడా ఒప్పుకోలేదు. "నీలా నాకు ధైర్యం లేదు. అవేమిటో తెలీకుండా నేను తినను," అన్నాను నవ్వుతూ.

"నవ్వుతారేమిటి. నిజమే కదా," అన్నాడు తారకం.

"చెప్పేను కదా మూడు రోజులయింది నేను తిని. నాకేం కాలేదు."

"కొన్ని పరిణామాలు వెంటనే కనిపించవు. మనజాగ్రత్తలో మనం ఉండాలి."

"ఆమధ్య ఇండియానించి ఒకావిడ వచ్చింది మాయింటికి నాలుగేళ్ళ కొడుకుని తీసుకుని. ఇద్దరం ఇంటిముందు వాకిట్లో తిరుగున్నాం. ఆ అబ్బాయి చెట్టుకింద రాలిన ఆపిల్ తీసుకుని కొరికేడు. నేను చూసి ఉండు, కడిగిస్తాను అన్నాను. ఆ తల్లి ఏమందో తెలుసా?"

"ఏమంది?"

"తిననీ. immune system అలాగే వృద్ధి అవుతుంది అని."

"అలాటి వితండవాదనలవల్లే మనదేశంలో రోగాలు రొచ్చులూ."

"జాగర్తలో ఉండాల్లే. అవుతే అదే పనిగా సిన్నా సితకా పెతీదానికీ పానాల పోతాయన్నట్టు గాబరా పడరాదు. ఈ సుట్టుపట్ల పలవృచ్చాలు శానా ఉన్నయి. అంటే యేటీ, ఎనకెవురో పెద్దోలు మంచీ సెబ్బరా ఆలోసించి పల్లసెట్లు నాటినారని తెలస్తన్నది. నీకెరిక నేదేమో. అమిరికల జ్నీ ఆపుల్సీడు

అని ఒకాయన దేసంనిండ ఆపులు యిత్తనాలు పాతుతా ఏోయినాడంట. మనదేసంల గూడ పల్లసెట్లు పాతీసీవోరు. అప్పట్లో ఊర్నించి ఊరికి నడిసిపోయేవోరు గంద. ఆలకి దారిల తింటానికని."
"అది గాదమ్మా. తినొచ్చు అని తెలిస్తే సరే. తెలీకుండా తింటే అవి విషం అయితేనో?"
సంద్రాలుకి కూడా చిరాకేసినట్టుంది, "సూడు బాబూ. నీకు తోసింది నివ్ సెయ్. నివ్ తినకు. నానేటి అంటన్నానో నాను సెప్పిను. అంతె. ఏటి తింటె ఏటవుతాదో అని బయపడీవోల్లెవురూ కొత్త ఇసియాలు గనిపెట్టలేదు గంద. బయపడీవోల్లు సుకంగ ఉండారు. ఆరికి కూడా రోగం, రొచ్చు వస్తాది గానీ ఆరు మందులూ మాకులూ తిని నయం సేస్కుంటరు. అవుతే పెపంచకంలో కొత్తగ ఒచ్చినయన్నీ ఎట్ట వొచ్చినయో సూసినవా నివ్వు? అందరూ నడిసీదారిల గాక ఉంకో దారిల నడిసి దయిర్యంగా ఎల్తరు. ఆలమూలంగనె మనకి కొత్త కొత్త మెసీనులూ అయ్యా ఒచ్చినయి. అదీ అస్సలు నిజం సత్తెపెమానం," అంది సంద్రాలు వెళ్లడానికి లేస్తూ.
తారకం మొహం ఉల్లిపొరకాయితంలా పాలిపోయింది.
అతనికీ నాకూ కూడా తెలుసు సంద్రాలు మాటల్లో ఆంతర్యం, "ఏ పిరికివాడూ ఏ ఘనకార్యమూ సాధించలేదు."
తారకం రెండు నిముషాలు మాటాడకుండా కూర్చున్నాడు. తరవాత ఆలోచిస్తూ మెల్లిగా లేస్తూ, "ఆ జాగిలోరి ఉపన్యాసం మీకు ఆ పండు తినే ధైర్యం ఇచ్చి ఉండాలి. నిజం చెప్పండి. అవును కదూ?" అన్నాడు.
అతనిమొహంలోకి గుచ్చి చూసేను. ఏదో ఒక ఆసరా కావాలి ఈరాత్రి సుఖంగా నిద్రపోవాలంటే అన్నట్టున్నాయి ముఖకవళికలు. అది పాడు చేయడానికి నేనెవర్ని?
నవ్వేసి ఊరుకున్నాను.
000
(ఆగస్ట్ 30, 2016)

# 13. ఔతె నాకత ఏటంటావూ?

అది యొక కీకారణ్యము. అంబరము చుంబించు వృక్షశ్రేణితోనూ, వాడి ములుకుల చెలగు గుబురు పొదలతోనూ, ఎల్లెడల గజిబిజిగా అలుముకొనిన లతలతోనూ చూచువారికి భీతి గొలుపుచున్నది. క్రూరమృగములు విచ్చలవిడిగా సంచరించుచు మానవులకిది ఇరువుకాదని చాటి చెప్పుచున్నట్టు భయంకరముగా హుంకారములు సలుపుచున్నవి. అట్టి కాననమున పదునొకండు వత్సరముల బాలిక యొకర్తు దారి తప్పిన హరిణకిశోరమువలె బెదురు చూపుల చూచుచు తిరుగాడుచున్నది. అకటా, ఈ మానవులెంత దయావిహీనులు. పట్టుమని పండ్రెండు వత్సరములైనను లేని చిఱుతను ఏకాకించేసి, సింహములు, భల్లూకములు, మదగజములు విచ్చవిడిగా తిరుగు భయానక కీకారణ్యమున ఒంటరి చేసి విడువ దగునే!

ఆ బాలిక అవ్విధమున యా యడవిలో పరిదీనవదనయై తిరుగుచుండగా, గంగాజలమును గొను నెపమున ఆదారిన పోవుచున్న మునివరుడొకండు ఆ బాలికను గని రిచ్చ వడి, ఆ చిన్నదానిని సమీపించి, ఆదరము నొప్పు నెమ్మోముతో, నిట్టుల పలికెను, "బాలామణీ, దారి తప్పి ఇటకేతించిన హిమవత్పర్వతపుత్రికవో, బాల్యక్రీడల అటనిట పరువులెత్తుచు కందుకము వెదకు నెపమున ఇయ్యెడకేతించిన జనకరాజతనయవో, సాక్షాత్ రాజరాజేశ్వరీదేవి ఇంట వెలసిన పట్టివో అననొప్పు ఎవతెవీవు? ఈ కాననమున ఒంటరిపై చరింపదగునే? నిను గన్న తల్లిదండ్రులు నిన్ను గానక వెత చెంది నీకై ఎంతగా పరితపించుచున్నారో గదా. రమ్ము, నిన్ను తోడుకొని బోయి వారికిని నీకును ఉపశమనమును కలిగింతు."

లోకబాంధవుడైన పరమశివుడే ఈ రూపమున తన వెత దీర్ప అవతరించెనేమో యన బ్రహ్మతేజస్సుతో అలరుచున్న ఆ మునిసత్తముని ముఖారవిందమును గని, మనమున ఆందోళనము నెమ్మదింపగ, ఇంచుక సాంత్వన బొందినదయి, ఆ బాలామణి ఇట్లు నుడివెను, "మునివరా, మిమ్మలను గని, తమ చల్లని భాషణలు విని నామానసము పరమపవిత్రమైన గంగాజలములో తనిసినరీతి ఉపశమనము బొందినది. మహాత్మా, ఏను ఎవరినో, ఇచటికి ఎట్లు వచ్చితినో ఎరుగనైతిని. మూడు దినములుగా దిక్కు తెలియక తిరుగుచూ, ప్రాంతమున లభించిన కాయలతోనూ స్వాదుజలములతో ఆకలి, క్షుత్బాధలను దీర్చుకొనుచు పొద్దు పుచ్చుచుంటిని. తమ్ము జూడ త్రికాలజ్ఞులని దోచుచున్నది. నా జన్మవృత్తాంతమును తెలిపి నన్ను కృతార్థురాలని సేయుమని

అర్థించుచున్నాను," అనుచు ఆ బాలిక అంజలి ఘటించి, ఆమునిపాదములు తాకి అభివాదము సేసెను.

ఆ మునిశేఖరుండును పరితృప్తుడై, తన యోగదృష్టిచేత ఆ కౌమారి జన్మవృత్తాంతమును ఎరిగినవాడై, ఇట్లు పలికెను, "కౌమారీ, నీ జన్మవృత్తాంతము ఏను నాయోగదృష్టిచే ఎరిగితి."

000

తుళ్ళి పడి లేచి కూర్చుని చుట్టూ చూసేను.

"ఏటి కలా? రాచ్చసులూ, దెయ్యాలూ సూసినావేటి?" నాభుజాలు పట్టుకు కుదిపి లేపి సంధ్రాలు నవ్వుతూ అంది.

మళ్ళీ పరీక్షగా చుట్టూ చూసేను.

ఇది దండకారణ్యం కాదు.

నావయసు పదకొండు కాదు.

ఎదుట నిల్చింది బ్రహ్మతేజస్సుతో వెలుగుతున్న మునివరుడు కాదు,

సంధ్రాలు! మొహంలో మాత్ర ఆ కళలు కనిపిస్తున్నాయి, జటాజూటమూ, గడ్డాలూ, మీసాలూ తక్కువగా.

మళ్ళీ చూసేను గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చుకుని కూర్చుంటూ. నాజన్మవృత్తాంతం తెలీకుండా కలలోంచి లేపేసినందుకు సంధ్రాలుమీద కోపం వచ్చింది కూడా. కానీ, ఏంచేస్తాం. కష్టాల్లాగే కలలు కూడా చెప్పి రావు కదా. రమ్మన్నప్పుడు అసలే రావు.

"నీనించి నేనెలా ఎందుకు ఇక్కడ అవతరించేనో తెలీకుండా పోయింది," అన్నాను విసుగ్గా.

"నాను సెప్తాలే."

ఆహా, నా అంచనా తప్పు కాదన్నమాట. కలలోని సర్వజ్ఞుడయిన ఋషిపుంగవుడే సంధ్రాలు.

"నివ్ ఈ బూనోకంల అవుతరిచ్చకమున్ను బెమ్మగారి బారియగారికి ఇస్టసకిగ ఉండీదానివి. ఆయమ్మకి నివ్వంటె సానా ఇస్టం కూడా ఉండీది. అవుతే నివ్ ఇప్పట్నాగే అప్పుగూడ ఆసికాలాడీదానివి. మూర్కం, బుద్ది నేదు. గండ్రతనం ..."

"సరే అర్థమయింది నేనెలాటిదాన్నో. ఆ తరవాతికథకి పద."

సంధ్రాలు కిలకిల నవ్వి, "సంపెస్సుగ ఉంటాదనీ."

"ఆహా సస్పెన్సు కావలసినంత కూడింది. ఇక కథ ముందుకి సాగకపోతే చదివేవాళ్ళు ఇక్కడ్నించి లేచిపోతారు."

"ఓ పాలి సరస్పతమ్మోరు పజ్జాలు సదూతున్నది. నివ్వు అది గాదు అంట సాచ్చాత్తు చదూలతల్లిని తప్పు పడితివి."

"అయ్యో అలా చేసేనా?" అన్నాను నొచ్చుకుంటూ. నిజమే మరి. సాక్షాత్తూ వాగ్దేవిని నేను తప్పు పట్టడమేమిటి, పొగరు కాకపోతే.

"ఆదీ మరి. ఆయమ్మ గూడ నీకింత పొగరు తగదు, నివ్వెల్లి బూలోకంలో యేరేవోల్లకి రాయనం, సదగడం సెప్పుకంట బతుకు అని సాపం ఇచ్చేసినాది."

అయ్యోయో ఎంత ఘోరం జరిగిపోయింది. మరి శాపవిముక్తి ఏమిటి అని నేను అడగలేదా? అనుకుంటూ మోకాళ్లమీద తల ఆన్చి కొంచెంసేపు అదేదో సినిమాలోలా ఏడ్చి, అదేమాట సంధ్రాల్ని అడుగుదాం అనుకుంటూ తలెత్తాను.

సంధ్రాలు మాయమయిపోయింది.

నా జన్మవృత్తాంతం కొంత తెలిసింది కానీ సొంతం తెలీలేదు. నాకు తెలిసిన అన్ని కథల్లోనూ శాపం పొందినవాళ్ళంతా విముక్తి కూడా పొందేరు కదా మరి నామాటేమిటి అని ఇంకొంచెంసేపు విచారించి, మైసూరు బోండా చేసుకునే పనిలో పడిపోయేను.

000

(రెండోభాగం.)

ఇదంతా ఎలా మొదలయిందంటే వారం రోజులక్రితం, నా కిండిల్ రీడరులో ఓ పుస్తకం కనిపించింది. పుస్తకం పేరు కథకుల గాథలు. రచయిత వేదం చంద్రశేఖరయ్యగారు. ఆయన వేపేరీ, మద్రాసులో ప్రధానాంధ్రోపాధ్యాయులు. ఐదవ, ఆరవ ఫారం పిల్లలకి పాఠ్యగ్రంథంగా ఉపయోగపడడానికి వీలుగా సరళమైన భాషలో రచించేరు 1956లో. కథాంశం బృహత్కథకి అవతారికలో ప్రస్తావించిన వరరుచి, గుణాఢ్యుల కథలు. పుస్తకం చివర ప్రశ్నలున్నాయి. గుండెమీద చెయ్యి వేసుకు చెప్పాలంటే, మళ్ళీ పుస్తకం చూడకుండా జవాబులు చెప్పలేను.

మచ్చుకు ఆనాడు సరళభాష అనదగ్గది ఇలా ఉంది

# వరరుచి

౧

సకల కులగిరుల నిరసించి, దేవతానికర నివాసభూమి యగు మేరువును బ్రతిఘటించి, యభ్రంకషంబుగ శృంగశృంగాటకములఁ బెంచి, కలశసంభవు శాపభయంబున నేలమట్టమయ్యుఁ, దన పూర్వపుటౌన్నత్యమును జాటు మహావృక్షములతోడను, గన్నులకు విందుగూర్చు పొదరింటిగుంపులఁ బ్రకాశించు సానువులతోడను, శిఖరములనుండి జాఱి మలకలై లోయలవెంట జలజలమని ప్రవహించు సెలయేటి తుంపురుల వహించిన పిల్లగాలులతోడను, తపోనిష్ఠాగరిష్ఠులైన మౌనివరేణ్యుల యోగసమాధి కాశ్రయభూతములైన గుహాసముదయముతోడను, శుకపికశారికాది శకుంతసంతాన నిరంతరానంద కలకల నినాదములతోడను, బిఱికిగుండియలవియునట్టి స్తనితసంకాశ భీషణఘోషంబుల సంచరించు మత్తమాతంగ పుండరీకవరాహమహిషాది క్రూరసత్త్వములతోడను నిండి వింధ్యాద్రి ప్రకాశించుచుండును.

ఈపుస్తకంలో నాకు పరిచయం లేని పదాలు కొన్ని కనిపించేయి. అప్పుడే నాకు ఒక చిలిపి కోరిక పుట్టింది. ఇప్పుడు నేను అలాటి శైలిలో రాయగలనా అని. చూదాం అని మొదలు పెట్టేను. ప్రారంభంలో మొదటి రెండు పేజీలు అదీ కథ.

ఆ రెండు పేజీలు రాయడానికి పదిమార్లు ఆంధ్రభారతి నిఘంటువు సంప్రదించేను. చెప్పొచ్చేదేమిటంటే, ముఖపుస్తకంలో నామిత్రులని తెలుగులో రాయమని ప్రోత్సహిస్తున్నాను. చాలామందికి నాతెలుగుమీద గొప్ప నమ్మకం. అది నిజం కాదని చెప్పడంకోసమే ఈ కథలాటి కథ.

000

నిజంగా జరిగిన కథ -

నా ఎదురుగా ఆరేళ్ళ రూప్మీ కూర్చుని పలకమీద ఏదో రాసుకుంటోంది.

తలెత్తి నన్ను చూసి కొన్ని తెలుగు పదాలు అడిగింది.తరవాత పలకమీద రాయమంది. బల్లకి చెరోవేపూ కూర్చుని ఉన్నాం.

నేను ముందుకి వంగి ఆ పలకమీద మొహం (తను అడిగినందున) అని రాసి ఉచ్చారణ కూడా చెప్పేను.

రూప్మీ పలకవేపు రెండు నిముషాలపాటు తేరి చూసి, "నావేపు నించా నీవేపునించా?" అనడగింది.

నేను నవ్వి, "నీవేపునించే అన్నాను," ఆ అమ్మాయికి ఆ సందేహం రావడం నాకు ఆశ్చర్యంగానే అనిపించింది.

ఇది శాపం కాదేమో అని కూడా అనుకున్నాను ఆ క్షణంలోనే.

000

(సెప్టెంబరు 20, 2016)

# 14. నువ్వుండిపోతావేటి? ...

తెల్లారగట్ల నాలుగ్గంటలకి లేచి, ఫిల్టరులో వేణ్ణీళ్ళు పోసి, ముఖపుస్తకం తెరవగానే కనిపించిన మొదటివాక్యం "అమ్మ ఇక లేదు" అని. ఆ వెంటనే మరొక టపా, "ఇంకా ఇప్పుడే కాదు."

ఉలిక్కిపడ్డాను. ఎవరిని అంటున్నారో నాకర్థం కాలేదు. మనకి చాలమంది అమ్మలున్నారు. ఎవర్నో ఎందుకు. నన్ను కూడా చాలామంది అమ్మ అనే అంటారు కదా ముఖపుస్తకంలో. కానీ నేనింకా ఉన్నానని నాకు తెలుసు కనక మరో రెండు తెరపట్లు దిగేను మరెవరైనా స్పష్టం చేస్తారేమోనని. ఎక్కడా దొరకలేదు.

"నేనూళ్ళో ఉండను కానీ జయలలిత పోతే ఇదే నాసంతాపం."

సరే తెలిసింది. ఈ సంతాపాలు ప్రకటించడం ఎంత హాస్యాస్పదమయిపోయిందో అని కూడా అనిపించింది. అసలు RIP అని పెడితేనే నాకు చిరాగ్గా ఉంటుంది. ఆమాత్రం ఒక పూర్తి వాక్యం రాయలేనివాళ్ళు ఏమాత్రం విచారిస్తున్నట్టు అని. అంతకంటె ఘోరం ఒకరు పెట్టినపోస్టుమీద లైక్ కొట్టడం.

పైన చెప్పినవాక్యం "ఆవిడ పోయినప్పుడు ఇదే నాసంతాపంగా తీసుకోండి," అన్నవాక్యం చావుబతుకుల్లో కొట్టుకుంటున్న ప్రాణి చూస్తే ఏమనుకుంటుంది? సరే, ఎప్పుడో అప్పుడు నేను కూడా పోతాను కదా, ఇప్పుడే నాక్కూడా చెప్పేయి అని రాయాలనిపించింది నాకైతే. కనీసం నేను పోయేక ఎవరు ఏమనుకుంటారో నాకు ఇప్పుడే తెలుస్తుంది కూడాను.

ముందు చూసిన వాక్యం మళ్ళీ కనిపించలేదు. ఎవరో తొందర పడి పెట్టేసి ఉండాలి. ఎవరో చనిపోయేరని నాకు మొట్టమొదట తెలిసిందని చెప్పుకోవడంలో కూడా ఒక ఆనందం ఉందేమో. ఏమిటో ఈ చావుతో చచ్చే చావుగా ఉంది అనుకునే వాళ్ళు కూడా ఉండే ఉంటారెక్కడో.

000

ఈ చిన్నికత నాలో నిరంతరం చెలగే ఆలోచనలు మళ్ళీ రేపింది.

అసలు ఈరోజుల్లో చావు మాటెత్తితే హడలిపోయి జీవితం ఎంత ఆనందమయమో, ఎంత ఆనందంగా అనుభవించాలో చెప్పేవాళ్ళు ఎక్కువయిపోతున్నారు. నాకు ఇలా చెప్పేవాళ్ళు నాకు చాలామార్లే తటస్థపడ్డారు. నేను చావునీ బతుకునీ కూడా ఒక్కలాగే చూస్తాను. అసలు ఇప్పుడంటే అదో భయంకరస్వప్నం అన్నట్టు ఉలికిపడి దానికి వ్యతిరేకంగా మాటాడ్డం నాగరీకం చేసేరు కానీ కొంచెం వెనక్కి తిరిగి చూడండి. చావు అన్నది ఊతపదంగా ఎన్నిరకాలుగా వాడుకలో ఉందో.

"అర్థరాత్రయినా ఇంటిధ్యాస లేదు. ఎక్కడ చచ్చేడో?" అంటే నిజంగా చచ్చిపోయేడని కాదు కదా. అలాటిదే ఎదుటిమనిషిని "ఎక్కడ చచ్చేవే?" అనడగడం కూడాను. చచ్చిపోయినమనిషి ఎదుట ఉండదు కదా అలా అడగడానికి.

బహుశా నేను చిన్నప్పుడు పురాణకాలక్షేపాలకి హాజరవడం కావచ్చు. మన పురాణకథల్లో మానవజన్మగురించి చాలా చర్చలున్నాయి కదా. అవన్నీ ఇక్కడ పెట్టను కానీ చాలామందికి తెలిసే ఉంటుంది జీవితం బుద్బుదప్రాయం. జాతస్య మరణం ధృవంలాటివి. అసలు బిడ్డ పుట్టినప్పుడు ఏడుస్తూ పుడతాడు. మళ్ళీ ఈ ప్రపంచంలోకి నన్ను పడేసేవా అనిట. పోయినప్పుడు చుట్టూ ఉన్నవాళ్ళు ఏడుస్తారు. మమకారంచేత. ఆ మమకారం కూడదని మన శాస్త్రాలు చెప్తున్నాయి. నాకు ఆ బ్రహ్మజ్ఞానం వచ్చేసిందని చెప్పను కానీ నాకు అలా వదిలేసుకోడంలో కొన్ని సుళువులు కనిపించేయి. ముఖ్యంగా బంధుమిత్రులు ఇలా చెయ్యలేదు, అలా చేసేరు అని బాధ పడడంకన్నా వాళ్ళు నా బందుమిత్రులు కారు అనుకోడంతో గొడవొదిలిపోయినిపిస్తుంది నాకు. అంచేత అలా చేస్తున్నా. తెలిగ్గా దొరకనివాటికోసం అనేక కష్టనష్టాలకోర్చి, శ్రమ పడి గెలుచుకోడం ఒక పద్ధతి. అదే జీవితంలో గమ్యం కొందరికి. నాకా ఓపిక లేదు. అంటే నేను దేనికోసమూ కష్టపడనూ లేదు. సాధించిందీ ఏదీ లేదు. ఆధునికసమాజంలో ఆవిధంగా నాజీవితం నిరర్థకం. అంచేత కూడా కావచ్చు. చనిపోయినా ఫరవాలేదు అనే అనిపిస్తుంది.

ఇంతకీ, నిజంగా ఆ క్షణం వచ్చినప్పుడు అంటే ప్రాణం పోయేవేళ చివరి క్షణంలో పోతున్నానన్న స్పృహ ఉంటుందని కూడా గ్రహించేను. నాకు తెలిసినవారు చివరిక్షణాల్లో ఆప్తులని దగ్గరికి పిలిచి పోతున్నానని చెప్పడమో చేసౌంజ్ఞ చేయడమో చేసి ప్రాణాలు వదిలేసేరని విన్నాను.

అప్పుడు భయపడ్డారా, వారికి ఏం కనిపించింది అన్నది తెలీదు. కనీసం నేను పోయేటప్పుడు తెలిస్తే మాత్రం తప్పకుండా చెప్తాను, సైన్సుకి అది నా చివరిసేవగా.

000

ఒకసారి నాపుట్టినరోజుకి మాఅమ్మ మైసూరుపాక్ చేసింది. నేను మరేదో కోపంలో ఉండి, "నాకక్కర్లేదు, నేను తినను" అన్నాను. "ఎందుకు తినవు?" అని కసురుకుని, "ఇప్పుడు నేనున్నాను కనక చేసేను. ఆతరవాత నువ్వు కావాలన్నా చేసేవాళ్ళుండరు," అంది. ఇరవైఏళ్ళతరవాత, నేను అమెరికాకి వచ్చేక ఆ మాట నాకు అర్థం అయింది. ఇక్కడ ఓ కప్పు కాఫీ కావాలంటే నేను పెట్టుకుంటే ఉంది లేకపోతే లేదు. ఆరోజున మళ్ళీ మా అమ్మని తలుచుకున్నాను. ఇలాటి మాటలు మాఅమ్మే కాదు చాలామంది దగ్గర వినడంవల్ల కావచ్చు నాకు చావంటే బతుకులో భాగంగానే అనిపిస్తుంది కానీ ఆశ్చర్యంగానో భయంకరంగానో అనిపించదు.

000

ఇదంతా తవ్వి తీసి కాయితమ్మీద పెట్టడానికి జయలలిత తొలికారణం అయితే, మా అమ్మాయి మలికారణం. ఆ మధ్య ఒకరోజు మాఅమ్మాయినీ అల్లుడినీ భోజనానికి పిలిచేను.

ఇద్దరికీ తెలుగు వంటకాలు చాలా ఇష్టం. నేనిక్కడ లేనప్పుడు హోటల్లో తినేవారు. అంచేత సాధారణంగా దేశీహోటళ్ళలో దొరకని వంటకాలు చేయడానికి ఉద్యుక్తురాలినయి, కందిపచ్చడితో మొదలు పెట్టేను. అసలు నా కందిపచ్చడి ఊరూ వాడా చెప్పుకుంటారు. దేశీదుకాణంలో తాజా తాజాగా మామిడికాయలు కనిపించేయి. మామూలుగా ఇక్కడ అన్నిటినీ తాజా అనే అంటారు. ఒకసారి నేను అమాయకంగా, "ఇవి నిజంగా తాజా కాయలేనా?" అని అడిగితే, దుకాణంవాడు చింకి చేటంత మొహం చేసుకుని, "తెచ్చినప్పుడు తాజాగానే ఉన్నాయి," అన్నాడు.

సరే, ఇంతే ప్రాప్తం అనుకుని తెచ్చి తాజా తాజాగా కొత్తావకాయ పెట్టేను. నిజం చెప్పొద్దూ, చూస్తుంటే ఎర్రగా కళకళ్ళాడుతూ నాకే ముచ్చటేసింది.

అలాగే వంకాయ ఇగురూ, పులిహోరాను. అదేం ఖర్మో అన్నపూర్ణలాటి తెలుగు వాళ్ళు పెట్టిన హోటళ్లలో కూడా బిరియానీయే కానీ పులిహోర ఉండదు. ఇడ్లీతో కొబ్బరి పచ్చడి పెడతారు కానీ వేరుశనగపప్పు పచ్చడి పెట్టరు. అలాటివన్నీ తలుచుకుంటూ ఏమేం చేయాలో జాగ్రత్తగా ఆలోచించి వంటకాలు జాబితా తయారు చేసుకునేసరికి మూడు రోజులు పట్టింది.

వంకాయలు చూసేక, ఇగురు కాదు వంకాయ పచ్చికారం చేదాం అనిపించింది. చూడబోతే కొత్తిమీర లేదు. అప్పటికప్పుడు గబగబా వీధి చివర బంగ్లాదేశీ దుకాణానికెళ్ళేను. అక్కడే పచ్చి పనసకాయ కనిపిస్తే అదీ తెచ్చేను నువ్వులపొడి వేసి కూర చేస్తే ఎంత రుచో అనుకుంటూ. చివరితీర్పుగా పులిహోరలో ఆవకాయ ఊట కలిపేను. ఇలా చూసి చూసి అపురూపంగా చేసిన నావంటకాలు చూస్తుంటే నాకే బోల్డు ఉత్సాహం వచ్చేసిందనుకో.

అనుకున్నవేళకి ఇద్దరూ వచ్చేరు. భోజనాలకి వేళయింది. ఇద్దరూ చెరో పళ్లెం తీసుకుని కూరా, పచ్చళ్లూ, పులిహోరా, అలసంద గారెలూ వడ్డించుకుని బల్లదగ్గర కూర్చున్నారు. నేను కూడా మరో పళ్లెంలో పెట్టుకుని కూర్చున్నాను.

పిల్లా, పిల్లాడూ బహు మురిసిపోతూ ఇలాటి వంటకాలు తినడానికి పెట్టి పుట్టాలిలాటి విసుర్లతో ముగించేరు. నేను వాళ్లని గమనించనట్టు నటిస్తూ ముగించేను.

"పులిహోర ఎలా ఉంది?" అన్నాను.

"ఏం?"

"ఏం లేదులే" అన్నాను.

ఇద్దరూ వెళ్ళిపోయేరు మరోమారు అంతమంచి భోజనం పెట్టినందుకు ఆనందం వెలిబుచ్చి. నాకు మాత్రం తృప్తి లేదు.

నాలుగు రోజులనాడు పిల్ల మళ్ళీ వచ్చింది. "ఇలా రా. నీకో మాట చెప్పాలి," అని పక్కన కూర్చోపెట్టుకుని నిదానంగా వివరించేను, "చూడు, pizza, casseroleలాటివాటిల్లో రకరకాల కూరగాయలన్నీ కుప్పగా పడేసి ఒకే వంటకం చేసేస్తారు. మనం అలా చెయ్యం ముక్కలపులుసయితే తప్ప. అంచేత తిన్నప్పుడు కూడా అంతే. ఒకొక వంటకం ఒకొక రుచి. దేని రుచి దానిదే. మొన్న పుళిహోరలో ఆవకాయ ఊట కలిపేను. అంచేత ఆ రుచి వేరు. ఇవన్నీ విడివిడిగా తింటేనే చౌరుచులూ తెలుస్తాయి కానీ అన్నీ కుప్ప పోసేసి కలిపేసుకు తింటే ఏమీ తెలీదు." అని.

"మరి నువ్వు చెప్పలేదు కదా," అంది అమ్మాయి.

"చెప్పేదేమిటి. నీకు తెలీదా మనం ఎలా తినేవాళ్ళమో. అన్నిట్లోనూ ఆవకాయ కలిపేసుకుంటే కూరలరుచేం తెలిసింది?"

"నాకు ఆవకాయ ఇష్టం అని నీకూ తెలుసు కదా. అసలు ఇలాటి ఆవకాయ తిని ఎన్నాళ్లయిందో తెలుసా. మళ్ళీ నువ్వు పోయేక ఎవరు చేసి పెడతారు నాకిలా?"

... ... ... మూడు నిముషాలపాటు.

నాకింక మాటాడ్డానికేం లేదు. నాకు తల తిరిగి నోట్లోకొచ్చింది కానీ అదేం కనిపించనీయకుండా తనూ ఆయనా ఎంతగా ఆ రుచులు తింటూ ఆనందించేరో, తరవాత రెండురోజులపాటు అవే తలుచుకున్నారో చెప్తుంటే వింటూ కూర్చున్నాను మరో పావుగంటసేపు.

ఆ తరవాత అది వెళ్ళడానికి లేస్తూ, ఇక మీదట ఏదైనా మరీ ప్రత్యేకం అని అనుకుంటే నేను ముందే చెప్పాలని తాఖీదిచ్చి వెళ్ళిపోయింది. అంతవరకూ నాకూ తెలీనే లేదు తప్పంతా నాదేనని.

000

"తిక్క కుదిర్నాదా?"

సంధ్రాలవేపు దిగులుగా చూసేను.

"వంటకాలమాట మాటాడుతుంటే చావుమాటెందుకొచ్చిందా అని ఆలోచిస్తున్నా."

"నివ్వంటవు గెన్క చిన్నమ్మగోరిగ్గూడ అదీ మాటొచ్చేసినాది. ఏగూటి సిలక ఆగూటి పలుకే పలుకుతాదని తెల్దేటి నీకు."

అవును. ఏదో మాటలసందర్భంలో ఒకమారు కాబోలు అన్నాను. సందర్భం చెప్పను కానీ ఏదో మాటలసందర్భంలో నాగురించి తనకి అనేక దురభిప్రాయాలు ఏర్పడ్డాయని తెలిసేక, ఒకసారి అన్నాను, "నేనుండగానే నీకేం సందేహాలున్నాయో చెప్పు, తరవాత నీకు ఎవరు చెప్తారు?" అని.

అప్పటికింకా చిన్నతనం, 13, 14 ఏళ్ళుంటాయేమో. "నీకు చావు లేదు. నువ్వు ఎప్పుడూ ఇలాగే ఉంటావు," అంది. ఆ తరవాతెప్పుడూ మాఇద్దరిమధ్యా చావుమాట రాలేదు. మళ్ళీ ఇదుగో, ఇప్పుడే. అచేతన్నమాట నేను ఉలిక్కిపడ్డాను.

మొదట్లో చెప్పినట్టు నాకేం బాధ లేదు కానీ ఈ రోజుల్లో ప్రతిమాటా "ప్రోత్సాహకరంగానూ, ఆనందపరిచేదిగానూ, ఉత్తేజకరంగానూ" ఉండాలి. ఎవరు గానీ ఎప్పుడు పోతానో అనగానే పదిమంది మొదలు పెడతారు, ప్రో .. ఆ ... ఉ ... వాక్యాలు. ఇంకా కొంత మెట్టవేదాంతం కూడా కలుపుతారు మరి కొందరు.

అంచేత మీతో అనడం మానేయగలను కానీ నేను చావుగురించి ఆలోచించకుండా ఉండలేను.

ఇందుకు నాచుట్టూ ఉన్న వాతావరణం కూడా దోహదం చేస్తోంది. నువ్వే చూడు. ఆరేళ్లప్పుడు ఈమాట వింటే ఏమీ అనిపించదు. అదేమిటో కూడా తెలీదు. ఇరవైఏళ్ళప్పుడు ఇంట్లో ఎవరో ఒకరు పోతే హృదయం బద్దలవుతుంది. యాభైలు వచ్చేసరికి ఈ పదం చాలామార్లే వినడం జరుగుతుంది. వైరాగ్యఛాయలు క్రమంగా మనసులో చోటు చేసుకుంటాయి. 80లు దగ్గర పడ్డాక అందులో వింత లేదనే అనిపిస్తుంది. కొందరుంటారనుకో అది అంగీకరించలేనివాళ్లు. కానీ జాగ్రత్తగా ఆలోచిస్తే మాత్రం అన్ని నాటకాల్లాగే ఈ నాటకానికీ తెరపడుతుంది అన్న స్పృహ కలుగుతుంది. అంగీకరిస్తాం.

ఇంకా కొన్ని ఆలోచనలు ఉన్నాయి కానీ నీమనసు మరీ సున్నితం కదా తట్టుకోలేవు. అంచేత ఇక్కడితో ముగిస్తాను.

000

(డిసెంబరు 5, 2016)

# 15. కాఫీ మరకలు

పక్కమీంచి లేవనా వద్దా అనుకుంటూ కిటికీలోంచి చూసేను.

రానా వద్దా అనుకుంటూ బాలభానుడు తికమకపడుతూ కనిపించేడు. "నువ్వొస్తానన్నా మేం రానివ్వం," అంటూ మబ్బులు అడ్డు పడుతున్నాయి. కిటికీమీద చినుకులు బహుశా రాత్రి పడ్డాయి కాబోలు. స్కూలికి వెళ్ళనని మొండికేసే కుర్రాడిలా ఆగి ఆగి నత్తనడకలతో నిదానంగా కిందకి దిగజారుతున్నాయి. ఈరోజంతా ఇలాగే ఉంటుంది కాబోలు చీదర, చీదరగా. వీధిలోకెళ్లే ఆశల్లేవింక.

రెండు కప్పులు చిక్కటి కాఫీ సేవించి, మళ్ళీ మంచమెక్కి, దిగులుగా కిటికీలోంచి చూస్తూ, తీవ్రమైన ఆలోచనలు చేసి, దుర్మార్గ చరాధములనుంచి ప్రపంచాన్ని కాపాడగల, బ్రహ్మాస్త్రంలాటి ఘన సందేశం ఒకటి తయారు చేసి పాఠకులమీదికి వదలడానికి పూనుకున్నాను.

మొదట కొన్ని సన్నివేశాలు కావాలి. నా ఐదోక్లాసుదగ్గర మొదలు పెడితే బాగుంటుందేమో. అంతుకుముందు లోకం ఎలా ఉండేదో తెలీదు గదా.

000

"ఏంటి తెచ్చుకున్నావు?"

"జొన్న రొట్టి."

"బాగుంటుందా?"

"ఎప్పుడూ తిన్లేదా?"

"లేదు. మాఇంట్లో ఎప్పుడూ చేయలేదు. ఏదీ ఓ ముక్క చూణ్ణీ."

"ముక్కా? తింటావా?"

"తిండానికే. తినకపోతే ఎలా తెలుస్తుంది నాకు?"

"..."

"ఏంటి ఆలోచన? ఓ ముక్కిమ్మంటుంటే, ..."

"మీరు బామ్మర్లు కద."

"అయితే?"

"మేం క్రిస్టియనులం గద."

"నాకు తెల్సు."

"మీ యమ్మకి తెలిస్తే మక్కలిరగతంతాది మాలకూడెడతావా అని."

... .....

"మాఅమ్మకి చెప్పనులే. ఓ ముక్క చూణ్ణి,"

ఇది సూర్యకాంతం, లలిత మధ్య జరిగిన సంభాషణ. విన్నానే కానీ అట్టే అర్థం కాలేదు. సూర్యకాంతం ఆఖరికి లలితకి ఓ ముక్క పెట్టింది. ఆరోజుల్లో నేను స్కూలినించి ఇంటికొచ్చేక స్కూలు బట్టలు వేరే పెట్టే అలవాటు ఉంది కానీ ఇలా మక్కలిరగదన్నే సందర్భం తగల్లేదు నాకు.

000

కాలేజీలో చదివేరోజుల్లో విజయలక్ష్మి వాళ్ళన్నయ్య ఏదో పరీక్షకోసం విశాఖపట్నం వచ్చేడు. విజయలక్ష్మి హాస్టల్లో ఉండి చదువుకుంటోంది. మానాన్నగారితో చెప్తే, మనింట్లో ఉండమను అన్నారు. మూడు రోజులున్నాడు. వాళ్ళు క్రిస్టియనులు. ఏతగువులూ లేవు ఇంట్లో.

000

"ఏం చేసేరు మధ్యాహ్నం?"

"ఏం చెయ్యాలనిపించలేదు. డామినో పీచా తెప్పించుకున్నా."

"పీచా తిన్నారా? ఛీజ్ లో ఆవుగర్భకుహరంతాలూకు ఏదో ఉంటుంది కదా."

"ఏమో, నాకు తెలీదు. నేను ఏది దొరికితే అది తినడమే."

"అయితే మీరు భ్రష్టు పట్టిపోయేరు."

"సరే. ఒకమారు భ్రష్టు అయిపోయింతరవాత ఇహ ప్రాయశ్చిత్తం చేసుకోడమే గతి. మాఅమ్మ అదేదో కథ చెప్పేది, "

"ఏం కథ?"

"ఒక బ్రాహ్మణులఇంట్లో ఒక మాలవాడు బ్రాహ్మణుడనని చెప్పి చదువుకు వచ్చేడుట. ఆఇంటి పడుచు అతడిని పెళ్ళాడింది. తరవాత అతను మాలవాడని తెలిసింది. ఆఅమ్మాయికి ఏం చెయ్యాలో తోచక, తండ్రికి సూటిగా చెప్పలేక, "నాన్నా, కుక్క ముట్టిన కుండకి ప్రాయశ్చిత్తం ఏమిటి?" అనడిగిందిట. "ప్రాయశ్చిత్తం ఏముంది, దర్భగడ్డి వేసి తగలబెట్టడమే" అన్నాడు తండ్రి, అసలువిషయం తెలియక. ఆ అమ్మాయి ఆమాటతో ఆత్మాహుతి చేసుకుందిట."

"అయ్యయ్యో, మీరలాటి ప్రాయశ్చిత్తాలకి పూనుకోకండి. ఆకాలం లేదులెండి ఇప్పుడు. మీకు ప్రాయశ్చిత్తం అఖ్ఖర్లేదని నేను నిర్ణయిస్తున్నాను."

హాహాహా అంటూ నవ్వేశాను.

000

మళ్ళీ కిటికీలోంచి చూసేను. ఎక్కడా ఎండ పొడ లేదు. కానీ నాకు ఈ నాలుగ్గోడలమధ్యా ఊపిరాడ్డం లేదు. లేచి, బట్టలు మార్చుకుని స్వెటర్ తీసి తొడుక్కున్నాను. తెల్లటి మల్లెపువ్వులా మెరిసిపడుతున్న స్వెటర్. ఎప్పుడో తప్ప తీయను. తీరా తొడుక్కుని అద్దంముందు నిలబడితే పసుప్పచ్చగా రెండు అమెరికాల చిత్రపటంలా పరుచుకున్న మచ్చలు రెండు కనిపించాయి. ఉలిక్కి పడ్డాను. ఈ మరకలు ఎప్పుడు పడ్డాయి? మామూలుగా కాఫీ మరకలు గోధుమరంగులో ఉంటాయి కదా పసుప్పచ్చగా ఉన్నాయేమీ? బహుశా ఆ మరకలు చూడకుండా రెండు మూడు ఉతుకులు పడ్డాయి కాబోలు. ఇది సగం వెలిసిన కాఫీ రంగన్నమాట.

000

ఆ మరకలు వదిలించుకునే ప్రణాళిక మొదలు పెట్టేను. ముందు బట్టలసబ్బుతో పులిమి చూసేను. తరవాత మరకలు తొలిగించుకునే ప్రత్యేక సబ్బులు వాడి చూసేను. ఆ సబ్బులకోసం బజార్లు తిరిగేను. అంతర్జాలంలో వెతికితే చాలా మార్గాలే కనిపించేయి, baking soda, beer, white venigar, bleach, ఉప్పు - బీరు లేదు కానీ మిగతావాటితో ఒకొకటే వరసగా వాడి చూసేను. ఈ వరసలో మరకలు మాయం కాకపోగా మరింత దిట్టంగా స్థిరపడిపోతున్నాయేమో అన్న అనుమానం కూడా కలిగింది. చింతపండూ ఇసకతో కూడా రుద్ది చూదాం అనుకున్నాను కానీ చింతపండు ఉంది కానీ ఇసక దొరకదు. దొరికే అవకాశం లేదు.

సరే చెడిన కాపురం చెడసే చెడిందన్నట్టు మరో ఆలోచన వచ్చింది. ఆమధ్య ఒకసారి toilet bowl cleaner రెండు చుక్కలు పేంటుమీద పడి బొమ్మలేసేయి. నా స్వెటరు ఎలాగా తెలుపే కనక ఫరవాలేదు అనుకుని ఆ క్లీనరు స్వేటరుమీద పోసి, సింకులో ఉతికేను. ఆశ్చర్యం, నా కాఫీ మరకలు మాత్రం పోలేదు. జీడిమరకలు శాశ్వతం అని విన్నాను కానీ కాఫీ మరకలు కూడా అంతే అనుకోలేదు. ఇంతవరకూ చెప్పలేదేమో, నాకాఫీ ప్రపంచ ప్రసిద్ధం. నాకాఫీ ఒక్క కప్పు పుచ్చుకుంటే కాఫీ అలవాటు లేనివాళ్ళు కూడా మరి వదల్రు.

ఇంతకీ నా స్వటరుమీద కాపీ మరకలయితే ఉన్నాయి కానీ వానజల్లుతరవాత వచ్చే మట్టివాసనా లేదు, కాఫీ వాసనా లేదు. మరకలు మంచివే అంటున్నారు కనక ఇంక ఆ మంచేమిటో కనుక్కోవాలంతే. కాపీవాసన లేదు కానీ రెండు అమెరికాలూ, మరో చిన్న ద్వీపం మ్యాపు మాత్రం చెక్కు చెదరలేదు.

000

అరవింద వచ్చింది, ఏం చేస్తున్నావు అంటూ.

నేను చెప్పలేనంత విచారం మొహంనిండా పులుముకుని, నా హృదయవిదారకగాథ వివరించేను. ఆ స్వెటరు నాకెలా వచ్చిందో, ఎంతకాలంగా దాచుకుని ఎంత అపురూపంగా వాడుకుంటున్నానో కూడా చెప్పేను, బావురుమని ఏడవడమే తరువాయి.

అరవింద చిదానందస్వామిలా చిన్ముద్ర పట్టలేదు కానీ చిరునవ్వు నవ్వింది నా అజ్ఞానాన్ని హేళనచేస్తూ. తరవాత కొన్ని ముఖ్య ప్రశ్నలు అడిగింది -

"ఎప్పుడు కొన్నావన్నది ప్రధానం కాదు. ఈ మరక ఎప్పుడు పడిందన్నది ప్రధానం," అంది.

"మరక పడగానే ఉతకలేదా?" అని విసుక్కుంది.

"వాషరులో ఉతికి డ్రైయరులో కూడా వేసేవా?" అని పృచ్ఛించింది.

మొదటి ప్రశ్నకి సమాధానం, "కిందటి చలికాలంలో."

రెండోప్రశ్నకి, "ఉతికే ఉంటాను,"

మూడో ... "వేసే ఉంటాను."

నాలుగో ప్రశ్న కూడా ఉంది. "ఎన్నిమార్లు డ్రైయర్లో?"

ఏం చెప్పను, "ఎన్నిమార్లు వాషరులో వేసేనో అన్నిమార్లు డ్రైయరులోనూ వేసి ఉంటాను,"

ఆవిడగారి తీర్పు, "వాషరులో ఫరవాలేదు కానీ డ్రైయరులో వెయ్యకూడదు. వేస్తే మరకలు స్థిరో భవ అనుకున్నట్టు స్థిరపడిపోతాయి."

ఇహ ఇంతేనన్నమాట అనుకుని నన్ను నేను ఓదార్చుకుంటుంటే, అరవింద నావేపు జాలిగా చూసి, జాలిపడి, "కాఫీ ఏదీ?" అంది.

నా కాఫీ తనకి చాలా ఇష్టం. అంచేత ఆపిల్ల ఇంట్లో అడుగుపెట్టగానే నేను కాపీ ఫిల్టరులో పొడివేసి నీళ్ళు పోసి సిద్ధంగా ఉంచుతాను.

కాఫీ ఇచ్చేక చిన్న గుడ్డముక్క తెమ్మంది.

"ఏమిటి చేస్తున్నావు?"

గుడ్డముక్క కాఫీలో ముంచి నా స్వెటరుమీద ఇండియా, ఆఫ్రికా, రష్యా, మ్యాపులు వెయ్యడం మొదలు పెట్టింది.

"వారం రోజులపాటు ఈ మరకలు ఎండబెట్టు. ఆ తరవాత డ్రైయరులో ఆరబెట్టు. ఇప్పుడు నీకు సరికొత్త స్వెటరు, మొత్తం ప్రపంచంలో మరెక్కడా లేని ఏకైక స్వటరు ఉందన్నమాట. అది చూసి జనాలు నీకు ఇలాటి స్వెటరు కావాలని ఆర్డర్లు కూడా ఇవ్వొచ్చు," అంది.

ఇంతకీ ఇదంతా ముఖ్యం కాదు. ఆ తరవాత తను చెప్పిన శుభవార్తే మనకి ప్రధానం.

"పై ఆదివారం నీలిమ జిమ్ పెళ్ళి,"

"ఆహా. సంతోషం. నా అభినందనలు చెప్పు."

ఆంధ్రులచిన్నదానికి ఆఫ్రికను చిన్నవాడితో పెళ్ళి. మరీ ఆశ్చర్యపడి మూర్ఛపోవలసినంత వింత కాదు కానీ ఆలోచనలు రాకమానవు. నాకు జ్ఞానం వచ్చినదగ్గర్నుంచీ వింటూనే ఉన్నాను. బ్రాహ్మణులబ్బాయి కమ్మవారమ్మాయి, రెడ్డి కుర్రాడు మాలకుర్రది, క్షత్రియపుత్రుడు బెంగాలీ పడుచు, మరాఠీపిల్ల మళయాళీ పిల్లవాడూ ... వర్ణాంతాలు, కులాంతరాలు, దేశాంతరాలూ ... వివాహాలు అవుతూనే ఉన్నాయి. సాధారణంగా పైకులాలవారి అభ్యంతరాలు చూపే కథలు ఎక్కువ. నిజానికి ఎవరికులం వారికి ఘనమే. ఒకసారి మాలైబ్రరీలో ప్యూను నాతో ఏదో చెప్పుకుంటూ, "నామాట తప్పయితే నేను మాలోన్నే కాను," అన్నాడు. అతనికి తనకులం అంటే అంత గౌరవం మరి.

ఈ కులతత్త్వం కూడా కాఫీ మరకలాగే. వదలదు. కాకపోతే, అరవింద కాఫీమరకలని పునరుద్ధరించినట్టు కాలానుగుణంగా మార్చుకోడం జరుగుతుంది. మొదటి తరం వివాహాల్లో రెండు కులాలని గౌరవిస్తూ పిల్లల్ని పెంచుతాం అంటారు కానీ ఏదో ఒక సమయంలో ఒక కులం తాలూకు ఆచారాలు, వ్యవహారాలూ పైచేయి అవుతాయి. ఆ పిల్లలు ఒప్పుకున్నా, వారి వ్యవహారాల్లో కొంత మార్పు ఉంటుంది. ఆ పిల్లలు, తల్లిదండ్రులకులాలు వదిలేసి, మూడో కులం, జాతివారిని పెళ్ళి చేసుకోవచ్చు. ఇలా క్రమంగా మరో మూడో పదో ముప్పయ్యో తరాలతరవాత ఈ కులాలగురించిన తలపులు వెలిసిపోవచ్చు.

అంతవరకూ ఓపిక కావాలి. హమ్మయ్య. మళ్ళీ కిటికీలోంచి చూసేను. దినకరుడు సూచనప్రాయంగా కనిపించేడు. వరండాలోకెళ్తే ఎండపొడ గోరువెచ్చగా తగిలింది ఉపశమనం కలిగిస్తూ.

000

(జనవరి 10, 2017)

# 16. వేరు

రెండు చేతులా సాగినంతమేరకి బార చాపి ధరణితల్లిని ఆప్యాయంగా ఆలింగనము చేసుకుంటున్నట్టు ఆ వేళ్ళు!

ఆత్మానందంకోసం అంగలారుస్తున్నాయో, మరింత దూరం సాగాలని పరితపిస్తున్నాయో కానీ చూపరులకు మాత్రం ఆ వేరులు తమవైఖరితో కన్నులపండుగ చేస్తున్నాయి. ఏ కావ్యకన్యక శిరోభాగముననో చెలువొందు కురుసంపదవలె గంగమ్మజాతరనాటి జనసందోహంవలె ఉక్కిరిబిక్కిరిగా గర్భకుహరాలలోకి విస్తరించిన వేళ్ళు ఇటువైపునా, ఎక్కు పెట్టిన బాణాల్లా వినువీధి గుండెల్లోకి లోలోపలికి చొచ్చుకుపోతున్న కొమ్మా రెమ్మా, వాటినంటి చివుళ్ళూ, ఆ చివుళ్ళకి సుకుమారమైన నిగారింపు చేర్చి మిలమిల మెరుస్తున్న వెలుగురేఖలూ అటువైపునా!

వేళ్ళు మిత్తిలోనికి చొచ్చుకుపోయి అణిగి మణిగిపోతున్నాయి సవినయంగా ఊర్ధ్వముఖంగా ఎగసి పరుగులు పెడుతున్న కొమ్మలనీ రెమ్మలనీ నిలబెడుతూన్న సంతృప్తితో. బడుగు పుల్లల్లా కనిపిస్తున్న ఆవేళ్లబలం ఎంత ఘనం. వాటిలో ఎంత వినయం. ఏహంగూ రంగూ  పొంగూ లేని ఆ వేళ్ళే లేకపోతే ఆ మహావృక్షానికి మనుగడ ఉండునా? మహాపురుషుడినీడలో అక్షిగోచరం కాకనే మెలిగే కోట్లాది అనామకులూ, అంగుష్ఠమాత్రులలా ఆవేళ్ళు!

వేళ్ళని కాపాడడానికి కాబోలు కాంక్రీటు కాలిబాట పొందిగ్గా వేసినట్టున్నారు. బహుశా ఏ ఉక్కుచట్రమో వేసి, దానిమీద కంకరపోసి ఆపైన కాలిబాట కట్టి ఉండాలి. ఎంతటి ఆలోచన!

ఒక్కొక్క తరుమూలంలో ఒక్కొక్కతీరు ఈ వేరుసంపద! యాజులుగారు ఒక్కొక్క చెట్టుదగ్గరే ఆగి ఆ వింతసోయగాలు పరికించి చూస్తూ, ఇంటివారు ఏమైనా అనుకోగలరేమోనని సందేహిస్తూ అటువేపు ఓ చూపు విసిరి ముందుకు సాగేరు.

ఒత్తుగా పెరిగిన చెల్లాయిజుత్తు ఒక్కజడ వేయడానికి లొంగదని రెండు పాయలు తీసి, ఒక్కొక్క పాయ మూడు పాయలు తీసి అమ్మ జడ వేయడానికి కుస్తీ పడుతుంటే, చెల్లి కదులుతుంటే, అమ్మ అలా మెడ తిప్పకు జడ వదులయిపోతుంది అంటూ కసుర్లు ... ఈ వేళ్ళు చక్కగా అల్లుకుని రెండు కాదు ఎనిమిది జడల్లా మూలంచుట్టూ పరుచుకుని అష్టదిక్కులా అలవోకగా సాగిపోతున్నాయి. అట్టే పరికించి చూస్తే, కొన్ని వేళ్ళు పిల్లికి దొరకకుండా పరుగులు పెడుతున్న ఎలుకపిల్లవలె కనిపించి ఉల్లాసం కలిగించేయి ఆయనకి.

మరో నాలుగడుగులేస్తే, సంక్రాంతిపొద్దు వాకిట్లో పెద్దక్కా, చిన్నవదినా వేసిన రథంలా  గళ్ళుగా గళ్ళుగా, గుళ్ళు గుళ్లుగా మల్లెపొదలా సుళ్ళు తిరుగుతూ మరిన్ని వేళ్లు.

యాజులుగారు అట్టే చూస్తూ నిలబడిపోయేరు. చెట్టుమొదలులోనుండి వెలికి వచ్చిన వేరొకటి జానెడెత్తు గాలిలోకి లేచి, అడుగున్నరదూరం ఉత్తరదిశగా సాగి మంటిలోకి ఒరిగిపోయింది ఒంగి ఒంగి సలాములు చేస్తున్న గులాములా. వొంగిన వేరుతో చిన్న వంతెన కట్టింది.

పైకొమ్మమీంచి బోదెమీదుగా కిందకి జారి హడావుడిగా దిగిపోయిన ఒక ఉడతమ్మ ఆ వేరువంతెనమీదుగా పయనించి అటు చివర నేలమీదకి జారి గిరుక్కున వెనుదిరిగి మళ్ళీ వంతెన కింద దూరి వెనకగా ఉన్న పొదలవేపుకి పారిపోయి ఓ చిన్న సర్కసు ప్రదర్శన ఇచ్చేసింది ఉచితంగా అయాచితంగా యాజులుగారికి.

హమ్మదొంగా అన్నట్టు ఆయనపెదిమలమీద చిరునగవొకటి చిన్నతరగలా కదిలి హృదిలో ప్రతిఫలించింది.

అలవాటయినంతవరకూ నడిచి వెనుదిరగబోతూ కుడివేపు చూస్తే అక్కడ మరో పెద్ద తరువు ప్రత్యక్షమయింది. “అరె ఇన్నాళ్ళూ చూడలేదే” అనుకుంటూ అటు తిరిగేరాయన.

కొడుకులిద్దరూ తనచేతిమీదుగా పెరిగి ప్రయోజకులయేరు, గాలిలో తేలిపోతున్న తరుశాఖలలాగ సగర్వంగా, ఇంకా విరగబాటు అనొచ్చేమో కూడా, తమబతుకులు హుందాగా సాగించుకుంటున్నారు! కంటబడ్డ తరువుదాపుకి చేరుకునేలోపున మరో తాళవృక్షం కనిపించడంతో ఆగి తలెత్తి చూసేరు. దాదాపు రెండునెలలుగా ఇదే ప్రాంతంలో ఎడమనించి కుడికీ, కుడినించి ఎడమకీ, ఎదురుగానూ, వెనకగానూ - అష్టదిక్కులా తిరుగుతున్నా ఎప్పటికప్పుడు పరగడుపే. ఏ రోజుకారోజు ఏదో ఒక వినూత్న నియోగం. అవి నిన్న లేవా అంటే ఉండే ఉంటాయి. తనదృష్టికి ఆనలేదంతే. ఇవాళే బండి దిగేయి అనుకోడానికి లేదు. అది స్థావరము కానీ జంగమము కాదు కదా.

ధ్వజస్తంభంలా వినువీధిలోకి సాగిపోయిన తాళవృక్షంచివర్న నాలుగాకులు వింజామరల్లా గాలిలో ఊగుతున్నాయి. మట్టిలోంచి లేచిన మొదలు ఓ అడుగున్నర మేర ఏ కొండమంగలో పనిగట్టుకు కత్తిరేసినట్టు, మిగిలిన మొండివేళ్ళతాలుకు ఛాయలు గడ్డం గీసిన మూడోరోజు కనిపించే మొరటు వెంట్రుకలలా నిక్క పొడుచుకుని రవంత వికారంగానే ఉన్నాయి. మొదలులో వేళ్ళు ఉత్తరించేసినందున కాబోలు ఆచివరన మూడే ఆకులు మిగిలి, అవి కూడా కొనఊపిరితో కొట్టుకుంటున్నాయేమో. ముళ్ళపూడివారి ఫ్రెంచికట్టు మీసకట్టుమీద చతురభాషణలా - “మూతిమీద ఈగ వాలినట్టు మూడే వెంట్రుకలు” … ఈ తాళవృక్షపు పత్రసంతానం కూడా మూడే!

కోడలొచ్చేక పెద్దబాబుకి తీరిక లేకుండా పోయింది. తనకు తానుగా రావడం లేదు సరి కదా తానే ఓమారు “కనిపించి పో అంటే, “ఇప్పుడు కాదు తరవాత, ఇవాళ కాదు రేపు, ఈనెల కాదు, వచ్చే

నెల" … అంతే సంగతులు. "నీకు రావడానికి తీరదు, నేనే వస్తానం"టే కూడా దిక్కులేదు. పని, పని, పని, పని, పని. ఆఫీసు పనే కాక, విహారయాత్రలకీ, ఊళ్ళు తిరగడానికీ సరిపోతుంది అతగాడి సమయం. అలాటిదే తనతో ఓ పూట గడపడం కూడా అని తోచదు. "ఆఫీసుపనులతో విసిగిపోయి కాస్త విశ్రాంతికోసం వెళ్తున్నా" లేకపోతే, "ఉద్యోగం నిలబెట్టుకోడానికి ఇలాటిసేవలు అవసరం, నెత్తిమీద బాబుల్ని ఖుషీ చేస్తుండాలి" అంటూ మరో కుంటిసాకు.

చిన్నబాబుకి పెళ్ళి కాలేదు కదా పెళ్ళాంతో తిరిగేసమయం మిగలదా అంటే అదేం లేదు. అతగాడి వ్యాపకాలు అతగాడికీ ఉన్నాయి. "ఒక్కసారి, నువ్వూ నేనూ ఎక్కడికైనా వెళ్దాం, నేనే ఖర్చులు పెట్టుకుంటాను," అన్నా కూడా, "మీవయసేమిటి, మీసరదాలేమిటి, మీరు మాలా తిరగ్గలా?" అన్నాడు. పదేళ్ళకిందట, "మాదగ్గరకొచ్చేయండి" అన్నప్పుడు కూడా తామిద్దరివయసులో తేడా అంతే అని ఎందుకు తోచలేదో మరి.  యాజులుగారు సుదీర్ఘంగా నిట్టూర్చేరు. మనసులో మరోపక్క వాళ్ళవాదనలో వాస్తవం ఆయనకి కనిపించకపోలేదు. వాళ్ళఅభిరుచులకీ తన అభిరుచులకీ సహస్రాంతం తేడా! అది ఆయనకి సంతృప్తికరంగా లేదంతే, తనకి సాంత్వన కలిగించడంలేదు.!

యాజులుగారు తలెత్తి తాటిచెట్టువంక చూడబోయేరు. అదక్కడ లేదు. హా. తాటి చెట్టు అక్కడే ఉంది కానీ తానే ముందుకి సాగి మలుపు తిరిగి మరోచెట్టు ఎదుట ఉన్నారు, ఆ స్పృహ లేకపోయిందంతే.

కట్టెదుట మహావృక్షం ఆకాశానికి గొడుగు పట్టినట్టు, మూడంకణాల ఇంటిమీద బెంగుళూరుపెంకుల కప్పులా ఒత్తుగా చీమలు దూరని చిట్టడివిలా పరుచుకున్నాయి పచ్చని ఆకులు పసుపురంగు ఆకులు దానిమ్మగింజరంగుకి మారుతూ. చెట్టుబోదె పదడుగులు కనిపిస్తోంది కానీ ఆ మీదట ఆకులే తప్ప శాఖలు కనిపించడంలేదు. బోదె అడుగున్నర విస్తృతితో దిట్టంగా కోటబురుజులా ఉంది. బెరడు రాలిపోయిందో ఇంటివారు పని గట్టుకు గీకేసేరో కానీ నున్నగా మెరిసిపోతోంది. పెద్దవాడి బారసాలతరవాత సున్నాలెరుగనిగోడల్లా వెలవెలబోతున్నా నయనానందంగానే ఉంది ఆయనకి.

నిన్నా మొన్నటివరకూ మాటామంతీ లేకుండానే ఎంతసేపైనా పక్కన కూర్చోగల పిల్లలిద్దరికి ఇప్పుడు పన్నెత్తి పలకరించడానికి, ఫోను తీసి ఏం చేస్తున్నావని అడగడానికి కూడా తీరుబడి లేదు. తీరడం లేదు.

తాతమూకుడు తరతరాలా అంటారు. "రేపు నీపిల్లలు ఇలాగే మాటాడితే?" అని అడగగలడా తను? లేడు. అడగలేడు. అడిగితే అది "పేరు" అంటాడు మలిసంతానం. తొలిసంతానం మరో ఆకు ఎక్కువ చదివేడు. "మీరే అలా అంటే నేనేం చెప్పను?" అంటాడు సమరసభావం ఒలకబోస్తూ దిగాలు పడిపోతున్న మోముతో. సూక్ష్మంగా చెప్పాలంటే ఆ భాషకి కూడా అదే తాత్పర్యం - పేరు, పేరు, పేరు ...

ఆ ''పేరు''సంస్కృతిలోనే వీరిద్దరికీ జీవనము. తనలా ఆలోచించలేరు. ఆలోచించవచ్చేమో అన్న స్పృహ కూడా లేదు. సమసమాజానికి సర్వులూ పాటుపడాలి అంటూ ఉపన్యాసాలు ఇచ్చేవారూ, సమాజసేవపేరున దేశాన్ని దుక్కి దుక్కి దున్నేసేవారూ కూడా ఇంట్లో ఉన్న మనిషి కూడా ఆ సమాజంలోని లక్షలమనుషుల్లో ఒక మనిషి అని గుర్తించరు.

ఈపేళ్లు అలా ఆలోచిస్తాయా? కాలగతిలో ఈ పేళ్ళకి తనలా ఆలోచించే సమయం ఆసన్నమవుతుందా? వీటికి చలనం లేదు. ఉందేమో. అడయారులో ఉన్నమర్రిచెట్టు కాశీనించి అడయారుకి తరలివచ్చేసిందని చెప్పుకుంటారు. తాను వెడలదలచుకున్న దిశగా కొత్త ఊడలు వేసుకుంటూ వెనక ఊడలు మాడ్చేసుకుంటూ సాగిపోయిందిట. కట్టు కథే కావచ్చు కానీ మర్రి ఊడలు వేస్తుంది కనక అసాధ్యం కాదేమో.  మరి తనపిల్లలు కూడా అలాటి ఊడలే పరీక్షగా చూచుకుంటే. ఎక్కడ బయల్దేరి ఎక్కడ తేలేరూ! వాళ్ళతోపాటు తనూను, ఆశ్చర్యమ్!

ఎదుట మిన్నాగులాటి పేరొకటి మూడుగజాలు పశ్చిమదిశగా సాగి నేలలోకి ముడుచుకుపోయింది. కింద పేరు విస్తరించినంత మేరా మీద కొమ్మలు విస్తరిస్తాయంటారు. యాజులుగారు ఒక్కక్షణం ఆగి చూస్తున్నారు.

యింటి యజమాని కనిపించేడు వాకిట్లో ముళ్ళకర్ర పుచ్చుకు రాలినఆకులూ, కొమ్మలూ పోగు పెడుతూ. ఆ తరవాతెప్పుడో చెట్టుసర్వీసువారు వచ్చి మిగతా కొమ్మలు నరుక్కుపోతారుట.

నెలరోజులక్రితం "ఆ కొమ్మలు వాయుమండలంలో మాస్థలం ఆక్రమించేయి" అని పొరుగువారు ఆ చెట్టుతాలూకు కొమ్మలు కొన్ని కొట్టేసేరుట. తమచెట్టుపోయిగానికి తరుగు అని వీరు కోర్టులో దావా వేసేరుట. కోర్టులో కేసు కోర్టులోనే ఉంది. నాలుగు రోజులక్రితం ఉరుములూ, మెరుపులతో హోరుమంటూ పెద్దగాలివాన ముంచుకొచ్చింది.  ఆ మహావృక్షం మొదలంటా పెళ్ళగించుకుని కూలిపోయింది. పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చేసింది.

కూకటివేళ్లతో సహా పెళ్ళగించుకుని కూలిపోయిన మహావృక్షాన్ని చూస్తూ నిలబడిపోయేరు యాజులుగారు.

మనసంతా వికలమయిపోయింది. మొన్నటివరకూ హుందాగా రాజెవరి కొడుకన్నంత ధీమాగా అనిర్వచనీయమయిన ఔన్నత్యంతో ఘనవైభవంతో నిటారుగా నిలిచిన మహావృక్షం గాలికీ నీటికీ లొంగిపోయి కూలిపోయింది!

కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరేసరికి, చిట్టి కారు దిగుతూ ఇంటిముందు కనిపించేడు.

"ఏంటి పిలవకుండా వచ్చేసేవు?"

"నేను మిమ్మల్నినాలా మీరు నన్నా?" అన్నాడు చిట్టి చిన్నగా నవ్వి.

"నేను నిన్నుపిలిచేదేమిటి. నువ్వెప్పుడొస్తే కాదన్నాను కనక. నువ్వే వస్తున్నానని చెప్పి కదా వస్తావు."

"ఇటువేపు పేరేపనుండి వచ్చేస్లెండి."

యాజులుగారు తలుపు తీసి, గ్లాసులోకి మంచినీళ్ళు ఒంపుకుంటూ, "నీళ్ళు?" అన్నారు కొడుకువంక చూడకుండానే.

"వద్దు," అన్నాడు.

ఇద్దరిమనసులూ భారంగానే ఉన్నాయి.

"నాన్నగారూ!" అన్నాడు చిట్టి సందేహిస్తూ.

ఆయన తలెత్తి చూసేరు. ఇంతవరకూ గమనించలేదు. చిట్టి ఏదో వార్త తెచ్చినట్టున్నాడు.

"ఏంటి?"

చిట్టి రెండు క్షణాలు ఆగి, "సుమిత్రక్క ఫోను చేసింది" అన్నాడు ఒకొక్క మాట సాగదీస్తూ.

"సుమిత్రమ్మా? ఎందుకు? గంగాధరం బాగానే ఉన్నాడా?" అన్నారాయన కంగారు పడుతూ.

గంగాధరం తన బాల్యమిత్రుడు. సుమిత్ర ఆయనకూతురు. ఈదేశంలోనే ఉంది కానీ మాటా పలుకూ లేవు. ఎప్పుడో ఆయన ఈదేశం రాగానే ఒక్కసారి పిలిచేడంతే. ఆరోజు ఆ అమ్మాయి కంఠస్వరం విన్నతరవాత మళ్ళీ పిలవబుద్ధి పుట్టలేదు.

చిట్టి అడ్డంగా తలూపేడు.

యాజులుగారు చేతిలో గ్లాసు అక్కడే పెట్టేసి, సోఫాలో కూలబడ్డారు. "ఏమయింది. ఏం చెప్పింది సుమిత్రమ్మ?"

"బాబాయి పోయేర్ట."

యాజులుగారు అయోమయంగా చూసేరు కుమారునివైపు. ఆయనకళ్ళలో ఇందాకా చూసిన నేల కూలిన మహావృక్షం మెదిలింది. తాను పరాయిదేశం ప్రయాణానికి ఆయత్తమవుతూంటే, పూడుకుపోయిన గొంతుతో "మళ్ళీ చూస్తానో లేదో" అంటున్న గంగాధరం మెదిలేడు.

"ఛ. అదేం మాట. ఈరోజుల్లో అమెరికా అంటే అనకాపల్లిలాగే. ఏడాది తిరక్కముందే రానూ వస్తాలే కనీసం నిన్ను చూడ్డానికైనా," అన్న తనమాట బోటుగా వినిపిస్తోంది.

000

"ఒక్కరూ ఏం అవస్థలు పడతారు. ఇద్దరం అక్కడే ఉన్నాం. మాతో వచ్చేయండి నాన్నగారూ."

"ఉన్నఊరూ కన్నతల్లీ అన్నారు. ఈగాలీ, ఈనీరూ నాకు అలవాటయిపోయేయి. మరోచోట ఉండలేనురా."

"అదేంటి నాన్నగారూ. గాలీ, నీరూ అన్నిచోట్లా అవే. నాకూ, అన్నయ్యకీ అలవాటయినట్టే మీకూ అలవాటయిపోతుంది."

"నాయనా, నీకు అలవాటవడం వేరు. నాకు అలవాటవడం వేరూ."

"ఆ, అదేం లేదు. మనం అనుకోడంలో ఉందని మీరే చెప్పేరు."

"అదెప్పుడూ?"

"నేను ఎనిమిదోక్లాసు చదువుతున్నప్పుడు, మీకు అస్తమానం బదిలీలే. నేను కొత్తఊరికి రానంటే, మీరన్నారు," చిట్టి నెమ్మదిగానే అయినా సూటిగా ఆరోజులు జ్ఞాపకం చేసేడు.

యాజులుగారు అవాక్కయి చూస్తూ ఊరుకున్నారు కొంతసేపు. తరవాత నెమ్మదిగా అన్నారు, "అది వేరు."

చిట్టి మళ్ళీ నవ్వేడు. "ఎలా?"

"ఎన్ని ఊళ్ళు తిరిగినా, గుడుగుడుకుంచంలా ఆ కుదుట్లోనే మనగడ్డమీదే తిరిగేం. ఇక్కడ నాజీవితం ఈ పరిసరాలతోనూ ఈ మనుషులతోనూ ముడిపడి ఉంది."

"అమ్మ ఉన్నన్నాళ్ళు ఒకరికొకరు తోడుగా ఉన్నారని ఊరుకున్నాం అన్నయ్యా నేనూ కూడా. ఇప్పుడు ఒక్కరూ ఎలా ఉంటారు? ఏమైనా అయితే ఎలా తెలుస్తుంది?"

"అదే తెలుస్తుంది."

ో"తెలిసినా, ఇక్కడికి రావడానికే రెండ్రోజులు పడుతుంది. పైగా మీరేమో ఏదో చిన్న బాధ అని ఊరుకోవచ్చు. అదే ప్రాణాంతకం కావచ్చు."

యాజులుగారు అర్ధమనస్కంగానే అయినా ఒప్పుకోక తప్పలేదు. ఇక్కడికొచ్చేక ఇతర "వేరు"లు అనేకం అర్థమయీ అవనట్టున్నాయి.

000

యాజులుగారికి మసకమసకగా పొగమంచులో క్షితిజరేఖమీద తిరుగాడే నీడల్లా ... ఆనీడలు మాటాడుతున్న స్పృహ.

"అన్నయ్యని పిలు. కాల్ 911. ఎగ ఊపిరి"

అయ్యో .. నోరూ ముక్కూ మూసేస్తూ ప్లాస్టిక్ దొప్ప, గుండెలమీద ఎవరిదో చెయ్యి.

క్షితిజరేఖమీద కీకారణ్యం. కాళ్ళు భూమిలోకి చొచ్చుకుపోతున్నాయి. కదిల్చబోతే కదల్దం లేదు. అయ్యో అదేమిటి చేతులు కాడల్లా బలపడి పక్కలకి సాగిపోతున్నాయి. చిన్న చిన్న రెమ్మలేసి, చివుళ్ళొచ్చి, ఆకులుగా రూపు దిద్దుకుంటున్నాయి. కాలివేళ్ళు చెట్టువేళ్ళలా నేలలోకి దిగబడిపోతున్నాయి. అడుగు తీసి అడుగు వేయలేకున్నాడు. మీద శాఖోపశాఖలుగా పెరిగిపోతోంది చెట్టు.

అంతలోనే మళ్ళీ ఏదో స్పృహ.

"నాన్నగారూ, నాన్నగారూ" చిట్టి పిలుస్తున్నాడు ఆతురతతో. ఆపక్కనే అతని ప్రాణమిత్రులు ముగ్గురు నిలబడి వాళ్ళకీ, తనకీ ధైర్యం చెప్తున్నారు.

యాజులుగారు ఓపికి తెచ్చుకుని కనురెప్పలు ఎత్తేరు గుళ్ళు మోస్తునంత శ్రమతో. మంచంచుట్టూ శ్రేయోభిలాషులు ధైర్యవచనాలు వల్లె వేస్తున్నారు, ఎనిమిదోక్లాసులో పాఠం ఒప్పచెప్పినట్టే.

"ఫరవాలేదు. త్వరలోనే కోలుకుంటారు."

"ఈ డాక్టరు సుప్రసిద్ధుడు."

"మీరు ఉక్కుపిండం అని మీఅబ్బాయి చెప్పేడు."

"ఔనౌనౌనౌను. మీఆరోగ్యానికి తకరారు లేదని డాక్టరు చెప్పేడు."

"మీకు పట్టుమని గట్టిగా జలుబయినా చెయ్యలేదుట కదా."

"ఏ పరీక్షలు చేసేడు డాక్టరు?"

"... చెయ్యలేదా?"

"ఏంటది?"

"ఓ, అదేం లేదు. ఫరవాలేదు. ... ఉంటే ఈపరీక్ష కూడా చేస్తారు. ఫరవాలేదు. మీనాన్నగారికి అవసరంలేదు."

యాజులుగారికళ్ళు మళ్ళీ మూతలు పడుతున్నాయి. కనురెప్పలు ఎత్తిపట్టబోతే ఒల్లనంటున్నాయి. చీమలు దూరని చిట్టడివి, కాకులు దూరని కారడవి. కట్టెదుట పెనుభూతంలా మహావృక్షం నభోమండలంలోనికి దృష్టి సారించి, నల్దిక్కులా ఎగబాకుతూ శాఖోపశాఖలు.

“నాన్నగారూ! నాన్నగారూ!” పెద్దకొడుకు కూడా వచ్చినట్టుంది. ఇద్దరూ పిలుస్తున్నారు అనంతదూరంలో.

అకస్మాత్తుగా సుదీర్ఘమైన నిట్టూర్పు వెలువడింది. వేళ్ళు కదలవు. కానీ అవే జీవనాధారం. కొమ్మలూ, రెమ్మలూ ఊర్ధ్వముఖంగా ఎదుగుతూ పోతున్నాయి విశాలవిశ్వంలోకి.

హమ్మయ్య, కాలివేళ్ళు సుతారంగా కదిలుతున్నాయి. పాదాలు భూగర్భంలోకి చొచ్చుకుపోతున్న అనుభూతి. హృదయకుహరంలో మందానిలమొకటి వీస్తూ శాంతివచనాలు పలికింది. వేళ్ళు నీళ్ళందుకుంటాయి. ఆకులు వెలుగు నొల్లుకుంటాయి. వేళ్ళు సుస్థిరంగా ఒకేచోట ఉన్నా అవే జీవనాధారం విశాలవిశ్వంలోకి విస్తరించిపోతున్న కొమ్మలకీ రెమ్మలకీ.

000

# 17. బాలతార

(1965-6 ప్రాంతాల్లో రాసినకథ!)

"ఏరోజు పేపరు చూసినా చచ్చిపోయినవాళ్ళూ, తప్పిపోయినవాళ్ళూ, ఏక్సిడంట్లూ, ఎడ్వర్టైజుమెంట్లూను," రామకృష్ణ విసుగ్గా పేపరు కింద పడేశాడు.

అసలు పేపరు మధ్యాహ్నంపూట రావడంవల్లనే నాకు సగం చచ్చిపోయింది పేపరు చూడాలన్న కోరిక ఆనందపురం వచ్చేక. కాకపోతే ఏ రోజుకారోజు ఇంకొక్క ఇరవై రోజులు, ఇంకొక్క పందొమ్మిది రోజులు - ఇంతకీ ఇక్కడికి వచ్చింది వరసకి మేనత్తకొడుకైనా చిననాటి చెలికాడు రామకృష్ణతో సరదాగా శలవులు గడపడానికి కదా - అనుకుని నన్ను నేనే బుజ్జగించుకుంటూ వస్తున్నాను. దానికి తగినట్టు రోజూ ఆ పేపరు రాగానే మొట్టమొదట తీసుకోవడమూ , "ఇది విన్నావా జానకి చెబుతోంది - ఎల్లప్పుడూ తనకి మేలయినదే కావాలిట - అదే వీవా - చూడు, చూడు నీకు జుట్టు నెరుస్తోందా - హెలెన్ కర్టిస్ వారి తయారీ. నరసింహులు చెట్టియార్ హృద్రోగంతో మరణించేడుట, ఆయనకి భార్య, ముగ్గురు పిల్లలు ఉన్నారుట" అంటూ ఈధోరణిలో ఏమాత్రమో మిగిలి ఉన్న సరదాని సమూలంగా నాశనం చేసేవాడు.

"నీకు సంబంధం లేనివి నువ్వెందుకు చూస్తావు? నీతల ఇప్పుడప్పుడే నెరవదు. ఆ నరసింహులు చెట్టియార్ ఎవడో నీకు తెలీదు. కాని భారతపౌరుడిగా ఇందిరమ్మ ఏ ఏ రూళ్ళు అతిక్రమిస్తోందో, ఏ ఏ మంత్రులు ఆవిడకి వేడుకచెలికాళ్ళలా ప్రవర్తిస్తున్నారో తెలుసుకోవలసిన బాధ్యత నీది కాదా?" వాటికి తగిన డోసిచ్చేననుకుంటూ వాడు కింద పారేసిన పేపరు అందుకున్నాను.

వాడు చెప్పింది పూర్తిగా అబద్ధం అనడానికి ఆస్కారం లేదు - సినిమాలవి, ఇతరమైనవి ప్రకటనలు తీసేస్తే మిగిలిన పత్రిక చాలా కొద్ది. అదే తిరగేస్తూ వాడిలాగే నేనూ ఫొటోలు చూడసాగాను. నాదృష్టిని ఆకట్టుకున్న ఫొటో అయిదోపేజీ మొదటికాలంలో ఉంది. ఎక్కడ చూశానో గుర్తు చేసుకోడానికి రెండు నిముషాలు పట్టింది.

"కనపడుట లేదు.

వయసు 14 సం. ఎత్తు 5' 2". చామనచాయ, ఎడమచెంపమీద పుట్టుమచ్చ. ఉంగరాలజుత్తు. ఆచూకి తెలిపిన లేక ఇంటికి తెచ్చి ఒప్పచెప్పినవారికి తగిన పారితోషికమివ్వబడును.

బాబూ, నీవు ఇల్లు వదలి వెళ్ళినదగ్గిర్నుంచి అమ్మ మంచినీరు త్రాగలేదు. ఎక్కడ ఉన్నను వెంటనే ఇంటికి రావలెను. నిన్ను ఏమీ అనము. డబ్బు కావలసినచో ఉత్తరము వ్రాసేది.

ఇట్లు

మిన్ను రాధయ్య

చింతాలపేట పోస్టు, కడప జిల్లా."

"మన ఊరువాడేన్రోయ్," అన్నాను రామకృష్ణకి ఆ ప్రకటన చూపిస్తూ. ఇంతకీ నాకూ కనపడని కుర్రకుంకకూ ఉన్న బాదరాయణం - నేను నాజానెడు పొట్ట పోషించుకోడానికి చింతాలపేట స్కూలులో లెక్కలటీచరుగా ఉండడం, అదే స్కూల్లో మాస్టర్ కిరణ్ అనబడే బాలహీరో మూడోఫారంలో చేరడం - బాలహీరో అనడంలో కేవలం వాగాడంబరం కాక ఔచిత్యముంది - కిరణ్ గత ఎనిమిదేళ్ళలోనూ ఒక పాతిక చిత్రాలలో నాయక, ప్రతినాయక, ఉపనాయక పాత్రలు - ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఆ పాత్రల చిన్నప్పటి పాత్రలు ధరించి ప్రజల, దర్శక నిర్మాతల మన్ననలందుకున్నాడు. మొదట్లో ఆడపిల్లలా వేసినా తర్వాత్తర్వాత హీరో రోళ్ళకి ఎదిగిపోయేడు. ఏదో ఒక బాలనేరస్థులకి సంబంధించిన చిత్రంలో అతడే ప్రధానపాత్ర కూడాను. గత సంవత్సరంలో బాగా పొడుగెదిగి, మొహం కోలనై, గొంతు విడి, నూనూగు మీసఛాయలు ముఖాన తేలి, అటు బాలహీరోగానూ ఇటు పూర్తి తారగానూ పనికి రాకుండా పోవడంతో మూల పడిన స్కూలు పుస్తకాలు మళ్ళీ వెతికి తీసేడు. అప్పట్లో ఒక బాలపత్రిక అతడి మూడు నెలలనాటినించి ఫొటోలతో ఒక ప్రత్యేక సంచిక వేసింది. ఒకసారి రేడియోవారు పిల్లలకై ప్రత్యేక కార్యక్రమంలో పరిచయం ఏర్పాటు చేశారు. బొత్తిగా కథానాయకుల అభిమానసంఘాల్లా ఆ కుర్రాడిపేరుమీదుగా అభిమానసంఘాలు బయల్దేరకపోయినా చాలామంది ప్రేక్షకులు - "వీడీ సినిమాలో ఉన్నాడే- బలే హుషారుగా ఉంటాడు - పదండి చూదాం," అంటూ చిత్రానికి వాడివునికిని ఒక ఎసెట్గా లెఖ్ఖ కట్టుకునేవారు.

ఇహ కుర్రాడిపరంగా చెప్పవలసింది - మంచి చురుకైనవాడు. ఆ చురుకుకారణంగా ప్రక్కవాడికి ఒక్కొక్కప్పుడు చురక పడడం కూడా కద్దు. ఆ స్కూల్లో కుర్రవాడిని చేర్చడానికి వస్తూనే వాడితల్లి వాడిప్రతిభ వివరించింది. వాడికి నటన అంటే మహాభిమానం. కనక స్కూలు వార్షికోత్సవాలలోనూ, విద్యేతర కార్యక్రమాల్లోనూ ఓపినంత ఉత్సాహం చూపి పాఠశాలకే వన్నె తేగల చిరంజీవిగా అభివర్ణించింది. అతడు ఏ ఏ సినిమాల్లో ఏ ఏ పాత్రలు ధరించిందీ, వాటికి ఏ ఏ మహామహులు ఏ ఏ విధంగా ప్రశంసలందించిందీ అలనాటి ఫొటోలు అన్నీ వివరించింది. హైదరాబాదులోనే ఉంటే చదువు సాగకుండా ఉందని, ఇక్కడికి తీసుకొచ్చినట్టు ఆఖరిమాటగా చెప్పింది. హెడ్ మాష్టరుగారు అన్నీ

చిర్నవ్వుతో విని ట్రాన్స్ఫర్ సర్టిఫికేటు మాత్రం అడిగి తీసుకుని అబ్బాయిని క్లాసుకీ, ఆ తల్లిని ఇంటికీ పంపించేశారు.

కిరణ్ క్లాసులోకి అడుగు పెడుతూనే నేటి సినిమాహీరోలా చిన్నప్పటి చూపొకటి అందరిమీదా పారేసి నాలుగోవరసలో సర్దుకున్నాడు. అక్కడ్నుంచి మేష్టరుకి కనపడకుండా చుక్కలాట ఆడొచ్చు. కాగితపు బాణాలు, వాటికి దీటు రాగల చూపులూ విసరొచ్చు. ఏవిధంగానూ లాభసాటి కానప్పుడు లేచి చక్కా పోవచ్చు. మూడవఫారం విద్యార్థులు అభిరుచులివీ అని నేను వక్కాణించబోను కాని కిరణ్ బాబు ధోరణి నాకలా అనిపించిందని మాత్రమే మనవి చేసుకుంటున్నాను. నాకెందుకో అతడిని అతడిఖర్మానికి వదలి, పాఠం చెప్పుకుపోవడమే ఉభయతారకంగా తోచింది. దరిమిలా స్టాఫ్ రూంలో ఇంకొక ఇద్దరు ముగ్గురు మేష్టర్లు కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చడం కేవలం యాదృచ్ఛికం.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందనీ, పుండు పుట్టగానే సలుపుతుందనీ పెద్దలు శలవిస్తారు. ఇంచుమించు యిదే అర్థవివరణతో వర్డ్స్వర్తు దొర మనిషికి తండ్రి పిల్లవాడు అని ప్రవచించేడు. కిరణ్ బాబు మొత్తంమీద చింతాలపేటలోని మానవాళికంతటికీ మార్గదర్శకుడై మెలగదల్చుకున్నపోకడలు పోసాగాడు. “చూచావటమ్మా యశోదమ్మా!” అంటూ అలనాటి గోపికాబృందం యశోదమ్మ ముంగిట మొర పెట్టుకున్నచందాన కిరణ్ బాబులీలలు కథలు కథలుగా ప్రచారం పొందేయి. అయితే సామ్యం అంతవరకే.

పోలికాపుగారి మామిడితోట గుత్తకి తీసుకున్న చింతాలు కాయలు సంతకి తోలి సొమ్మయినతర్వాత డబ్బు జమ చేస్తానన్నాడుట. పోలికాపుగారు డబ్బు జమ అయితేనే గానీ కాయలు కొయ్యడానికి వీల్లేదని కబురు పెట్టారు. ఈ సంగతి ఎలా తెలిసిందో కిరణ్ బాబుకి తెలిసింది.

“డబ్బుంచుకుని లేదంటున్నాడు. దొంగవెధవ. గట్టిగా నాలుగు దులిపితే వాడే రాలుస్తాడు,” అని పోలికాపుగారూ, “వూరికే ఆ బాబలా అంటారు కానీ కాలా యేలా బడితే ఆయనే పల్లకుంతరు. ఏరే ఎందుకు దీయాలా, ఆ కాయమ్మి ఆ సొమ్ములోంచే ఇత్తే పోలా,” అని చింతాలూ ఆలోచనలు చేస్తూనే ఉన్నారు - అదేదో లాంఛనప్రాయమైన డైలాగయినట్టు. కిరణ్ బాబుకి ఈ ద్వితీయార్థం తెలీలేదు.

ఫలితం రాత్రికి రాత్రి మామిడితోటంతా దుంపనాశనం! ఆ తర్వాత అటు చింతాలు గోడు కానీ ఇటు పోలికాపుగారి వ్యధగాని పట్టించుకునేవాడే లేకపోయేడు. వూరి వ్యవహారాలు ఇలా ఓ పక్క చక్కబెడుతూనే ఉన్నాడు. మరో పక్క మామూలుగా స్కూలికి హాజరవుతూనే ఉన్నాడు అందులోనే సందు చేసుకుని.

నవంబరునాటికి స్కూల్లో విశేషకార్యక్రమాలు పెట్టి వీలయితే చందాలు వసూలు చేసి ఆ డబ్బుతో చాచా నెహ్రూపేరుమీదుగా ఇంకేదైనా చేసి తనకీ మాలాటి అల్పజ్ఞులకూ ఉండుకున్నట్టి దేశభక్తి, మన

జాతీయనాయకునిపట్ల అనురక్తి తేటతెల్లం చేయాలని ఓ దుమారం లేవదీశాడు ఓ సుప్రభాతాన. చాలామందికి అదొక అద్భుతమైన, ఆచరణీయమైన ఆశయంగా భాసించేందేమో హెడ్ మాష్టరుగారితో సహా అందరూ సై అంటే సై అన్నారు.
చెప్పేదేఁవుంది - దాదాపు అన్ని వినోదకార్యక్రమాల్లోనూ కిరణ్ బాబు ఉండడమే కాకుండా - అదొక గర్వకారణంగా ప్రచారం ఇవ్వబడింది. వివిధ కార్యక్రమాల్లో ఒక అయిటమ్గా తెలుగు మేష్టరుగారు ఒక చిన్న మూకాభినయం ఏర్పాటు చేయనుంకించేరు. ఘట్టం సీతారాముల వనవాసం. సీత మాయలేడికై మనసు పడడం, శ్రీరాముడు సీతకి నచ్చచెప్పబోయి విఫలుడై మాయలేడిని వెంటడించడం, ఆర్తనాదం, సీత లక్ష్మణుని పంపడం, రావణుడు మాయభిక్షువై సీతకొరకు రావడం - ఇంతే. అంతా కలిపి ఒక పది నిముషాలు పడుతుంది స్టేజిమీద.
ఇందులో పంతులుగారు చేయదల్చుకున్నది సంభాషణలు తీసెయ్యడం - కేవలం అభినయంతో నడపదల్చుకోడం. ముఖ్యంగా కథ అందరికీ తెలిసిందే కనక మూకాభినయం రాణిస్తుందనుకున్నారాయన. అదీఁగాక ముందే వివరించినట్టు అన్నట్లో కిరణ్ బాబే కనక సంభాషణలన్నీ కంఠస్థం చేయడం, సులభసాధ్యం కాదని ఆయన అభిప్రాయపడి వుండొచ్చు.
అయితే చలనచిత్రక్షేత్రంలో రజితోత్సవం జరుపుకున్న బాలహీరో కిరణ్ బాబుకి అటువంటి అభిప్రాయం అవమానకరంగా తోచింది. సంభాషణలుండితీరాలనీ, తనకి కనీసం నాలుగు పద్యాలైనా యివ్వాలనీ రిట్ పడేశాడు. మోనోయాక్షనునించి ఇంగ్లీషుడ్రామావరకూ అన్నిట్లోనూ మాటలున్నాయి! మాటలు లేకుండా ముఖంలో ఎక్స్ప్రెస్ చూపడం కష్టతరం. అదీకాక సంభాషణలుండే సీత వేషం వేస్తానన్న సావిత్రి వెనక్కి తగ్గుతోంది. ఆడపిల్లల్లో ఆమాత్రం ముందుకొచ్చేవాళ్లు దొరకడం కష్టం వంటి వాదనలతో హెడ్ మాష్టరుగారిదగ్గర్నుంచి సావిత్రివరకూ నచ్చచెప్పగా ఒప్పుకున్నాడు. నామటుకు నేను "నువ్వుఖర్లేదు పోవోయ్" అందామనుకున్న మాట మింగేసి మరోపన్లోకి పోయేను.
అనుకున్ననాటికి అన్నీ సిద్ధం అయేయి. మొదట లేడికి బదులు లేడిచర్మం కప్పి యిద్దరు కుర్రనాగమ్మలని రంగంమీదకి తోలుదాం అనుకున్నారు గానీ ఒక ఘటికుడు నిజమైన లేడిపిల్లని - బంగారం కాదనుకోండి - తీసుకొచ్చాడు. ప్రేక్షకులు ఆసక్తితో చూస్తున్నారు. సీతారాములు రంగంమీదకి ప్రవేశించేరు. మాయలేడి ఒక సైడువింగులోంచి ఎదురు సైడువింగులో కనిపిస్తున్న గడ్డిమేటుమీదకురికింది. సీత దానిని తర్జనితో చూపిస్తూ తనకు కావాలన్నట్టు అంగన్యాసకరన్యాసాలతో విన్నవించుకుంది. ఆ క్షణంలో తెరవెనుక వున్నవారూ, రంగస్థలానికి కుడిపక్కన వున్నవారూ, ఎడమప్రక్క వున్నవారూ, ఎదుట ప్రేక్షకులూ ఏఁవిటేఁవిటని రిచ్చ పడేటట్టు శ్రీరామచంద్రులవారు

"కంటివె లక్ష్మణా ధరణికన్యక
కున్ గల జింకయాస, మున్గంటిమె
యిట్టి రూపమున్ ..."

అని పద్యం మొదలుపెట్టేరు. హెడ్ మాష్టరుగారు అవాక్కయిపోయేరు. తెలుగు పండితులవారు పళ్ళు నూరడం ప్రేక్షకులలో ముందు మూడు వరసలకి వినిపించి ఆ తరవాత కలకలంలో కలిసిపోయింది. ఆ వెనువెంటనే "బోర్ బోర్" అనో "వన్స్ మోర్" అనో తెలియకుండా కేకలు వినిపిస్తూనే వున్నాయి. నాటకం రసాభాసం అయిందనీ నేనూ, తెలుగు మేష్టారూ, మరొక నలుగురూ అనుకున్నామేమో కానీ చాలామంది అలా అనుకున్నట్టు కనిపించలేదు. అదొక హర్షదాయకమైన కొత్తదనంకింద తీసుకున్నారు. కిరణ్ బాబు సంగతి సరే సరి. నాలుగు తరాలకి లబ్ధప్రతిష్ఠుడై విరాజిల్లిన - ఇంతవరకూ కర్ణాకర్ణిగా మాత్రమే తెలివిడి అయిన తన ప్రతిభను సాధికారికంగా నిరూపించుకున్న నిజమైన వీరునివలె రొమ్ము విరుచుకు తిరిగాడు. అంతే కాదు- తనచర్యకు చిన్నెలుగా - మహా నటులు అదే విధంగా ప్రవర్తిస్తారనీ, అవే ప్రతిభావ్యుత్పత్తులనబడతాయనీ - అవుసరం అనుకుంటే ఫలానా సినిమాలోని ఫలానా సీనులో నటుని బాధ్యత ఎంత వుందో, దర్శకునిబాధ్యత ఎంత వుందో ఆ నటునికి వ్రాసి తెలుసుకోవచ్చనీ తెలియజేశాడు. అయితే కిరణ్ బాబుయొక్క ఈ అసంబద్ధపుచర్యవల్ల తనపాత్ర దెబ్బ తింది అని బాధ పడి అతడిని ఆ మాటే అడిగిందిట సావిత్రి.

ఈ తగవులు ఎక్కడికి దారి తీసేవో కానీ హెడ్ మాష్టరుగారు తొందరగా క్రిష్టమస్ శలవులు ప్రకటించేరు. సదరు శలవుల్లోనే నేను రామకృష్ణ ఇంట్లో మకాం ఏర్పరుచుకున్నదీ, "కనపడుట లేదు" అన్న ప్రకటనక్రింద కిరణ్ బాబు ఫొటో కన్నదీను. అర్ధసంవత్సరానికి పెట్టిన పరీక్షపేపర్లు దిద్దుకోవాలి నేను పోతానని శలవులు సగం అవుతూనే తిరుగుప్రయాణం పెట్టేను. రామకృష్ణ కూడా చదువుకోవలసింది చాలా ఉందని పట్నానికి ప్రయాణం కట్టాడు. రవంత చుట్టు తిరుగైనా కొంతసేపు రామకృష్ణతో గడపవచ్చన్న పేరాశతో నేనూ రైల్లోనే బయల్దేరాను సరాసరి బస్ వదులుకుని. దానివల్ల సాయంత్రం నాలుగ్గంటలకి చేరవలసిన వూరు రాత్రి తొమ్మిదిగంటలకి చేరుతాననంతే.

నాయుడుపేటలో రైలు చాలాసేపు ఆగింది.

"ఎదుర్కోలు కాబోలు," అన్నాడు రామకృష్ణ విసుగ్గా.

ఇద్దరమూ దిగి ప్లాట్ఫారంమీద పచార్లు చేస్తున్నాం. విదియచంద్రుడు ఓమారు తొంగి చూసి తప్పుకున్నాడు. "తెప్పవోలె చంద్రబింబం తేలిపోతూందం"టూ రామకృష్ణ కూనిరాగం తీస్తున్నాడు. వస్తున్నది పెద్ద బండి కాబోలు మా కోచి షటిల్లోకి మారి దారివ్వడానికి కదిలింది.

కన్నుమూసి తెరిచేలోగా రామకృష్ణ నాచెయ్యి విదిలించుకుని మాయిద్దరికీ మధ్యగా నిలబెట్టాడు - నేను తెప్పరిల్లి చూసేసరికి నావేపు బెదురు చూపు చూస్తూ, “మాష్టారూ! “ అంటూ నన్ను చుట్టేసింది సావిత్రి!

‘‘ఇదేవిట్రా. ఈ అమ్మాయిని నీకు తెలుసా?” అన్నాడు రామకృష్ణ.

“అవును. ఈ అమ్మాయి చింతాలుపేట రైతు కుటుంబానికి చెందింది. మాస్కూల్లో సెకండు ఫారం చదువుతోంది,” అని వాడికి సమాధానం చెప్పి, సావిత్రిని అడిగాను, “ఇక్కడికెలా వచ్చేవు? ఎందుకొచ్చేవు?” ఒక్క క్షణం ఆగి, “ఇంత అజాగ్రత్త ఏవిఁటి - మావాడు చూడకపోతే నిష్కారణంగా చచ్చి వుండేదానివీపాటికి,” అన్నాను మేష్టర్లకలవాటైన దర్పంతో.

సావిత్రి సన్నగా ఏడవడం తప్ప సమాధానం చెప్పలేదు.

“మీవాళ్ళతో వచ్చి తప్పిపోయేవా?” రామకృష్ణ అనునయంగా అడిగేడు.

లేదన్నట్టు తలూపింది.

“అంటే తప్పిపోలేదనా?మీవాళ్ళతో రాలేదనా?” రామకృష్ణ మళ్ళీ అడిగాడు.

ఈసారి ఆమాత్రం అంగవిన్యాసానిక్కూడా మేం నోచుకోలేదు.

ఇంకా విద్యార్థిదశనే అనుభవిస్తున్న రామకృష్ణ చిరాకు పడడంలో ఆశ్చర్యం లేదు. బి.ఎ. కాగానే చదువుకి స్వస్తి చెప్పి బడిపంతులుగా స్థిరపడ్డ నేను అప్పటికే చాలా జీవితం చూసిన అనుభవం గడించుకున్నానేమో వాడితో అన్నాను, “ఒరేయ్, కలికాలంలో జీవుడు అన్నగతప్రాణిగా పేర్కొనబడ్డాడు. ఈ అమ్మాయిమొహం గుడ్డివెలుగులో కూడా ఆకలితో నకనకలాడుతున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది. నేనలా స్టాలువేపు వెళ్ళి ఈ అమ్మాయికి ఏమైనా పెట్టించి తీసుకువస్తాను. నువ్వు రైల్లో కూర్చో,” అని చెప్పి స్టాల్వేపు తీసికెళ్ళాను సావిత్రిని.

బన్, రెండు బిస్కెట్లు తిని ఓ కప్పు టీ తాగినతరవాత ఆ అమ్మాయిలో కొంచెం తేరుకున్న లక్షణాలు కనిపించాయి. ఇంతలో రైలు బయల్దేరబోతున్నానని కేకేసి పిలిచింది. సావిత్రి చెయ్యి పట్టుకుని, “రా, రా” అంటూ బండివేపు లాగబోయేను.

సావిత్రి చెయ్యి విదిలించుకుని, “నేను రానం”టూ పరుగెత్తసాగింది. నేనూ గబగబ నాలుగడుగులు వేసి సావిత్రినయితే పట్టుకోగలిగాను కానీ రైలు అందలేదు. వెనుదిరిగి చూచేసరికి గార్డు తన కాబిన్లోకి పోతూ కనిపించేడు. ఈ ట్రైన్ తప్పిపోతే కనెక్షన్ దొరకదు కనక రామకృష్ణ వెళ్ళిపోయాడు. నాకేముంది ఇక్కడైనా బస్ ఎక్కవచ్చు.

“ఎందుకు రావూ?” సావిత్రిని ప్రశ్నించాను. కావలిసినంత సావకాశం ఇప్పుడు.

కాని సావిత్రిదగ్గిర విషయం రాబట్టడం అంత సుళువు కాదని తెలుసుకోడానికి నాకెక్కువసేపు పట్టలేదు. చెప్పడం ఇష్టం లేదనడం కన్నా ఎలా చెప్పాలని మధన పడుతోందేమో అనిపించింది. ఇంటిదగ్గిర ఆపిల్లని ఎవరూ ఏమీ అనలేదు. మరెందుకు భయం?

ఒక అరగంటసేపు కమ్మెచ్చులో పెట్టి సాగదీసినట్టు సాగదీయగా కిరణ్ బాబు పేరు బయట పడింది. మధ్య వాడిపేరెందుకు?

"కాదండీ! ఆరోజు డ్రామాలో నాకు సంభాషణలు లేవని చెప్పి, అతను పద్యాలు చెప్పాడు కదా. నాకూ మాటలు పాటలు పెడితే నేనూ అంతకంటె గొప్పగానే చేసి వుండేదాన్ని అన్నానండీ. దానికి 'నన్ను ఛాలెంజి చేస్తావా' అని నాజడ పట్టుకున్నాడు. ఈసారి జడ పట్టుకో మానాన్నతో చెప్తే నీతాట ఒలిచేస్తాడన్నాను. అలాగా అన్నాడు. ఆ మర్నాడు సాయంత్రం ..."

"సాయంత్రం" అందిస్తున్నట్టు అన్నాను.

"సాయంత్రం ... " సావిత్రి స్వరం జీర బోయింది.

"సాయంత్రం," ముందుకి వంగి వెన్ను నిమిరేను.

"సాయంత్రం అతనూ మరొకడూ కలిసి ... నన్ను ..."

నేను ఊహించుకోలేకపోతున్నాను. క్రమంగా మాటకీ మాటకీ ఎడం హెచ్చవుతోంది.

"అతనూ ... మరొకడూ ... నన్ను ఒక క్లాస్ రూంలో పెట్టి ... తలుపు ..."

సావిత్రి ఇంక చెప్పలేనన్నట్టు కూలబడిపోయి నాకాళ్ళు చుట్టేసింది. నేనలా స్థాణువునై ఎంతసేపున్నానో తెలీదు.

సావిత్రికి శతవిధాల నచ్చచెప్పి ఇంటికి తీసుకొచ్చాను. ఊళ్ళో అందరూ కిరణ్ బాబు పరారీ గురించి పరిపరివిధాలా అనుకుంటున్నారు. కారణం ఎవరికీ తెలియదట. ఇంట్లో కూడా ఏమీ సంఘర్షణలలాటివి జరగలేదట. మద్రాసో హైదరాబాదో వెళ్ళాడేమోనని వాకబు చేసారట కానీ ఆచూకీ ఏమీ దొరకలేదు. ఆ ఆకతాయి అభిరుచులకనుగుణంగా పాఠశాల లేదనీ, అందుకే కుర్రవాడు అలా మాయం అయిపోయాడనీ ఆ తల్లిదండ్రులు పాఠశాలపై నేరం ఆరోపించారు.

యాధార్థమైన నేరం మాత్రం జీవితపు గతుకుల్లో మరుగున పడిపోయింది.

000

నామాటగా - ఈకథ జనవరి 1972 తరుణ మాసపత్రికలో ప్రచురణ అయింది. చాలాకాలంగా వ్రాతప్రతి చూస్తున్నాను కానీ కథానిలయంలో చూసేవరకూ ఇది ప్రచురించినట్టు తెలీదు. నాకు అట్టే సినిమాలపిచ్చి లేకపోయినా, ఆరోజుల్లో సినిమాలు బాగానే చూసేననుకుంటాను. అప్పట్లో పిల్లలని

సినిమాల్లో పెట్టినప్పుడు, ఆ పాత్రలప్రభావం వారిమీద ఎలా ఉంటుందన్న ఆలోచనలకి రూపకల్పన ఇది.

కొంతకాలం క్రితం ఎక్కడో చదివేను గాంధీ సినిమాలో ప్రధానపాత్ర ధరించిన Ben Kingsley ఆ పాత్ర తనని నిత్యజీవితంలో ప్రభావితం చేసిందని అన్నాడు. మాఅమ్మాయి పిల్లలని సినిమాల్లో పెట్టడం ఉచిత కాదని అంది. ఎంచేత అని అడిగేను. వాళ్ళజీవితాలు నాశనం అవుతాయి అంది. హాలీవుడ్లో అందరూ అనలేను కానీ కొందరు బాలనటులుగా ప్రసిద్ధులయి తరవాత ఎందుకూ కొర గాకుండా పోతున్నారు. ఆత్మహత్యలకి పాల్పడినవారు కూడా ఉన్నారు.

ఈకథ రాసినప్పుడు నాకు ఇవన్నీ తెలీవు కానీ ఇప్పుడు మాత్రం ఈకథలో అనౌచిత్యం లేదనే అనిపిస్తోంది.

---------------

(నవంబరు 27, 2014)

# సమాప్తం